


శ్లో॥ నవామి ధన్వంతరి మాదిదేవం
సురాసురైర్వందిత పాదపద్మం
లోకే జరాబుగ్భయ మృత్యునాశం
ధాతారమీశం వివిదౌషధీనాం॥

## ఆయుర్వేదోద్ధారకులు



డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు

బి. ఏ., యం. బి. అండ్ సి. యం., భిషగ్రత్న.

ప్రెసిడెంటు : ఆంధ్ర ఆయుర్వేద బోర్డు, హైద్రాబాద్.

ఆయుర్వేదపునరోద్ధారకులు



పండిత డి. గోపాలాచార్యులవారు

సంపాదకులు



శ్రీ మోహన్

(ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి కార్యదర్శి.)

## ఆంధ్రప్రదేశ ఆయుర్వేద విజ్ఞాన గ్రంథమండలి మహారాజ పోషకులు



వెం॥ శ్రీ కవిరాజ కంభంపాటి నాగభూషణంగారు,

...గయ్యపేట, కృష్ణాజిల్లా.

... ఆయుర్వేద వైద్యమండలి,



మంత్రతీర్థ వైద్యప్రవీణ

శ్రీ ఇలిపిళ్ళ అప్పారావు పాత్రుడుగారు

విజయవాడ – కృష్ణాజిల్లా.

## ఆంధ్రప్రదేశ ఆయుర్వేద విజ్ఞాన గ్రంథమండలి మహారాజ పోషకులు



వైద్యశ్రీ వైద్యరాజ
శ్రీ జి. వి. రెడ్డి గారు,
ప్రొప్రయిటరు జి. వి. రెడ్డి అండ్ కో.,
గోపాలపురం, తూర్పుగోదావరిజిల్లా



మూలికావైద్య ప్రవీణులు
శ్రీ బాలరాజ మహర్షిగారు
భీమవరం



ఆయుర్వేదాభిమానులు
ఎనిబిల్లి నాగరాజుగారు,
విజయవాడ - కృష్ణాజిల్లా.



శల్యవైద్యప్రవీణ
యస్. చంగల్వారాజుగారు,
బోన్ సెట్టర్ - అనంతపురం.

# ★ ఆయుర్వేద చరిత్ర ★

రచన: శ్రీ భిషగ్వర దేశిరాజు నారాయణరావుగారు



### ఆయుర్వేద చరిత్రయందు కాలవిభజన

అమృతములోనెల్ల శ్రేష్ఠమయినదియు (ఆయుర్వేదో అమృతానాం శ్రేష్ఠం. చరక. సూ. అ 25) చతుర్విధ పురుషార్థ సాధకంబై శాస్త్రములలోనెల్ల పుణ్యతమ మయినదియు (పుణ్యతమో వేదో విదాం మతః. చరక. సూ. అ. 1), అనాదియు, శాశ్వతంబును, అనంతంబును, అపారంబును అయి, నానా దేశ వైద్యశాస్త్రములకెల్ల మాతయై కొందరిచే పంచమ వేదముగను ఉపవేదముగను బరిగణింపబడుచు బ్రహ్మ ప్రోక్తమై "ఆయుర్వేద"మనియెడి సుప్రసిద్ధ నామముచే వ్యవహరింపబడుచున్న హైందవ (దేశీయ) చికిత్సాశాస్త్రము యొక్క ఇతిహాసము (చరిత్ర) అతి పురాతనమయ్యు దాని (ఆయుర్వేదము)తో పాటు పునర్నవమయినది. అప్పటి నుండి ఇప్పటివరకును స్థిరముగ నుండుటయే నిందులకు నిదర్శనము. ఇట్టి ఆయుర్వేదముయొక్క జీవితచరిత్రను దాని జనన కాలమునుండి నేటివరకును :—

1 పురాతన యుగము
2 వైదిక యుగము
3 సంహితా యుగము
4 బౌద్ధయుగము
5. పౌరాణిక యుగము
6. మహమ్మదు యుగము
7. ఆంగ్లయుగము

అను నీ యేడు యుగ (కాల) ములలో విభజించి సౌకర్యముగ వర్ణింపవచ్చును

## పురాతన యుగము

పురాతన యుగమనగా చరిత్రాతీతమగు ఆదిమ కాలము. సృష్ట్యాదినుండి క్రీస్తుపూర్వము పదివేల సంవత్సరముల వరకు గల కాలము నీ యుగముగ నెంచవచ్చును ఈ కాలపు ప్రజలకెట్టి వ్యాధులు కలిగెనో, ఆ వ్యాధులకు వారెట్టి చికిత్సలను ఆచరించి యుండిరో మొదలుగా గల విషయములు మనకు అంతగ తెలియవు. ఇటీవల లభించిన పురాతనకాలపు ప్రజల అస్థుల కొన్నిటినుండి ఆకాలమునందుండిన కొన్ని వ్యాధులను శాస్త్రజ్ఞులు నిర్ణయించి యున్నారు ఆకాలపు ప్రజలకు కొద్దిద్రవ్యములయొక్క గుణములు మాత్రము తెలిసి యుండవచ్చుననియు, పచ్చిరసములు, చూర్ణములు మొదలుగా గల స్వల్పకల్పనలను మాత్రమే యా రూపములలో మాత్రము ఔషధముల నుపయోగించుకొనుచుండి యుండ వచ్చుననియు నమ్మవచ్చును.

## వైద్యశాస్త్రము దైవప్రోక్తము

వైద్యక వైజ్ఞానిక బీజములను ఆదిమమానవుం డెటుల గ్రహింప కలిగి యుండెనో యూహించుట మిక్కిలి కష్టతమమగు విషయము. ప్రాచీన కాలపు వారందరును తమ తమ (దేశీయ) వైద్యశాస్త్రము దైవప్రోక్తమని నమ్మియుండిరి. సృష్టికర్తయగు బ్రహ్మ ఆర్యులకును, థాట్ అను దైవము ఈజిప్టు వారికిని, అపోలో గ్రీకులకును, షెన్నంగ్ చైనావారికిని వైద్యశాస్త్రమునకు మూల పురుషులు. ఈ శాస్త్రోత్పత్తిని గురించి ఆ యా దేశీయ గాధల నేకములు కలవు. ఇట్టి గాధ లెటుల తెలుపుచున్నను, మానవుడు ప్రప్రథమమున వైద్యక విషయములను, ఎటుల గ్రహించి యుండినదియు స్థూలముగా భౌతిక దృష్టితో నిటు లూహింప వచ్చును.

## ప్రకృతియొక్క అద్ధిక ధర్మము

ఈ భూతలమునందు స్థూలదేహోత్పత్తి కలిగినది మొదలును ప్రకృతియొక్క అద్ధిక ధర్మమైన మరణముకూడ స్థూల దేహమును వెంటాడు నటుల నిర్ణయము గావింప బడియున్నది. ఇట్టిమరణము "జలమగ్నిర్విషం శస్త్రంక్షుద్వ్యాధిః పతనంగిరేః కించిదాసాద్య దేహీ ప్రాణైర్విముచ్యతే" అని బ్రహ్మపురాణము నందు తెలిపియున్నటుల జలాశయములయిన నదీ తటాకాదులలో పడుటచేతను, అగ్నిచేతను, విషపదార్థసేవనముచేతను, ఖడ్గాదిశస్త్రములచేతను, ఆకలిచేతను, వ్యాధులచేతను అభిఘాతములు కలుగుటచేతను, కొండలు మొదలయిన ఉన్నతప్రదేశములనుండి క్రిందపడుట చేతను, ఇట్టి నిమిత్తకారణ... మరణము సంభవించు చుండును. అందువలన ... నది మొదలును తనకు సంభవించుచుం... నుండియు, అభిఘాతముల నుండియు కొనుటకు తగిన ఉపాయములను కనుగొను...

ప్రయత్నించుచుండె ననుట నిక్కువము. (అట్టి ప్రయత్నములనే నేటికిని మనము ఆచరించు చున్నారము.)

## ప్రాకృతముగ గ్రహించుట

చరిత్రాతీత కాలములలో మానవులు అరణ్యగర్భముల యందును గుహాంతరములందును నివసించుచు ఫల, కందాదులను భక్షించి దేహపోషణ గావించికొనియున్న ఆదిమ దినములలో కొన్నిటి సేవన వలన శీతమును, కొన్నిటివలన ఉష్ణమును, మరికొన్నిటి వలన వాంతులును, మరికొన్నిటివలన విరేచనములును, కొన్నిటి వలన, దీపన పాచనాదులును, మరికొన్నిటివలన మరణముకూడ సంభవించియుండుట స్వానుభవమువలన గ్రహించుకొనుచు ప్రాకృతమయిన సహజ జ్ఞానముచే వాటి దుర్గుణములను నివారించుకొనుచు అప్పుడప్పుడు ఒకరి నొకరు కలిసికొనినపుడు వారి వారి ప్రత్యేకానుభవములను పరస్పరము తెలిసికొని యెట్టి యాహార సేవనచే నెట్టి గుణములు కలిగినదియు, నా గుణము లెటుల నివారింపబడినదియు, మొదలుగాగల విషయములను పరస్పరము సంప్రదించుకొనుట మొదలయిన సందర్భములనే వైద్యశాస్త్రముయొక్క ఆది బీజములు మానవుని మనోక్షేత్రమునందు ఎదపెట్టబడి యుండవచ్చునని భావింపవచ్చును.

## రోగిని రచ్చయందుంచుట

చరిత్రాతీతకాలపు ఆదిమవాసులు గురించి యేల! క్రీస్తుపూర్వము రెండు మూడు శతాబ్దముల వరకును రోగనివారణ విధానములను గురించి పురజను లొకరినొకరు సంప్రదించుకొనుచుండెడి యలవాటు కలవారైయుండి యున్నటుల చరిత్రల నుండి తెలియుచున్నది. హెరడోటస్ అను నాతడు క్రీ. పూ. 300 సంవత్సరములనాడు బాబిలన్ నగరమును సందర్శించి, ఆపట్టణమున వైద్యులు లేరనియు. అయినను ఒకనికి రోగము వచ్చినపుడు, ఆరోగిని యొకరచ్చయందు పెట్టెడివారనియు, నా మార్గమున వచ్చిపోవు వారిలో ప్రతియొకరును, నా రోగిని చూచుచు అట్టి లక్షణములు గల వ్యాధి వారిలో నెవరికయినను వచ్చినపుడుకాని, లేక కలిగినవారి నెవరినయినను జూచినపుడుకాని, దాని యుపశమనము కొరకు వారిచే నాచరింపబడిన విధానములను ఆరోగికికాని ఆరోగికి సంబంధించినవారికి గాని చెప్పుచుండెడి ఆచారము కలిగియుండిరని తెలిపియున్నాడు. రోగిని రచ్చయందు పెట్టకపోయినను ఇట్టి అలవాటును నేటికినిమనము అనుసరించుచునే యున్నాము. "రోగము రోష్టు, కాపురము గుట్టు" అను ఆర్యోక్తి జగద్విదితము.

## పశుపక్ష్యాదులనుండి గ్రహించుట

జ్ఞానము పెంపొందిన కొలదియు మానవుడు ప్రకృతి నుండి కూడ వైద్యక విషయములను గ్రహింప దొడంగెను. పశువుల నుండియు పక్షులనుండియు మానవుడు వైద్యకవిషయములను గ్రహించినటుల అధర్వవేదమునందు కలదు, ఇట్టి విషయములనే ప్లినీ అనెడి ప్రాచీన ప్రకృతి శాస్త్రవేత్తకొన్ని యుదాహరణపూర్వకముగ నిరూపించి యున్నాడు నీటిగుఱ్ఱము అమితముగ భుజించి శరీరము గురుత్వమును చెందినపుడు, తన శరీరమును వాడియైన రెల్లుపుల్లలకు పొడుచుకొని రక్తమోక్షణ కర్మను స్వయముగ చేసికొనుచుండు ననియు, అయిబిస్ అనెడి పేరుగల పక్షి అనారోగ్యమును చెందినపుడు వమన వస్తి కర్మలను స్వయముగ నాచరించి (తనపొడుగైన ముక్కుతో నీటిని గుదముద్వారా ప్రవేశింపచేసి) శోధనచికిత్సను చేసికొనుచుండు ననియు మొదలుగాగల ఇట్టి పనేక విషయములను తెలుపుచు, ఇట్టివాటి నుండియే మానవుడు పెక్కు వైద్యక విషయములను గ్రహించి యుండవచ్చునని నుడివియున్నాడు.

## భూతవైద్య ప్రారంభము

ఇటుల కొన్ని శతాబ్దములు గడచిన పిమ్మట రోగోత్పత్తిని గురించి వారల దృక్పథము సాంతముగ మార్పుచెందెను. సూర్య చంద్రాది గ్రహములు, పితృలు దైవస్వరూపములని వారు నమ్మి తదనుసారముగ, ఆహార విహారములందు సంభవించుచుండెడి లోపాదులచేగాక, పితరాదుల అభిచార అభిశాపములచే రోగములు కలుగుచుండుననియు నందులకు బలిహోమాది శాంతి కర్మలును, మంత్రములును, ప్రార్థనలును, తాయత్తులు, రక్షాబంధనములు, మొక్కుబడులు మొదలయిన తంత్రములే చికిత్సలని నమ్మి వాటియందే మునిగి తేలుచు ఓషధీ సంబంధమయిన చికిత్సలందు మనను చొరవనీయక వాటిని నిర్లక్ష్యము గావించి మానివేయుట కారంభించిరి ఒకొక వ్యాధికి ఒకొక దేవతను అధిష్ఠానముగ నెంచుచు క్రొత్తవ్యాధులు కలిగినపుడు వాని కధిష్ఠానములుగ నూతన దేవత నామములను (నేడు ఒకొక వ్యాధికి ఒకొక జీవాణువును సంబంధ పరచుచున్నటుల) సృష్టించి వాటికి సంబంధపరచు చుండిరి. చీనాదేశీయులు రోగముయొక్క ప్రతి యొక లక్షణమునకు నొకొక దేవతను కారణముగనెంచుచుండిరి.

## అర్చకుడే వైద్యుడు–దేవాలయమే చికిత్సాలయము

మానవుని ఆరోగ్యమంతయు భూతగణ స్వాధీనము నందుండునని ప్రాచీనకాలపు వారలెల్లరును నమ్ముటవలన వైద్యశాస్త్రమంతయు దేవతాలయార్చకులయొక్క స్వాధీనమందుండుటయేగాక, అర్చకుడే వైద్యుడుగను, దేవతాలయమే చికిత్సాలయముగను వ్యవహరింపబడు చుండెను. రోగము కుదిరినపుడు దేవునియొక్కయు, అర్చకునియొక్కయు మహిమగను, కుదరనపుడు రోగియొక్క లోపముగను నెంచుచుండిరి. దేవతార్చకుడే వైద్యుడుగ వ్యవహరించుచుండెడి సాంప్రదాయము అతి ప్రాచీన కాలమునుండియు నెలదేశములందును ఆచరణ

యందుండి ఇతరదేశములందు పోయినను మనదేశమునందు నేటి కిని ఆచరణయందుండుట విశేషము.

ఈ రోగకారక భూతములు రోగియొక్క శిరమునాశ్రయించి యుండుననియు, అందుచే, శిరమునకు రంధ్రము తొలుచుట వలన అవి యందుండి వెడలిపోవుననియు తలంచుచు కొన్ని దేశములవారు రోగి శిరమునకు రంధ్రములు తొలచుచుండిరి. దేవాలయములందు తడిగుడ్డలతో ప్రాణాచారములు పడుట, సోదుల నడుగుట మొదలయిన ఆచారము లన్నియు నీ కాలపు నాటివే. ఇట్టి ఆచారములు అనాగరీకములని యెంచబడుచున్నను, అనాగరీకులేమి నాగరీకులేమి, నేడుకూడ వీటిని ఎల్లరును ఆచరించుచునే యున్నారు.

సామాన్యముగా నిట్టి దేవాలయములు రమణీయమై రోగుల మనస్సున కాహ్లాదమును కలిగించునట్టి ప్రకృతి సౌందర్యశోభితమయిన పర్వతములమీదను, నదులయొడ్డు లందును తప్త, కుండాది జలాశయములందును నిర్మింపబడియుండును. జగత్ప్రఖ్యాతిగడించి అనాదినుండి నేటికిని ప్రతినిత్యమును వేలకు వేల యాత్రికుల నాకర్షించుచున్న శ్రీతిరుపతి వేంకటేశ్వరాలయము ఇట్టి యాలయములలో నొకటి.

ఇంతవరకు నీయధ్యాయమునందు వైద్యశాస్త్రోత్పత్తిని గురించి సామాన్యముగ తెలిపియుంటిమి. రెండవ అధ్యాయము నుండి కేవలము ఆష్టవైద్యశాస్త్రమయిన ఆయుర్వేదమును గురించిన చారిత్రక విషయములు తెలుపబడును.

## 2వ అధ్యాయము

# వైదిక యుగము

క్రీస్తు పూర్వము 10,000 సంవత్సరముల మొదలు 2500 సంవత్సరముల వరకు మధ్యగల కాలమును ఆయుర్వేద చరిత్రయందు వైదికయుగముగ నెంచనగును. ఈ కాలమందు మన దేశముయొక్క వైద్యశాస్త్ర పరిస్థితు లెటులుండెనో వేదములందు ఉదాహరింపబడిన వైద్యక విషయములనుండి కొంతవరకు తెలిసికొన వచ్చును.

### వేదములనగా ఏమి?

హైందవ వైజ్ఞానిక వాఙ్మయ మంతయు సామాన్యముగా శ్రుతులనియు, స్మృతులనియు రెండు ప్రధానతరగతులలో విభజింపబడియున్నవి. శ్రుతియనగా 'వినబడినది' యని యర్థము మన పూర్వఋషులు మన మతసిద్ధాంతములను యోగనిష్టలో అతీంద్రియ శ్రవణముచే విని యుండిరనియు నటులవారిచే వినబడిన అపౌరుషేయమైన వాక్యములే వేదములనియు హైందవుల నమ్మకము. వేదము అనగా జ్ఞానము అని అర్థము. అట్టి జ్ఞానము అనాదియగుటచే వేదములుకూడ అనాది యనియు, అయినను అయ్యవి నెవరిచే రచియింప బడినదియు తెలియక పోవుటచే నపౌరుషేయములనియు; నొకరినుండిమరియొకరు విని గ్రహించుటచే శ్రుతులనియు కూడ వ్యవహరింప బడుచున్నవి. ఇట్టిశ్రుతులు ౧ ఋగ్వేదము, ౨. యజుర్వేదము, 3 సామవేదము, ౪ అథర్వవేదము అని నాలుగు. వీటిలో ఋగ్వేద మతి ప్రాచీన తమమైనది. అథర్వవేదము కనిష్ఠమైనది. జ్ఞానము అనంతమగుటచే, వేదములుకూడ అనంతము లనియే వ్యవహరింప బడుచున్నవి

స్మృతి యనగా 'జ్ఞాపకము చేసుకొనబడినది' అని యర్థము స్మృతులు శ్రుతులను ఆధారపరచుకొని యందలి విషయములను జనసామాన్యమునకు తెలియునట్లు విపులీకరించునవి. ఇట్టి స్మృతులు 1 స్మృతులు, 2 ఇతిహాసములు, 3. పురాణములు, 4 ఆగమములు, 5 దర్శనములు అని ఐదు తరగతులుగ నుండును.

### వైద్యశాస్త్రమునకు వేదములే పునాది

వేదము లపౌరుషేయములు కావిందు, పౌరుషేయములు కానిందు, ఆయుర్వేదముయొక్క పునాదిరాళ్ళు వేదముల నుండియే గ్రహింపబడి యుండెననుట నిక్కువము.

### వైదిక వైద్యము విశేషముగ మాంత్రిక వైద్యము

ఈ కాలమునందు వైద్యశాస్త్రమంతయు దాదాపు మంత్రరూపముగ నుండెను ప్రతియొక వ్యాధికిని నివారణోపాయముగ ప్రత్యేక ప్రత్యేకమంత్రములు తెలుపబడియున్నవి. ఇట్టి మాంత్రిక వైద్యమే సంహితయుగములో దైవవ్యపాశ్రయ చికిత్సయని అగ్నివేశాదులచే వ్యవహరింప బడియున్నది. రాజయక్ష్మ, కుష్ఠు, పాండు, కాస, శ్వాస, గుల్మాది అనేక వ్యాధులకు మంత్రములు తెలుపబడి యుండుటచే నాకాలమునందీ వ్యాధులున్నటుల స్పష్టముకాగలదు. ఇట్టి వ్యాధులనుండి తమలను రక్షింపవలసినదిగా ఇంద్రాది దిక్పాలురను, సూర్య చంద్రాది గ్రహములను, వనస్పతులను ప్రార్థించుచుండిరి. గర్భోత్పత్తికొరకును, గర్భము స్రవించకుండుటకును, సుఖముగ ప్రసవము కలుగుటకును, సినీవాలి, సావిత్రి, కుహు, గంగ ఇత్యాదులను ప్రార్థించుచుండిరి, వీరలు వేదయుగములో ప్రసవ నిర్వహణములో సుప్రసిద్ధి జెందినవారులుగ తెలియుచున్నది.

## వేదములందలి కొన్ని ఓషధులు

మంత్రములతో పాటు అనేక ఓషధులుకూడ తెలుపబడి యున్నవి. ఇట్టి వాటిలో అప్ల, నీలిని, అశ్వగంధ, అరుంధతి (లాక్షు), నీలాంజన, బిల్వ, కాండవిష, కరంజ, ఖదిర, కృష్ణ, కుముద, పలాశ, పాఠ, ప్లాక్షు, పర్ణ, ప్రియంగు, త్రాయమాన, సువర్ణ, అసురి, సురూప, శ్యామ, (భృంగరాజ), పృశ్నిపర్ణి హరిణశృంగ, శతావరి, దూర్వ, రోహిణి, సహదేవి, అపామార్గ, కుష్టం, అజశృంగ, గుగ్గులు, అశ్వత్థ, న్యగ్రోధ, ప్రసారిణి, బ్రాహ్మణ (ఓషధీ విశేషము) ఇత్యాదులు ఋగ్వేదము నందును, అధర్వవేదమునందును, అనేకము లుదాహరింపబడి యున్నవి. మరియు మనకు అంతగ తెలియని జంగిడ, హరిత శాదికాష్ట ద్రవ్యములనేకములు, తెలుపబడి యున్నవి ఆ కాలపునాటి ఋషులు ఒకద్రవ్యముయొక్క గుణమును కనుగొనినవెంటనే, ఆ ద్రవ్యమును శ్లాఘించుచు ఋక్కులను కల్పించెడివారలు. ఋగ్వేదకాలమునాటికే ద్రవ్యగుణశాస్త్రమును సమగ్రముగ తెలిసినవాడే యుత్తమవైద్యుడుగ నెంచబడి యున్నటుల

> "యత్రౌషధీః సమగ్మతారాజానః సమితావివ
> విప్రః సఉచ్యతే భిషక్ రక్షోహామివ చాతనః"
> "శతంతేరాజన్ భిషజఃసహస్రముర్వీగభిరా సమతిస్తేఒస్తు"

మొదలుగాగల ఋక్కులనుండి తేటపడుచున్నవి, అదియును గాక నిట్టిఓషధులను, ఫలవంతములు, అఫలవంతములు, అపుష్ప వంతములు, పుష్పవంతములు అని నాలుగుతరగతులలో విభజించి యున్నటుల

> "యా ఫలినీర్యా అఫలా అపుష్పాయాశ్చ పుష్పిణీః
> బృహస్పతిప్రసూతాస్తా నో ముంచత్వం హసః"
> "ఓషధీః ప్రతిమదధ్వం పుష్పవతీ ప్రసూవరీః"

ఇట్టి ఋక్కులనుండి తెలియగలదు ఓషధులలో సోమ యనెడి లతా విశేషమునకు అగ్రస్థాన మీయబడెను. దీని రసపానము చేసి వారు ఆనందాబ్ధియందు మునిగి తేలుచుండిరి సోమను అమృతమని "అపామ సోమ అమృతా అభూవ" అని కొనియాడిరి. సోమయొక్క రసమును తీయవలసిన విధానము, తత్సంబంధమైన యంత్రాదు లనేకములు తెలుపబడి యున్నవి. కేవలము ఓషధులేగాక, లోహాది ఖనిజ ద్రవ్యములుకూడ తెలుపబడి యున్నవి. ఋగ్వేదముయొక్క 9-వ మండల మంతయు సోమను గురించియే తెలుపుచున్నది.

జలముయొక్కయు సూర్యరశ్మియొక్కయు గుణములను వారు చక్కగు గ్రహించియుండిరి. 'అప్స్వఒంతర మృతమప్సు భేషజమపాముత ప్రశస్తయే దేవా భవత వాజినః, ఉదకముల మధ్య అమృతముకలదు. ఉదకములందు భేషజము కలదు. మరియు నుదకములయొక్క ప్రాశస్త్యమును తెలిసికొనుటకు వేగిరపడుడు.

> "అప్సుమే సోమో అబ్రవీ దంత ర్విశ్వాని భేషజా"
> "శం నోదేవి రభిష్టయ అపోభవన్తు పీతయే శం యో భిరస్రవన్తునః"

దివ్యమయిన ఈజలములు మా అభీష్టముకొరకును పానము కొరకును సుఖప్రదములగును గాక ! మాకు అవి ఆరోగ్యమును సుఖమును గ్రుమ్మరించుగాక !

సూర్యునిగురించిన స్తోత్రము లనేకములు గలవు. అట్టి వాటిలో కొన్నిటి నిచట నుదాహరించెదను. పరమాత్ముని యొక్క సాంకేతిక ప్రతిమగా భౌతికమగు సూర్యుని సేర్పరుచుకొని దైనిక ప్రార్థనలో నతిపవిత్ర మయినదిగా మన ముచ్చరించుచున్న;

> "ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి।ధియో యోనః ప్రచోదయాత్"

భూలోక భువర్లోక సువర్లోకములకు అధిపతియై శ్రేష్ట మయిన ఓ సూర్యుడా! మాయొక్క బుద్ధిని వికసింపచేయుదువు గాక !

> "యే నాపావక చక్షసా భురణ్యంతం జనా అనుత్వం వరుణ పశ్యసి"

అన్నిటిని పవిత్రము చేయునట్టియు వ్యాధులను నివారించునట్టియు ఓ సూర్యుడా ! ప్రజలను ఏప్రకాశముతో రక్షించుచున్నావో (చూచుచున్నావో) దానిని స్తుతింతము

> "ఉద్యన్నద్య మిత్రమహ ఆరోహ న్నుత్తరాం దివం హృద్రోగం మమ సూర్య హరి మాణం చ నాశయ"

అందరకును అనుకూలప్రదమగు దీప్తినిచ్చు ఓ సూర్యుడా ! ఇపుడుదయించుచు ఎత్తైన అంతరిక్షమునం దెక్కుచు నీవు నా హృదయరోగమును పోగొట్టుము శారీరకాంతిని తగ్గించునట్టియు పచ్చని (పాండు) వర్ణముకు (శరీరమునకు) కలిగించునట్టియు (కామెర) మొదలగు (బాహ్య) రోగములను నశింపచేయుము.

"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" ఆరోగ్యమునకు గాని అనారోగ్యమునకుగాని, జ్ఞానాజ్ఞానములకుగాని, సర్వ జీవ

రోగములయొక్క ఉత్పత్తి, వృద్ధి, క్షయములకుగాని సూర్యుడే ఆధారమని వారు నమ్మి వైదికయుగ అనేక సూక్తములలో సూర్యుని ప్రార్థించు చుండిరి.

## వేదములలో త్రిధాతు పద ప్రయోగము

ఋగ్వేదమునందు త్రిధాతుపద ప్రయోగము గావించబడిన ఈ క్రింది ఋక్కు "త్రిర్నో అశ్వినా దివ్యాని భేషజా త్రిః పార్థివాని త్రిరుదత్తమద్భ్యః ఓమానం శంయోర్మమకాయ సూనవే త్రిధాతు శర్మ వహతం శుభస్పతీ"

"ఓ అశ్వినులారా! దివ్యమయిన ఓషధులను, పృథివియందు పుట్టిన ఓషధులను ఆకాశమునందు పుట్టిన ఓషధులను ఈ మూడు విధములయిన ఓషధులను ఇంతకు ముందు మాకు బృహస్పతి కుమారుడయిన "శం" అను వానికిచ్చి ఆరోగ్యమును కలిగించిన ఆయారోగ్య సుఖమును నా కుమారునకిండు. ఆరోగ్య (సుఖ) ప్రదమైన ఓషధులకు అధికారులగు ఓ అశ్వనీ దేవతలారా! త్రిధాతుసామ్యమును కలిగించి సుఖమును ప్రసాదింపుడు" అనియుండుట కాన్పించుటచే దోషత్రయ సిద్ధాంతము అప్పటికే ప్రచారమునందుండినటుల స్పష్టపడుచున్నది. ప్రఖ్యాత వేదవ్యాఖ్యానకర్తయగు శ్రీ సాయనాచార్యులవారు పై త్రిధాతుశబ్దమునకు వాత పిత్త శ్లేష్మము అనియు వీటి సామ్యావస్థ శర్మ అనగా సుఖమనియు వ్యాఖ్యానించిరి.

## అశ్వినీ దేవతల చికిత్సలు

దేవవైద్యులగు అశ్వినీ దేవతలు అనేక ఉత్తమోత్తమయిన శల్య, శాలాక్య, రసాయనాది చికిత్సలను చేసియున్నటుల శ్రుతి వాక్యములనుండి తెలియుచున్నది

"సద్యో జంఘాం ఆయసీం విశ్పలాయై" ఖేలుడను రాజుయొక్క భార్యయగు విశ్పల అను నామెకు యుద్ధములో కాలువిరిగినపుడు, ఇనుముతో జేయబడిన కృత్రిమకాలును సద్యస్కాలమునందే (అర్ధరాత్రివేళ) అశ్వనేయులు సంధానపరచినట్లును అటులనే

"తస్మా అక్షీనాసత్యా విచక్ష ఆధత్త మదస్రాభిషజా నార్వాన్"

కన్ను పోయిన వారలకు నేరోగదానియొక్క కన్నునుదెచ్చి యమర్చి యాశ్వినేయులు చికిత్సచేసి యుండిరనియు, ఇటుల కృత్రిమాంగసంధానాది బోధకశ్రుతులచే నాకాలపు వైద్యుల శల్య శాలాక్య కర్మ నైపుణ్యము సుబోధితము కాగలదు మరియు చరకులు అశ్వనేయుల చికిత్సలను గూర్చియు వారలను గూర్చియు రసాయన ప్రకరణములో మిక్కిలి శ్లాఘించి యున్నారు. వీరలకు "మధు విద్యాధికారము"ని చెప్పబడెను, మధువిద్యయనగ ఛేదింపబడిన శిరమును తిరిగి కాయముపకు సంధానపరచి పునర్జీవమును గొల్పునట్టు విద్యయని సాయనాచార్యుల తెలిపియున్నారు. వీరు రసాయన చికిత్సయందు ప్రవీణులై చ్యవనఋషికి వృద్ధాప్యము బోగొట్టి సుకన్యకు ప్రియుడగుటకు యువకునిగ జేసిరి. ఇట్టి వీరు యద్భుత ప్రకారముగల చికిత్సల నేకములు కలవు. వీటిని విస్తర రీతిచే నాటి నిపుణులు పొందు పరచుటలేదు

## మూడు తరగతుల వైద్యులు

ఈ కాలమునందు వైద్యులు శల్యవైద్యులనియు, భిషక్కులనియు, రక్షోఘ్నులనియు మూడు తరగతులవారుండిరి, వీరిని భిషగధర్వణులు మాంత్రిక వైద్యులు. ఏరెండవరకు ఓషధి సంపన్నమయిన చక్కని వనములందు నివాస మేర్పరచుకొని ప్రతిదినమును రోగులను వెదకికొనుచు ఒకపదములందు తిరుగుచుండెడివారలు (ఋగ్వేదము) వీరు వారి చికిత్సలకు ప్రతిఫలము పొందుచు జీవించుచుండినటుల :-

"ఓ వైద్యుడా! నీకు ఒక గుర్రమును, ఒక ఆవును, వస్త్రమును, అవియేగాక నా సర్వస్వమును నీకిచ్చెదను" (ఋ. 10-97-4) అనెడి వాక్యములనుండి తెలియగలదు.

## శారీరక విషయములు

ఈకాలపు ఆర్యులు జంతువులను నేటాడి వాటిమాంసమును భక్షించుటచేతను, యజ్ఞయాగాది క్రతువులందు అనేక జంతువులను బలియిచ్చుటచేతను ఆట్టి జంతువులయొక్క అంగ ప్రత్యంగ జ్ఞానమును చాలవరకు వారు పొందియుండిరి. ఆంత్రి, ధమనీ, హృదయ, క్లోమ, కుక్షి, నాడీ, ప్లీహ, సిర, వస్తి, వృక్కము, యకృత్ మొదలుగాగల అవయవ నామములు ఉదహరింపబడి యుండుటయే నిందులకు సాక్ష్యము. మరియు అథర్వవేదముయొక్క పదియవ మండలమునందు కాన్పించు పురుషశరీర వర్ణనమునుండి వారలకు అస్థిపంజర జ్ఞానము సంపూర్ణముగ నున్నటుల తెలియగలదు. అందు పార్ష్ణి, గుల్ఫ, అంగుళి, జంఘ, శ్రోణి, ఊరు, ఉరస్సు, గ్రీవ, కపాల, ఇత్యాది ఆపాదమస్తకమునకుగల అస్థుల నామములు చక్కగ వివరింపబడి యున్నవి.

## క్రిమి జ్ఞానము

ఈకాలపు ఆర్యులకు క్రిమిజ్ఞానము లేకపోలేదు క్రిములను దృష్టములనియు, అదృష్టములనియు, రెండు తరగతులలో విభజించి, అలగండు, శాలినా మొదలయిన భేదములను వర్ణించి యుండిరి. సూర్యరశ్మి క్రిమినాశకర మైనట్టు

వారు గ్రహించియుండిరి. ఇందునుగురించి అధర్వవేదమునందనేక మంత్రములు గలవు. శుక్ల యజుర్వేదాంతర్గత శ్లోక రుద్రమునందు

«అంతః స్థిత శరీరాః మనుష్యోపద్రవకారిణః గణ విశేషాః భూతాః ఉచ్యన్తే» అనగా మానవులకు ఉపద్రవమును కలిగించునట్టి సూక్ష్మజీవగణ విశేషములు భూతములని చెప్పబడును అని కలదు. ఇట్టి భూతములే దృష్టాదృష్టములగు క్రిములని మనము గ్రహింపనగును. క్రిములందు స్త్రీపురుష లింగ భేదమును వారు గుర్తించినటుల :-

"సర్వేషాం చ క్రిమీణాం సర్వాసాం చ క్రిమీణాం
భినద్మ్యశ్మనా శిరో దహామ్యగ్నినా ముఖం
ఇతో రాజా క్రిమీణా ముతైషాం స్థపతి ర్హతః
హతో హతా మాతా క్రిమిర్హతభ్రాతాస్వసా"

అనెడి శ్రుతినుండి తెలియుచున్నది.

ఇవ్విధముగ ఋగ్, అధర్వ వేదములందు గర్భప్రసవ, ద్రవ్యగుణ, శల్య, శాలాక్యాది వైద్యశాస్త్రీయ విషయములు అచటచట వెదజల్లబడినటుల కాన్పించుటబట్టి ఆ కాలమున వైద్యశాస్త్రము వేదములనుండి ప్రత్యేకము గావింపబడి యుండలేదనియు, తద్యుగానంతరము కాలక్రమమున కొందరు ఋషులు వేదాంతర్గత మయియున్న వైద్యక విషయములను తమ అనుభవములను సమ్మిశ్రమపరచి, ఒక ప్రత్యేక శాస్త్రముగాచేసి "ఆయుర్వేదము"ని నామకరణము గావించి దానికి ఉపవేదస్థానము నిచ్చునటుల తలపవచ్చును. వేదములందు «ఆయుర్వేదము» అనెడి పదమెచ్చటను ఉదహరింపబడక పోవుటయే నిందులకు నిదర్శనముగ నెంచవచ్చును. అదియునుగాక ఈ కాలమునందు వైద్యశాస్త్రమును గురించి ప్రత్యేకముగా వ్రాయబడిన గ్రంథములున్నటులకూడ నిదర్శనములు గానరావు.

«వేదములు ఆయుర్వేదము» అనెడి గ్రంథమును ప్రత్యేకముగ వేదాంతర్గతమయిన వైద్యక విషయములను గురించి ప్రచురింపదలచినందున ఈ యధ్యాయములో స్థాలీపులాక న్యాయమున కొలది విషయములను మాత్రము స్థూలముగ తెలిపి యుంటిని.

## 2వ అధ్యాయము

## సంహిత యుగము

వేదయుగానంతరము అనగ క్రీస్తుపూర్వము 2500 నుండి క్రీ. పూ. 600 సంవత్సరములవరకు ఆయుర్వేద చరిత్రయందు సంహిత యుగముగ వ్యవహరింపనగును. ఈ యుగములో హైందవులు (ఆర్యులు) సర్వశాస్త్రములందును మిక్కిలి పరిశోధనలు గావించి అరవిజ్ఞానమును సర్వతోముఖముగ నభివృద్ధి గావించి విస్తరింపజేసిరి. ఈ కాలమునందే భారత రామాయణములును అనేకసంహితలును రచియింపబడెననియు కురు పాండవ యుద్ధముకూడ ఈ యుగాదియందు జరిగియుండవచ్చుననియు కొందరు పరిశోధకుల అభిప్రాయము. వేదయుగమునందు అంకురావస్థయందుండిన వైద్యశాస్త్రమునకు కూడ గొప్ప పరిణామము సంభవించి మహత్తర రూపమును జెంది శాఖోపశాఖలలోనికి అభివృద్ధి జెందెను. షడ్దర్శనములుకూడ నీ యుగమునందే ప్రతిపాదింపబడియెను. ఆయుర్వేదీయులు తమ శాస్త్రఫలసిద్ధి కొరకు దార్శనికాది అన్యశాస్త్ర సిద్ధాంతముల తమ శాస్త్రమునకు అంగీకారమయినంతవరకు స్వీకరించి, వేదములందు స్థూలముగ ప్రతిపాదింపబడిన త్రిధాతు సిద్ధాంతమును విపులపరచి దాని నాధారపరచుకొని దాని చుట్టును నాయుర్వేద శాస్త్రమునంతయు శాస్త్రీయముగ నల్లి అష్టాంగములమీద అతీత బాహుళ్యమయి వైద్యక వాఙ్మయమును సృష్టించిరి.

ఆత్రేయుని శిష్యులయిన అగ్నివేశ, భేళ, జాతుకర్ణ, పరాశరాదులచే నాయుర్వేదమును గురించి అనేక సంహితలు రచియింపబడియెను. వీటిలో అగ్నివేశ సంహితయు, భేళ సంహితయందలి కొద్దిభాగములు మాత్రము తప్ప నితరములన్నియు నలభ్యమయియున్నవి. అగ్నివేశ సంహిత బౌద్ధయుగమున చరకునిచే సంస్కరింపబడి తదాది చరకసంహిత అనెడి నామముచే వ్యవహరింపబడుచున్నది. ఇటులనే దివోదాసుని శిష్యులయిన ఔపధేనవ, వైతరుణ, ఔరభ్ర, పౌష్కలావ, కరవీర్య, గోపురరక్షిత, సుశ్రుతాదులచేగూడ అనేక సంహితలు రచింపబడియెను. వీటిలో సుశ్రుతసంహిత మాత్రము లభ్యమయి యున్నది. కేవలము మానవ చికిత్సా శాస్త్రమును గురించియేగాక, పశుచికిత్సయందును గొప్ప పరిశోధనలు గావింపబడి అందునుగురించి యనేక సంహితలు రచియింపబడెను. అట్టివాటిలో ప్రస్తుతము మనకు లభ్యమయిన పాలకాప్యఋషి ప్రణీతమయిన «హస్తి ఆయుర్వేదము» లేక పాలకాప్యసంహిత అనెడి గ్రంథము ప్రధానమయినది.

ఇట్టి సంహితలనుండి ఆకాలపు వైద్యశాస్త్ర చారిత్రక విషయములు అనేకములు తెలియగలవు. అందువలన ప్రస్తుతమీ యధ్యాయమునందు ఆకాలమునందలి వైద్యశాస్త్ర పరిస్థితులను గురించి తెలుపుటకు పూర్వము ఆ యుగమునందు రచింపబడిన వైద్యక గ్రంథములను వివరించి అనంతరము చారిత్రక విషయములను, శాస్త్రీయ విషయములను తెలిపెదము. ఇట్టి గ్రంథములన్నియు దాదాపు నామమాత్రావశిష్టములై

వ్యాఖ్యాన కర్తల వ్యాఖ్యలలో మాత్రి ముదహరింపబడి యున్నది. అట్టి వ్యాఖ్యలనుండియే వీటియునికి యూహింప బడి యున్నది.

## 1. కాయచికిత్సా సంహితలు

౧ అగ్నివేశ సంహిత :- ఇది ఆత్రేయుని శిష్యుడగు అగ్నివేశునిచే రచింపబడిన గొప్ప గ్రంథము. ఇది బౌద్ధయుగములో చరకునిచేతను "ఇత్యగ్నివేశ కృతే తంత్రే చరక సంస్కృతే" అనంతరము కాశ్మీర దేశీయ పంచనదపురవాస్తవ్యుడగు దృఢబలునిచేతను సంస్కరింపబడి అగ్నివేశ సంహిత అనెడి నామమును కోల్పోయి చరకసంహిత అనెడి వ్యవహారిక నామముచేత ప్రసిద్ధిచెందియున్నది. "అతః తంత్రోత్తమం ఇదం చరకేణ అతిబుద్ధినా సంస్కృతం... అఖండార్థం దృఢబలో జాతః పంచనదేపురే..." మరియు నీ సంహిత "వింశం అధ్యాయశతం" నూటఇరువది అధ్యాయములను, "ద్వాదశ సహస్రీ" పన్నెండువేల శ్లోకములను కలిగి యున్నది.

మరియు ప్రస్తుతము మనకు లభించుచున్న చరకసంహిత, మూలగ్రంథమయిన అగ్నివేశ సంహిత గాక చరకునిచేతను, దృఢబలునిచేతను సంస్కరింపబడిన గ్రంథము. ప్రథమమున చరకునిచేత మూలగ్రంథమయిన అగ్నివేశ సంహితనుండి కొన్ని భాగములు సంక్షిప్తము గావింపబడియు, మరికొన్ని భాగములు విస్తరింపబడి యుండుటయేగాక తిరిగి దృఢబలునిచే చరకునిచే సంస్కృతి గావింపబడిన భాగములుకూడ పై విధముననే తిరిగి సంస్కృతి గావింపబడెను.

అంజననిదాన మనియెడు మరియొక గ్రంథమునుకూడ అగ్నివేశుడు రచియించెనని ప్రతీతి కలదు కాని, ఈ గ్రంథమును చక్రపాణి, విజయరక్షిత, శ్రీకంఠ దత్తాదులు వారల వ్యాఖ్యలలో నుదహరించి యుండకపోవుటచేత, వీరలకనంతర కాలములో చరక నామధేయముగల మరియొకనిచే రచియింపబడి యుండవచ్చునని సందేహపడవలసి వచ్చుచున్నది. అదియును గాక ఇందలిభావ ప్రాచీన సంస్కృతిమును పోలియుండక కొంత కఠినపద భూయిష్టమయి యున్నను అర్థము సులభ గ్రాహ్యమగునటుల విషయము చక్కగవివరింపబడి యున్నది.

౨ భేళ సంహిత :- ఈ గ్రంథముయొక్క వ్రాతప్రతి అసంపూర్ణస్థితిలో కొంతభాగముమాత్రము సుప్రసిద్ధ తంజావూరు పుస్తక భాండాగారమునందు కనుగొనబడి కలకత్తా విశ్వవిద్యాలయమువారిచే ప్రచురింపబడినది. ఈ వ్రాతప్రతి 1680లో వ్రాయబడినది. ఈ గ్రంథమునుండి విజయరక్షిత, శివదాసాదులచే అనేక ప్రమాణములు వారల వ్యాఖ్యానములలో నుదాహరింపబడి యున్నది. భేళసంహితయు, భాలుకి తన్త్రము రెండును ఒక గ్రంథమునకే నామములని కొందరి అభిప్రాయము.

అయితే డల్హణుడు తన సుశ్రుత సంహిత వ్యాఖ్యలో ఒకే సందర్భమున నీ రెండు గ్రంథములను (భేళ, భాలుకి) ఉదాహరించి యుండుటచే నీ రెండును ప్రత్యేక స్వతంత్ర గ్రంథము లయి యుండునని తెలియగలదు. భాలుకి తన్త్రము శల్య తన్త్రగ్రంథములలో నొకటిగ తోచుచున్నది. (శల్యతంత్రములలో క్రింద చూడుము).

భేళుడు తనసంహితయందు అనేకపర్యాయములు గాంధార దేశనామము నుదాహరించి యుండుటచే ఇతను గాంధార దేశీయుడయి యుండవచ్చునని బర్నెల్ దొర అభిప్రాయపడి యున్నారు. ఈ భేళుడు అగ్నివేశునియొక్క సహాధ్యాయి, ఈ సంహిత చరకసంహితను అనేక విషయములలో పోలి యున్నది.

3 జాతుకర్ణసంహిత :- ఇందుండి అనేక ప్రమాణములు చక్రపాణి, విజయరక్షిత, శ్రీకంఠ, శివదాసాదులచే నుదాహరింపబడి యున్నది.

౪. పరాశర సంహిత :- విజయ రక్షిత, శ్రీకంఠ, శివదాసాదులు వారల వ్యాఖ్యలలో ఇందుండి అనేక ప్రమాణముల నుదాహరించి యున్నారు.

అంగదేశపురాజగు రోమపాదునిచే హస్తి ఆయుర్వేదోపదేశనిమిత్తము ఆహ్వానింపబడిన ఋషులలో నీ పరాశరుడొకడుగ నున్నటుల పాలకావ్య సంహితయందు తెలుపబడి యున్నది.

౫. హారీత సంహిత :- చక్రపాణి, విజయరక్షితులు దీనిని తమ వ్యాఖ్యలలో నుదాహరించి యున్నారు. ప్రస్తుతము హారీత సంహిత అనెడి పేరులో మనకు లభ్యమగుచున్న అచ్చు పుస్తకము ఇది కానటుల తోచుచున్నది. ఈ ముద్రిత గ్రంథములో చక్రపాణి, విజయ రక్షితులచే నుదాహరింపబడిన ప్రామాణిక వచనములు కాన్పించుటలేదు. కొందరు హారీత సంహితయు, ఆత్రేయసంహితయు రెండును నొకటేయని అభిప్రాయపడి యున్నారు. కాని భావమిశ్రుడు ఆత్రేయ సంహితనుండి యుదాహరించిన వాక్యములు హారీతసంహిత యందు కాన్పింపకపోవుటచే నీ రెండును వేర్వేరు గ్రంథములై యుండునని తలచవలసి వచ్చుచున్నది.

౬. క్షారపాణి సంహిత :-విజయరక్షిత, శ్రీకంఠదత్త, శివదాస చక్రపాణులు ఈ గ్రంథమును తమ వ్యాఖ్యానములలో ఉదాహరించి యున్నారు.

ఈ యారు సంహితలును ఆత్రేయ సాంప్రదాయ సంహితలు, ఈ సంహితాకర్తలు ఆత్రేయుని శిష్యులు.

౭. ఖరనాద సంహిత :- విజయరక్షిత, అరుణదత్త, హేమాద్రి మొదలగు వారలచే నీ సంహిత ఉదాహరింపబడి యున్నది. హేమాద్రి వ్యాఖ్యలో ఉదాహరింపబడిన ఈ గ్రంథ ప్రమాణములనుబట్టి చూచినయెడల ఇతర వ్యాఖ్యాన కర్తలగు విజయలక్షిత, అరుణ దత్తాదులచే నుదహరింపబడిన ఖరనాద సంహిత వేరుగ నున్నటుల తలచవలసి వచ్చుచున్నది. అందువలన హేమాద్రిచే నుదహరింపబడిన ఖరనాద సంహితయు, విజయరక్షాదులచే నుదాహరింపబడిన ఖరనాదసంహితయు ఏకనామముగల ఇద్దరిచే ప్రత్యేకముగ రచింపబడిన ప్రత్యేక గ్రంథములుగ నుండవచ్చును

౮. విశ్వామిత్ర సంహిత :- చక్రపాణి తనచరక, సుశ్రుత వ్యాఖ్యలలో ఇందుండి అనేక ప్రమాణముల నుదాహరించి యున్నాడు. శివదాసుడు తన చక్రదత్తవ్యాఖ్యలో దీని నుదాహరించి యున్నాడు.

౯. అత్రిసంహిత :- ప్రాచీన సంహితకారులు ఎవరును దీని నుదాహరించి యుండకపోవుటచే, దీనియొక్క ప్రాచీన తను గొంతవరకు సందేహపడవలసి వచ్చుచున్నది. ఈసంహితయొక్క కర్తృత్వమునుగురించి భేదాభిప్రాయములుగలవు.

ఈపై నుదాహరింపబడిన గ్రంథములేగాక, మార్కండేయ అశ్విని, భారద్వాజ, భానుపుత్రి మొదలుగాగల సంహితలు మరికొన్ని యుండి యున్నటుల తెలియుచున్నది.

## 2 శల్య చికిత్సా సంహితలు

౧. సుశ్రుత సంహిత :- ప్రస్తుతము మనకు లభించుచున్న సుశ్రుత సంహితకు ఇది మూలగ్రంథముగ నెంచబడుచు వృద్ధ సుశ్రుత సంహిత అనెడి పేరుతో వ్యవహరింపబడుచున్నది. కొందరు ఆయుర్వేదీయులు వృద్ధసుశ్రుత సంహితకును ప్రస్తుత సుశ్రుతసంహితకును భేదమును పాటించక రెండును ఒకటేయని తలచుచున్నారు. కాని చక్రపాణి వ్యాఖ్యాన కర్తయగు శివదాసు తన వ్యాఖ్యలో వృద్ధసుశ్రుతమును విడివిగ నుదాహరించి యుండుటచే రెండును నొకటేయనితలచుటకు వీలులేదు.

సుశ్రుతసంహిత బౌద్ధయుగములో నాగార్జునిచే సంస్కరింపబడియు, అగ్నివేశ సంహితవలె నామాంతరమును చెందక సుశ్రుత సంహితఅనియే నేటికిని వ్యవహరింపబడుచున్నది.

౨. ఔపధేనవ తంత్రము :- ఈసంహిత సుశ్రుతసంహిత యందు ఉదాహరింపబడియుండుటేగాని అంతకుమించి మరి చటను అంతగ దీనిపేరు గానరాదు అయినను డల్హణుడు తన సుశ్రుత వ్యాఖ్యలో దీని నుదాహరించి యున్నాడు.

3. ఔరభ్రి తంత్రము :- పై రిమార్కులే దీనికికూడ వర్తించును.

౪. పౌష్కలావత తంత్రము :- ఇదిచక్రపాణిచే సుశ్రుత వ్యాఖ్యలో నుదాహరింపబడి యున్నది.

౫. కరవీర్య తంత్రము :- సుశ్రుత సంహితలో నిది తెలుపబడి యున్నది. వ్యాఖ్యానకర్తల కాలమునాటికే అనగా 13వ శతాబ్దమునకే ఇది చాలభాగము శిథిలమయినట్లు తోచుచున్నది. వ్యాఖ్యాన కర్తలచే నిందుండి బహు స్వల్పముగ ప్రమాణము ఉదాహరింప బడియున్నది.

౬. గోపుర రక్షిత తంత్రము :- ఈ తంత్ర నామము వ్యాఖ్యానములలో పెక్కుచోట్ల ఉదాహరింపబడి యున్నది. సుశ్రుతునకు సమకాలికులగు గోపుర, రక్షిత అనెడి ప్రత్యేక ఇద్దరు గ్రంథకర్తలచే రెండు ప్రత్యేక సంహితలు రచియింపబడెనని చాలమంది అభిప్రాయము.

కాని వ్యాఖ్యానకర్తలు ఈ గ్రంథము నుదాహరించినపుడెల్లను, "గోపుర రక్షిత" అని ఏకవచన ప్రయోగము చేసి యుండిరేకాని "గోపుర రక్షితౌ" అని ద్వివచన ప్రయోగము చేసి యుండకపోవుటచే, ఇద్దరుగాక నొకరేయని నమ్మదగి యున్నది. ఈ ఆరును ధన్వంతరి సాంప్రదాయక సంహితలు

౭ వైతరణ తంత్రము :- డల్హణుడును, చక్రపాణియు తమ వ్యాఖ్యలలో నీ గ్రంథమునుండి అనేకచోట్ల ప్రమాణముల నుదాహరించియున్నారు. ఈగ్రంథమునుండి వ్యాఖ్యాన కర్తలచే నుదాహరింపబడిన ప్రమాణముల సంఖ్యనుబట్టిచూడ ఇది సుశ్రుతసంహితకంటె విస్తారమయిన గ్రంథముగ తోచుచున్నది. సుశ్రుతమునందు లేని విషయములు ఇందు పెక్కులున్నటుల వ్యాఖ్యలనుండి తెలియుచున్నది.

౮. భాలుకి తంత్రము :- చక్రపాణిచే నిందుండి ఉదాహరింపబడిన యంత్రశస్త్రాదుల వర్ణనలనుబట్టి చూడగ నిది శల్య తంత్రములలో ప్రధానమయిన వాటిలో నొకటిగ యుండియుండవచ్చునని తోచెడిది. డల్హణుడు, శ్రీకంఠదత్తు, విజయరక్షితుడు వారల వ్యాఖ్యలలో దీనినుదాహరించి యున్నారు. ఇదియు భేళసంహితయు కొందరు తలచుచున్నట్లుగా నొక్క గ్రంథము కాదనియు, వేర్వేరుసంహితలనియును తెలియవలెను.

౯. భోజసంహిత :- సుశ్రుతునకు సమకాలికుడయిన భోజ మహర్షిచే నీ సంహిత రచియింపబడెనని డల్హణుని అభిప్రాయము కనుక, రాజమార్తాండాది గ్రంథకర్తయు ధారాధి

పరిపాలకుడును అయిన భోజరాజు దీని కర్త కాదని తెలియుచున్నది. కొందరు భోజరాజు దీనికర్తయని భ్రమపడుచున్నారు. వ్యాఖ్యానకర్తలచే దీనినుండి తీసికొనబడిన ప్రమాణములనుబట్టి చూడ నిదియు విస్తారమయిన సంహితవలె నే తోచుచున్నది.

౧౦. కపిల సంహిత :- సుశ్రుత సంహిత, నిదానము వీటి వ్యాఖ్యలలో నీ గ్రంథమునుండి ప్రమాణము లుదాహరింపబడియున్నవి.

౧౧ గౌతమ సంహిత :- పై రిమార్కులే దీనికిని వర్తించగలవు.

## 3. శాలాక్య చికిత్సా సంహితలు

౧. చాక్షుష్య తంత్రము :- దీనికి చాక్షుషేయ తంత్రమని మరియొక పేరుగూడ కలదు. దీనిని శ్రీకంఠదత్తు తనవ్యాఖ్యలలో తెలిపి యున్నాడు.

౨. గార్గ్య తంత్రము :- డల్హణుడు దీని నుదాహరించి యున్నాడు.

3. గాలవ తంత్రము :- పై రిమార్కు దీనికి కూడ వర్తించును.

౪. కాంకాయన తంత్రము :- చరకుడు తన సంహితలో అనేక ప్రదేశములందు ఈ కాంకాయనుని ఉదాహరించియున్నాడు ఇతడు బాహ్లీక వైద్యుడు. "కాంకాయనశ్చ బాహ్లీకో బాహ్లీక భిషజాం వరః" (చరక. సూ. 16-6). డల్హణుడు మాత్రము దీని నుదాహరించియున్నాడు. ఇతర సంహితలలో దీని పేరు అంతగ కన్పించునటుల తోచదు.

౫. కరల తంత్రము :- ఈ తంత్రము కరలభట్టు అను వానిచే రచియింపబడెనని డల్హణుడు తెలిపియున్నాడు. భట్టు శబ్దము ప్రాచీన ఋషుల కెవ్వరికిని యున్నయటుల తెలియదు అందుచేత నిది యంత ప్రాచీనగ్రంథము కాదేమో యని తలచవలసి వచ్చుచున్నది. అయినను డల్హణుడు శ్రీకంఠుడు మొదలయినవారు ఇది ప్రాచీన గ్రంథమని తెలిపి యున్నారు.

౬. కృష్ణాత్రేయ సంహిత :- ఈ సంహితయొక్క కర్తను గురించి భేదాభిప్రాయములు కలవు. పునర్వసు ఆత్రేయుడే యీ గ్రంథముయొక్క కర్త అని కొందరి యభిప్రాయము. కాని శ్రీకంఠదత్తుని యొక్కయు శివదాసుని యొక్కయు వ్యాఖ్యలను సూక్ష్మముగ పరికించిన యెడల కృష్ణాత్రేయుడును, పునర్వసు ఆత్రేయుడును వేర్వేరు పురుషులని తెలియగలదు.

౭. నిమి తంత్రము :- నిమి తంత్రము విదేహ తంత్రము రెండును ఒకటేయని పెక్కుri యభిప్రాయము. కాని రెండును వేరు అని తెలియుచున్నది. (విదేహ తంత్రము క్రింద చూడుము) దీనినుండి శ్రీకంఠదత్తుడు ప్రమాణములు చూపియున్నాడు.

౮. శౌనక తంత్రము :- అథర్వ వేద సంబంధమయిన శౌనక సంహిత కర్తయే దీని కర్తయని కొందరియభిప్రాయము. ఈతడు వేదయుగమునాటివాడయినను, సంహితయుగమునాటి వాడయినను, ఏకాలపునాటి వాడయినను, ఇతనిని చరక, సుశ్రుతు లిద్దరును గర్భవృద్ధి సందర్భములో తెలిపి యున్నారు. ఇతనిని మద్రదేశ వాసిగా చరకుడు తెలిపి యున్నాడు. ఈ సంహితనుండి చరక సుశ్రుతములలో గర్భవృద్ధి సందర్భంలో నుదాహరింపబడిన విషయములు వ్యతిరేకములుగ నుండుటచూడ చరకునిచే నుదాహరింపబడిన శౌనక తంత్రమును సుశ్రుతునిచే నుదాహరింపబడిన శౌనక తంత్రమును వేరు వేరు గ్రంథములయి యుండునని భావించనగును.

డల్హణుడు తా నుదహరించిన విషయములు మద్రదేశీయుడయిన శౌనకునివని తెలిపియున్నాడు. డల్హణునియొక్కయు చక్రపాణియొక్కయు ఈ గ్రంథమునుండి వారు ఉదహరించిన విషయములనుబట్టి చూడ ఇందు కేవలము శాలాక్య శాస్త్ర విషయములే గాక, శారీరక విషయములును ద్రవ్యగుణ విషయములును కూడ విశేషముగ నున్నటుల తెలియగలదు.

౯. విదేహ తంత్రము :- తన శాలాక్య తంత్రభాగము ఈ తంత్రము నాధారపరచుకొనియే రచియింపబడెనని సుశ్రుతుడు తెలిపియున్నాడు. ఇయ్యది విదేహరాజుచే రచియింపబడెనని నమ్మబడి యున్నది. ఇంతకు పూర్వము తెలుపబడి యున్నటుల నియ్యది నిమితంత్రము గాక వేరు గ్రంథమయి యున్నది.

ఈ తంత్రమునుండి డల్హణుడును, విజయరక్షితుడును శ్రీకంఠదత్తుడును వివిధ ప్రమాణముల నుదాహరించియున్నారు. డల్హణుడును, శ్రీకంఠదత్తుడును ఒకేవిషయమును గురించిన సందర్భములలో నిమితంత్రమునుండియు విదేహ తంత్రమునుండియు ఉదాహరించి యున్నారు. "జనకో విదేహ" అనెడి చరక వచనము ననుసరించి యీ విదేహతంత్రము రాజర్షియగు జనకునిచే రచియింపబడి యుండవచ్చునని నమ్ముటకు అవకాశము కలుగుచున్నది.

## 4. భూత విద్యా సంహితలు

వ్యాఖ్యానములలో వీటిని గురించిన ప్రత్యేక సంహితలు ఎచ్చటను నుదాహరింప బడియుండక పోయినను, ఒకప్పుడు ఈ భూత చికిత్స మిక్కిలి ప్రచారములో నున్నటుల తెలియ గలదు. ఇందును గురించిన విషయములు ప్రస్తుత మీ గ్రంథ ములలో మాత్రము ఒకభాగముగ నుదాహరింపబడి యున్నవి.

౧. సుశ్రుత సంహిత_ఉత్తరస్థానము. అధ్యాయము 6,
౨. చరక సంహిత - చికిత్సాస్థానము - అధ్యాయము 8,
3. వాగ్భటము - ఉత్తరస్థానము అధ్యాయము 4, 5,

ఈభూతవిద్య అతిప్రాచీనకాలములో ప్రచారమునందుండి వ్యాఖ్యానకర్తల కాలమునాటికే వెనుకంజ వేసినటుల వారలు ఇందును గురించి ఉదాహరింపక పోవుటనుండియే తెలియు చున్నది.

## 5. కౌమారభృత్య సంహితలు

౧. హిరణ్యాక్ష తంత్రము :— శ్రీకంఠదత్తుని వ్యాఖ్యను బట్టి చూడగ నీతంత్రము కేవలము కౌమారభృత్య తంత్రమని తెలియ గలదు.

౨. కాశ్యప సంహిత :— ఈ పేరుతో రెండు సంహితలు కలవు (అగద తంత్రములలో చూడుడు.) ఇటీవల బొంబయి, శ్రీ యాదవజీ త్రికంజీ ఆచార్యవారిచే నీపేరుగల సంహిత యొకటి ప్రచురింపబడి యున్నది. దీనికి వృద్ధజీవకతంత్రమని కూడ మరియొక పేరుకలదు. ఇది ప్రధానముగా బాలరోగము లను గురించి వివరించు చున్నది.

3. సుశ్రుతుడు తన సంహితలో ఉత్తరస్థానమునందు 12 అధ్యాయములు కౌమార భృత్యంక్రింద వర్ణించియున్నాడు.

౪. కౌమారభృత్యంత్రము :— ఈ గ్రంథమును చక్రపాణి తెలిపియున్నాడు. దీని కర్త ఎవరయినదియు తెలియదు. రావణ కృత కౌమారభృత్యము ఒకటి కలదు; కాని యీ రావణుడు సీతాపహరుడయిన లంకాధీశ రావణుడో మరి యెవరో నిర్ణ యించుట కష్టముగనున్నది.

౫. జీవకాది అన్యతంత్రములు :— కౌమారభృత్యమును గురించిన తంత్రము లనేకమును వరించునటుల తెలియుచున్నది. డల్లణాచార్యులు సుశ్రుత ఉత్తరస్థానమునకు వ్యాఖ్యానము రచించుచుటలో, జీవక, పార్వతక, బంధక తంత్రముల నుదా హరించి యున్నాడు. వీరిందరును బౌద్ధులు. జీవకుని గురించి బౌద్ధయుగములో చూడనగును.

## 6. అగద చికిత్సా సంహితలు

౧. కశ్యప సంహిత :— డల్లణ, చక్రపాణి శ్రీకంఠుల వ్యాఖ్యలలో ఈ సంహితనుండి ప్రమాణము లుదాహరింప బడి యున్నవి. ఈ గ్రంథ స్వభావమును గురించి అభిప్రాయ భేదములు కలవు. కొందరు ఇది కేవలము కాయచికిత్సా గ్రంథమనియు, మరికొందరు అగద చికిత్సా గ్రంథమనియు తలచు చున్నారు. ఈ కశ్యపుడు పరీక్షిన్మహారాజువద్దకు వేతెంచుచున్న తక్షకునికి తన చికిత్సా ప్రభావమును ప్రద ర్శించిన కశ్యపుడేయనియు అందువలన నిది అగద చికిత్సా గ్రంథమని కొందరి యభిప్రాయము. చరకమునందు ఉదాహ రింపబడిన కశ్యపుడును యీ గ్రంథకారుడును వేరయి యుండ వచ్చును.

౨. ఆలంబాయన సంహిత :— ఇయ్యది శ్రీ కంఠదత్తునిచే నుదాహరింప బడియున్నది.

3. ఉశనహ సంహిత :— ఈసంహిత నాధారపరచు కొనియే కౌటిల్యుడు తన అర్థశాస్త్రములో విష చికిత్సా విధా నములను, అమృత పరీక్షావిధానములను ఉదాహరించి యున్న టుల నమ్మబడి యున్నది.

౪. శౌనక సంహిత :— ఇది యవనులచే యవనభాష లోనికి భాషాంతరీకరింపబడి సుప్రసిద్ధ జర్మనీయ పండితుడగు మోక్షమూలరుచే ప్రథమమున కనిపెట్టబడి యున్నది.

౫. లాట్యాయన సంహిత :— డల్లణ వ్యాఖ్యలో ఇందలి విషయము లుదాహరింప బడియున్నవి.

౬. బృహస్పతి సంహిత :— ఈ పేరుగల గ్రంథమొకటి యుండునటుల తెలియుచున్నది.

## 7. రసాయన చికిత్సా సంహితలు

౧. పాతంజలి సంహిత :— వ్యాఖ్యానకారులచే పెక్కు సందర్భములలో నీ సంహిత ఉదాహరింపబడి యున్నది పాతంజలియు చరకుడును నొకరేయని కొందరి మతము. బౌద్ధ యుగములో చరకునిక్రింద చూడుము.

౨. నాగార్జున తంత్రము :— నాగార్జున నామధేయముగల ఋషి ప్రణీతమయిన గ్రంథమని కొందరి యభిప్రాయము. ఈతడు చక్రపాణిచే నుదాహరింప బడియున్నాడు పాటలీ పుత్రనగరమునందుగల శిలాస్తంభముమీద కాన్పించు చున్న పేరు గల బౌద్ధుడయిన ఆచార్య నాగార్జునుడే దీని కర్తయని కొందరి యభిప్రాయము. నాగార్జును లనేకులు గలరు. వీరలను గురించి బౌద్ధయుగములో చూడనగును. (తరువాయి 189వ పేజీలో)

# ★ ఔషధపాక పరిజ్ఞానము ★

భిషగ్వర, ఆయుర్వేదభూషణ
స్వర్గీయ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

## మందునువండు పాత్రలయొక్క వివరణము.

మందును కాచకుప్పె పింగాణీగిన్నెలు మొదలగు ననేక పాత్రలయందు వండవచ్చును. అడుగున గుండ్రముగను మూతి పొడుగుగను నుండి దళసరిగనుండు తేజాప సీసాలనబడుకుప్పెల యందు వండవచ్చును. ఈసీసా చాలా దృఢముగ (గట్టిగ) నుండును. త్వరలో బ్రద్దలగునను భయములేదు. ఇందు వండిన యెడల పాకము కొంచమాలస్యముగ వచ్చును. మరియు మందు మూతి వద్దకువచ్చి మూతినికప్పివేయుచుండును. అందుచే తరుచు కడ్డీవేయు నవసరము కలుగుచుండును. కాని ఇందువండబడిన మందు ఏవిధముగను నశింపక అంతయు సరిగవచ్చును. కుప్పెను బ్రద్దలు కొట్టగా పైసిందూరము కురిడీకాయచెక్కవలె సులభముగ నూడిపడును అట్లురాక అంటుకొనియున్నను చులకనగ తీయుటకు వీలుండును బ్రద్దలుకొట్టునప్పుడు పెద్ద ముక్కలుగ బ్రద్దలగును కావున మందుయందు సీసాముక్కలు చిన్నవి విశేషముగ కలియుటకు వీలుండదు. ఈ సీసా బ్రద్దలు కొట్టియే మందును గ్రహింపవలసియుండును

కొండపల్లికుప్పెలనిగాని, జగ్గయ్యపేటకుప్పెలనిగాని చెప్పబడుచు లోపలనుండు సీసాభాగము కాగితమంత పలచగనుండి పైన సుమారు పావుఅంగుళముదళసరిగ కేవలము మన్నుచే పూయబడి గుండ్రముగనుండి బలసిన పెద్దగొబ్బరికాయవలె నుండు కుప్పెలయందుకూడ వండవచ్చును. దీనియందువండినచో సీసాపలచగ నుండును కావున పాకముత్వరలోవచ్చును. తరుచు మూతిమూయుచు కడ్డీలువేయవలసియుండుట మొదలగు కష్టములేవియులేవు. కాని సీసామిక్కిలి పలచగనుండుటచే ఏమాత్రము వత్తిడి తగిలినను త్వరలో పగిలిపోవును. అందుచే మందువండిన పిదప తీయుటకిటునటు తీసికొనివెళ్ళుట మొదలగు వానికి భయముగ నుండును. మరియు మందుతీయుటకు సీసా బ్రద్దలు కొట్టినప్పుడు లోపలి సీసా మిక్కిలి సన్నని ముక్కలుగనై మందులో చాలకలసి తీయుటకు కూడ మిక్కిలి కష్టముగనుండును. పలచని సీసాను పట్టుకునియుండుటచే నిందలి సింధూరమును తీయుటకూడ బహుకష్టముగనే యుండును. త్వరలో రాదు. చిన్నచిన్న ముక్కలుగ నగుచుండును. ఈ ముక్కలను నీటిలోతడిపి సన్నని చాకుతో విదిల్చినయెడల సిందూరము కొంత త్వరలో సీసాముక్క నుండివిడును.

మామూలుగా వాడుకొను ఎట్టిసీసాలయందైనను వండవచ్చునని కొందరు చెప్పెదరు. కాంతవల్లభరసము, స్వర్ణవంగము మొదలగు అడుగుననుండు మందులను వండుకొనవచ్చును. కాని సింధూర ప్రధానమైన మందులను వండుకొనుట కంతసమంజసముగ నుండవు. మరియు అడుగున గుండ్రముగ సరిగ నుండక పోవుటచే కాంతవల్లభరసము మొదలగునవి కూడసరిగ పక్వము కాకపోవచ్చును.

అడుగునకొద్దిగ అంచుకలిగి కొంతవరకు గుండ్రముగనుండి కాశీకుప్పెలనబడు సీసాలయందు వండవచ్చునని కొందరు చెప్పెదరు. కాని దీనినిగూర్చి విశేషానుభవములేక పోవుటచే విశేషించి వ్రాయ వీలుకలుగలేదు.

అడుగున ఏవిధమగు అంచులులేక తట్టుగగుండ్రముగనుండి మధ్యయందు సన్నముగాని లావుగగాని లేకసుమారు సమానముగ పొడుగుగనుండి క్రిందిభాగము కంటె పైభాగము కొంచెము వెడల్పుగనుండి అంచు సమానముగనున్న రెండుపింగాణి గిన్నెలను గ్రహించి యందుకూడ వండెదరు. వీనియొక్క రెండు మూతలను సరిగనొక దానిపైనొకటి యుంచినచో సంపుటమై యొకేపాత్రవలె నుండవలయును. మధ్యయందు ఇనుముకల అనగా ఇనుమునకు పింగాణీపూయబడిన పాత్రలనే గ్రహింపవలయును. పైనబోర్లించు పాత్రకుమధ్యయందు కడ్డీపోవుటకు వీలుగనుండునట్లు సన్నని రంధ్రమును చేయవలయును. ఈ పింగాణిగిన్నెలను రెంటిని కలిపినచోటున బియ్యము మినుములు వీనినికలిపి జిగురువచ్చులాగున నూరి యాముద్దచే పూసి సంధిబంధనముచేసి పిదప పైనమట్టిపూసినను గుడ్డపీలికలను సంధిబంధనము చుట్టు చుట్టవలయును, పిదప సంపుటమున కంతకును మామూలుగ సంధిబంధనము చేయవలయును. ఇందుమందు వండినయెడల ఎట్టి కష్టములును లేవు. సంధిబంధమును విప్పిసింధూరమును గా

అడుగుననున్న మందును గాని సుఖముగ గ్రహించవచ్చును సీసా ముక్కలు మొదలగునవి కలియునను నెడి భయముగాని శ్రమగాని ఏమియు లేదు మందు ఇటునటు ఎంతమాత్రము పోదు. పాత్రలను ఏమియు పట్టుకొనక చాకు మొదలగువానితో సుఖముగ తీయవచ్చును. ఇది చాలసుఖకరమైన పద్ధతిగనున్నది. మరియు నీ పాత్రలను 2-3-4- వంటలవరకు కూడ నుపయోగించవచ్చును. పింగాణినిషేధమనుట యెటులనగ అట్టిపాత్రలయందు వండబడిన మందువికృతినొందునేమోయని కొందరు పెద్దలతో సంప్రదించగ పింగాణియనునది కాచభేదమేయగియు కావున దానిసంపర్కముచే వండబడినమందు ఎంతమాత్రము వికృతినొందదనియు నిస్సందేహముగ నాపాత్రలయందు వండవచ్చునని యు చెప్పిరి. మరియు నాపింగాణియందు అడ్డుపరచుశక్తి యధికముగ కలదనియు, అందుచే పాత్రమధ్యమందున్న ఇనుముయొక్క గుణము మందునకు ఎంతమాత్రము సంక్రమించదనియు కూడ చెప్పిరి. సంధిబంధనము విప్పి మందును తీసినపిదప మరల సంధిబంధనమును చేయుచు 2-3-4- వంటలవరకు నాపాత్రలనుపయోగింపవచ్చును క్రిందిపాత్ర మంటవేడిమిచే త్వరలో చెడును. పై పాత్ర 5-6 వంటలవరకు కూడ నుపయోగింపవచ్చును. ఏకారణముచేతనయినను 1-2 వంటలకే క్రిందిపాత్రకుగాని పైపాత్రకుగాని పింగాణిపోయిన యెడల నాపాత్రను మరల నెంతమాత్రము నుపయోగింపకూడదు.

ఒక డాకపయినన యింకొక సమానమగు డాకను బోర్లించి మట్టిగుడ్డలచే సంధిబంధనము చేసి యందు స్వర్ణవంగము మొదలగు మందులను వండెదరు. కడ్డీవేసి పాకము చూచుటకును మందునందలి గంధకము పోవుటకును పైనబోర్లించు డాకకు సన్నని రంధ్రము సంధిబంధనము చేయకుండగనే చేయవలయును. ఇట్టి దీనియందు రజితలోహరసాయనము, రసభూపతి మొదలగు మందులను మాత్రలనుగ (చిన్న చిన్న) కుప్పెలనుగ జేసి వండవచ్చును. ఏలయనగా మంటను వేయుచు అప్పుడప్పుడు సంపుటమును యెత్తి కదల్చుచుండిన యెడల మందుకుప్పెలు క్రిందుది మీదునకు మీదునది క్రిందకును వచ్చుచుండును. పై డాక రంధ్రమునుండి పొగకు గంధకపురంగుపోయి తెల్లగనవగనే పాకమువచ్చినట్లు గుర్తింపవచ్చును. లేదా సంపుటము నెత్తి ముక్కువద్ద పెట్టి వాసనచూచిన గంధకమున్నదియు లేనిదియు వాసనవలన స్పష్టముగ తెలియును. మందును చూర్ణముగ చేసియైనను వండవచ్చును. ఇట్లుచేసినయెడల అప్పుడప్పుడు విదల్చనవసరము లేదు. రంధ్రమునుండివచ్చు పొగననుసరించియు సంపుటము నెత్తి ముక్కువద్ద వాసనచూచుటవలనను మరియు కడ్డీని వేసి చూచుటవలనను గంధకము నశించినదియు లేనిదియు పూర్తిగ గ్రహింపవచ్చును. గంధకము పూర్తిగ నశింపగనే పాకమువచ్చినట్లు గ్రహింపవచ్చును. చిన్నకుప్పెలుగజేసి వండబడినమందు పాకానంతరముకూడ కుప్పెలుగనే యుండును, వానిని మరలనూరి కుప్పెలను కట్టవలయును. పై మూకుడుకు 2-3 రంధ్రములనుకూడ చేయవచ్చును. రజితలోహరసాయనము వాతరాక్షసము మొదలగు వానికి వాలుకాయంత్రమందే గాక పుటమందు కూడ పక్వము చెప్పుటచే నిట్లుకూడ పక్వము చేయవచ్చును. కాని శాస్త్రకారులు చెప్పిన విధముననే చేయుట మంచిది.

సమానమగు రెండుమూకుళ్ళకు దృఢమగు సంధిబంధనము జేసి యందు రసరాట్ స్వర్ణవంగము మొదలగు మందులను వండెదరు పైమూకుడుకు రంధ్రమును చేయవలయును ఇందు రజితలోహరసాయనము వాతరాక్షసము మొదలగు మందులను కూడ వండవచ్చును. పైనచెప్పిన డాకలసంపుటముయొక్క విషయములన్నిటి నిచ్చటకూడ చూడవలయును. డాకలసంపుటమైనచో యెత్తివిదల్చుకొనుట గంధకపువాసనచూచుట మొదలగువానికి సౌకర్యముగనుండును మూకుళ్ళసంపుటమునకు వేడి హెచ్చుగ తగులును.

అడుగున తట్టుగ గుండ్రముగనుండి, ముఖము అడుగువలెనే విడల్పుగనుండి పింగాణిగిన్నెవలె నుండుపాడుము (నళ్యము) చేయుటకుపయోగించు మట్టిపాత్రలను సమానమగువానిని రెండిటిని గ్రహించి పింగాణిగిన్నెవలెనే సంధిబంధనము మొదలగువానిని చేసి యాసంపుటమందుకూడ కాచకుప్పెలయందువలె నన్నియౌషధములను వండవచ్చును. ఇట్టిసంపుటమైనయెడల బ్రద్దలగుననియు మందుయందు సీసాముక్కలు పడుననియు, మొదలగు భయములేవియు లేవు. ఈపాత్రలను 2, 3, 4, వరకు కూడనుపయోగింపవచ్చును. కానియొకకష్టముమాత్రము కలదు. పైనయుంచిన మట్టిపాత్ర యెంతసున్నగనున్నను సిందూరము దానిని గట్టిగపట్టుకొని త్వరలో సరిగరాదు అందుచే కొద్ది యౌషధము నశింపవచ్చును. కాంతవల్లభరసము రజితలోహరసాయనము మొదలగువానిని వండుట కనుకూలముగనే వుండును.

పైనచెప్పినటువంటి గుండ్రని మట్టిపాత్రను దానికిసమానమగు పింగాణిపాత్రను గ్రహించి మట్టిపాత్రను క్రిందకునుంచి ఇదివరలో చెప్పిన విధముననే సంధిబంధనము మొదలగువానిని చేసి యాసంపుటమందుగూడ మందును పక్వము చేయవచ్చును, ఇట్లు చేసినయెడల పైపాత్రకు సిందూరము గట్టిగపట్టుకొనుట త్వరలో సరిగ రాకపోవుట, కొద్దిగ నశించుట మొదలగునవి కలుగనేరవు క్రిందిపాత్రను 2-3 వంటలయినతర్వాత తీసివేసి పైపాత్రను 5, 6 వంటలవర కుపయోగింపవచ్చును.

(తరువాయి 62వ పేజీలో)

# ఆనువంశిక వైద్యుల ఆయుర్వేద సేవ

## కోట్లాది ప్రజల ఆరోగ్య సంరక్షణ

### శ్రీ మోహన్ సమీక్ష

ఆయుర్వేదం ప్రభావం గురించి ప్రత్యేకంగా నేడు వ్రాయ నక్కరలేదని నా అభిప్రాయము. ఆయుర్వేదం భారత ప్రాచీన వైద్యశాస్త్రమని రోగ నివారణకే కాదు రోగములు పుట్టనీయకుండగనే చేయగలదనియూ ప్రాజ్ఞులు చెబుతారు. గాని నేటి ఆహార విహారములు ప్రతి అడుగులోను రోగోత్పత్తికే కారణమవుతున్నప్పుడు రోగనివారణోపాయము ఎప్పటికప్పుడు తాత్కాలిక శాంతియే ననక తప్పదు ప్రజల నిత్య అలవాట్లు అంటు వ్యాధులనదగిన భయంకరరోగములే ప్రబలిపోతూవుంటే నేడురోగ నివారణములో ఎంత కష్టమున్నదో ప్రజ్ఞావంతులైనఅనుభవముగల వైద్యులకు తప్ప అన్యులకు అవగాహన కాదు. ఇట్టియెడ రోగములు పుట్టనీయకుండగనే చేయగలదనుట అసాధ్యము. మరొక పక్షములో ఆలోచించితే అన్యరీతుల చికిత్సలకంటె ఆయుర్వేద చికిత్సలు చాలా మెరుగైనవి ఆయుర్వేద చికిత్సలలో ఉపయోగించు ఔషధములలో చేరు వస్తు సముదాయములు జగమంతా యెరిగినవి అంతేగాదు, ఆహార పదార్థములలో చేరునవి కూడాయగుటచే మానవుని ఆరోగ్యమునకు ఆయుర్వేద శాస్త్ర విధులు ప్రయోజనకరమైనవి.



"మారుమూల గ్రామాల్లో సైతము కాపురముండి ప్రజారోగ్యాన్ని సంరక్షింపగలుగుతున్నది ఆయుర్వేద వైద్యులేనని" ఆశీస్సులిస్తున్న పూజ్య బాపూజీ.

ఇట్టి ఆయుర్వేద అభ్యున్నతిని సంరక్షించుటకు అఖిలభారతంగా సంఘాలు యేర్పడినవి. ఆంధ్రలోను 1917లో జననమైంది. తదాది అనేకమంది మహాప్రముఖులు కృషిచేస్తూ వచ్చారు. లభించిన ప్రయోజనము యే కొందరికో తప్ప నిజమైన ఆయుర్వేద సేవకులకు లభింపకుండుట శోచనీయం.

### నిజమైన ఆయుర్వేద సేవ

దేశం ఆర్థికంగా ఎంతో లోపభూయిష్టంగా వుంది. ప్రజలకు ఆరోగ్యభంగం ఏర్పడింది. దీనికనేక కారణములు గలవు. ప్రభుత్వం వందలాది కోట్లు ప్రజారోగ్యంకొరకు వ్యయపరుస్తూ వుంది. ప్రయోజనం పేద ప్రజలకు మాత్రం దూరంగా వుంది. ఇట్టి స్థితిలో దేశంలో గల యితర వైద్యరీతులు యేవీ ప్రజోపయోగంగా లేవు. ఆయుర్వేదమే శరణ్యమైంది. ఆయుర్వేదమునకు మూలికా సంపద దేశంలో విశేషంగా వుంది. గ్రామగ్రామాల్లోని వైద్యులందరు మూలికావిజ్ఞానం బాగుగా తెలిసినవారు మూలికా ప్రభావమెరిగి రోగానికి తగిన చికిత్స చేయుటలో ఎంతో ఘనత సంపాదించారు. సంపాదిస్తున్నారు. అయితే వీరు ఆడంబరులు కారు. బహు నిరాడంబరులు. నిరాడంబరులు మాత్రమేగాదు. బహు పేదవారు. పేదవారి జీవితరహస్యముల నెఱిగి వారి ఆర్థికస్తోమతను గుర్తించి వారి కష్టసుఖములలో భాగస్వాములై చికిత్స జరిపి ఆరోగ్యవంతులను జేసి ఆర్థికంగా ప్రయోజనం కొరకు పెనుగులాడక తమ చికిత్సా ఫలితం ఆరోగ్యం చేకూర్చగల్గించని, ఆ ఓషధుల ప్రభావం గల్గినవని-వివిధరీతుల, భావవలనంది సంతృప్తిని పొంది ఆనందించు చున్నారు.

రోగి ఎంత ధనమిచ్చినాడని ఆలోచించరు ఆలోచించలేదు! ధనాపేక్ష లేనివారిగుట క్షేత్ర దేశంలోని ఆయుర్వేద వైద్యులు యే మాయమాటలన్నా వారైనా తన శక్తికి తగిన ప్రజాసేవ నిస్వార్థంగా చేస్తున్నారు. కాని ఈ సత్యాన్ని నేటి నవీన వైద్యులెంగాని, వారి అనుయాయులు గాని, పోషకులుగాని గుర్తించలేదు. గుర్తించరుకూడా.



వివాదాలతో నిండియున్న సంఘాల్లో ప్రవేశించి సమాజానికి ఏ ప్రయోజనం కల్గించలేమనే నిశ్చయభావంగల నా అభిప్రాయాన్ని మరలించి సంఘంలో ప్రవేశపెట్టిన నా ఆంతరంగిక మిత్రులు శ్రీయుతులు పిళ్ళా అప్పలనరసయ్య పాత్రుడు, దాశ్యం వెంకటరామానుజసూరి, అవనిగడ్డ నాగభూషణంగార్లు.

గుర్తించకపోగా ప్రజావసరములు తీర్చు వైద్యవిధానము పరిశోధన లేనిదని, ఆకులు పాకలు నేటి ఆధునిక యుగములో ఔషధములనుట కూడదని పరిహసించుచున్నారు. పరిహసించుటతోపాటు ఆ వైద్యులను చూచి యేవగించుకొంటున్నారు ఈ విషయము లోక మెరిగినదే అయినా నేటి ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రియు, ఆరోగ్యశాఖామంత్రియునగు శ్రీ సంజీవరెడ్డిగారిని ఆసవారిష్టముల నిర్మాణంగురించి వచ్చిన అడ్డంకుల విషయం విజ్ఞప్తి రూపములో అందించుటకు విజయవాడలో ది 11-8-57న కలుసుకొన్నప్పుడు ఆయుర్వేద ధర్మవైద్యశాల ప్రసక్తిలో "ఆయుర్వేద వైద్యులంటే అధునిక వైద్యశిరులవారు యేవగించుకొంటున్నారని" చెప్పుచున్నారు అందులో ఒకందుకు మనం హర్షింపవలసి యున్నది.

## వయోజనుల ఆరోగ్యం

నేడు భారతదేశ పాలకవర్గం వయోజనుల ఓటింగుసహాకారంతో విజయమందినవారితో పాలింపబడుతున్నది. ఆంధ్రప్రదేశలో వయోజనులు అధికసంఖ్యాకులు. వీరందరిఆదరాభిమానములపై యేర్పడిన ప్రభుత్వమే ఆంధ్రప్రదేశ ప్రభుత్వం. దాని ప్రధానత్వం శ్రీ సంజీవరెడ్డిగారిది. శ్రీ సంజీవరెడ్డిగారు వయోజనుల సాధక బాధకములు చక్కగా ఎరిగినవారు. అందుచేత అసంఖ్యాక వయోజనులు నివసించు ప్రాంతములందంతటా ఆయుర్వేద వైద్యులు నివసింపుచు తమ శక్తి వంచన లేకుండా ఆరోగ్యమును కాపాడుతున్నారు. ఆ ప్రజాపోషణతో జీవించుతున్నారు, అనే వాస్తవము గుర్తించారు. గుర్తించి అట్టి వైద్యులను వైద్యులుగా గుర్తించుటకు "ఆయుర్వేద వైద్యుల రిజిస్ట్రేషను చట్టము" అమలుపరచుచున్నారు. దాన్ని పాలించుటకు క్రమమైన సలహానిచ్చుటకు ఒక సలహా బోర్డు వేశారు. అందులో ఆయుర్వేద వైద్యులమనుకొనే వారిని సభ్యులుగా వేశారు. వారందరు యేకగ్రీవంగా చక్కని సలహాలు అందజేసి – దేశంలో అధికసంఖ్యాకులైన ఆయుర్వేద వైద్యులకు నిలయమైన సంఘాల సూచనలు సేకరించి ఆయుర్వేద వైద్యులలో తరతమ భేదములులేని ఉత్తమస్థాయి రూపొందించవలసి యున్నది.

## ఆయుర్వేదీయులలో తరతమ భేదాలు

ఆయుర్వేద సంఘాలు స్థాపించింది మొదలు దాదాపు నేటివరకు కూడా తరతమ భేదాలు పోగొట్టుకొనుశక్తి ఆ సంఘాలకు లేకపోయింది. లేకపోగా మరింతా అభివృద్ధి పొందుతూ వుంది. దీనికి కారణం ఆదినుండి సంఘ నిర్వాహకులు ఒక కోవకు చెందినవారే అయినందున భేదభావాలు నశించకుండా పోయాయి. దేశంలో ఆయుర్వేద వైద్యులు రెండుతీరుల వారున్నారు. వీరిలో అనుభవముతో మూలికా విజ్ఞాన, రసవిజ్ఞానము, గల్గి ప్రజారోగ్యమును సంరక్షిస్తున్నవారు అధిక సంఖ్యాకులై యున్నారు. వీరికి ఎలాంటి తరతమ భేదాలు లేవు. ఎట్టిస్థితిలోను తమకు తెలసిన వైద్యసేవ ప్రజలకందించుట, లభ్యమైనంతవరకు ప్రజ్ఞావంతులనుండి చికిత్సల గొప్పతనముంటే సేకరించుట – జీవితమంతా విద్యార్థిగానే యుండి వైద్య రహస్యమును గ్రహించుటకు కృషి చేయుచున్నారు. వీరు ఆయుర్వేద వుద్యమ ప్రాబల్యమునకై ఎంతో పాడ్పడుతున్నారు. జీవితం ఎంత కష్టభరితమైనా ఆర్థికలోపం వారి ఎముకలు కొరుక్కుతింటున్నా ఆయుర్వేదాభివృద్ధికై జరుగుతున్న సమావేశాలకు, సభలకు, మహాసభలకు ధనసహాయం చేస్తారు. ఆ సభలకు తమ వృత్తులకు స్వస్తిచెప్పి మరెంతో ధనము వ్యయపరచుకొని సభలకు వస్తారు. సభలు విజయము పొందించుతారు. జయజయధ్వను

లతో ఆయుర్వేదాభ్యున్నతికి తమ సేవ - జీవితం అంకితం చేస్తున్నారు. వీరు ఎలాంటి ఫలితాన్ని కాంక్షించి - యీ సభలకు వచ్చేవారు కారు. ఆ సభలకు వస్తే - ఆ సమావేశాలకు హాజరైతే - ఆ మహాసభలకు, విజయం కల్గించితే - మన వృత్తివిద్యయైన ఆయుర్వేదం వున్నతస్థితిలో విఖ్యాతమవుతుంది. మన భారత ప్రాచీన వైద్యశాస్త్రంయొక్క నైపుణ్యం ప్రచారమవుతుంది. మన ప్రజలు మనలను గౌరవిస్తారు" అనుకొనే ప్రధాన భావమేగాక అన్యము లేనేలేదు.



సంఘంలో ప్రప్రథమంగా నన్ను కార్యదర్శి స్థానములో ప్రవేశపెట్టి, నాయకుడుగా, దేశికుడుగా, కార్యకర్తగా సలహాదారుగా అన్నింట అపూర్వమైన ప్రోత్సాహమిచ్చిన వైద్యశ్రీ ఆయుర్వేద సార్వభౌమ మల్లల శోభనాచలచక్రవర్తిగారు.

ఇక రెండోవర్గంగురించి సమాలోచించండి. ఇది బహు తక్కువ సంఖ్యలో నున్నది. వీరిలో చాలామంది మాటలు నేర్చుకొని శ్లోకాలు బట్టిపట్టి, లౌకికముగా ఉదాహరణలతో ఉపన్యాసము లిస్తారు. పదవులు, సభలలో ఆధిపత్యము, నాయకత్వము కాంక్షిస్తారు. వీరి ఆశయాలు సిద్ధించుటకు ఎట్టి చిత్ర విచిత్రములనైనా సృష్టించుతారు. అమాయకుల హృదయాల్లో స్థానం సమయస్ఫూర్తిగా సంపాదించుకొని గొప్పవారమనిపించు కొంటున్నారు. ఈ రెండోవర్గంఅంటె మొదటి వర్గంలో పుట్టి పెరిగినవారే. గాని వీరికి కష్టించి పనిచేయుట అలవాటు తక్కువ. సరిపడదుకూడా. ఏ వొక్కరినో వుపయోగించుకొని యే వొక్కరిమీదనో అధికారం చెలాయించి జీవించాలనే ఆశయం వారికి వృత్తి ఆడంబరం అలవర్చుకొన్నారు. ఆ యాడంబరం బట్టిపట్టిన శ్లోకాలు తప్పితే మరేమీలేదు. వీరికి వైద్యం అంటె చికిత్సలు చేయుట కిట్టదు. చికిత్సలలో గల సాధక బాధకములు అంతకంటె తెలియవు. పుస్తకాల్లో వ్రాసినవి వల్లె వేయటము చెప్పితే కనీసం ఔషధ నిర్మాణమైనా తెలియదు. వీరికి ఔషధ నిర్మాణంయొక్క అవసరం యేదైనావుంటె మొదటివర్గంవారినే వుపయోగించుకొని అనుభవముతో వారి తయారుల గొప్పతనం మరుగులో శ్లాఘిస్తూ ఔషధమును సేకరిస్తారు. అది మహారాజులకు, జమీందారులకు, ధనవంతులకు అందచేస్తారు. దాని ప్రయోజనం ధనం - సన్మానం - ప్రతిష్ఠ ఇనుమడింపజేసికొని బేషజంతో మేము గొప్పవారం మహా పండితులం, ఆచార్యులం, ప్రాణాచార్యుల మంటూ వాగ్వివాదములతో తృప్తిపడుతూ నాయకత్వం సంపాదించు కొన్నారు. ఇంకా సంపాదించుకొంటున్నారు. రాజాదరణ గల రోజుల్లో రాజులు ఔషధములు నిర్మించు రోజులలో కూడా ఈ పండిత మణ్యులు ప్రజ్ఞానిధులైన అనుభవముగల మొదటి వర్గపు వైద్యులచేతనే తయారు చేయించి - అధికృతవారు పొందేవారు వారిపనులు నెరవేర్చుకొనుదాకా మీయంతటి గొప్పవారు లేరని పొగడుటయే కార్యక్రమం. ఈ విధముగా వ్రాయవలసివస్తే కావలసినంత గాథ వుంటుంది. ఇట్టి అల్పసంఖ్య మొదటినుంచి నాయకత్వం వహించి - అధిక సంఖ్యాకులైన, ప్రజారోగ్యసంరక్షకులైన, నిజవైద్యులపాలిట పెనుభూతంలాగా తయారైనారంటే ఒక్క మాటలో సరిపోతుంది.

## ఎప్పటికి మారని మన స్తత్వం

నాడుకాదు, నేటికి చూడండి. దేశం ఎంతో మారిపోయింది. విద్య బహుముఖంగా వ్యాపించింది. పాలకులు మారిపోయారు. ప్రభువులు, అధికృతి తారుమారయింది. దేశ పురోగమనం సమైక్యతకై ఎంతో కృషి చేస్తున్నది. అతి భయంకరములైన సమస్యలు ఎన్నో ప్రశాంతంగా కన్పిస్తున్నాయి. ఎన్నిమారినా ఆయుర్వేద వైద్యులలో "మేము తెలసినవారం" అనుకొనే దురహంకారం తగ్గలేదు. ఈ బేషజులకు పూర్వం రాజాశ్రయంవుండి కొంత జీవనాధారంవుంటే నేడు ఔషధ విక్రయంలో దాన్ని లీనంజేశారు. నేడు దేశంలో యెక్కడ చూచిన ఔషధ విక్రయకర్తలు ఆ శాఖ వారే - మాతాత అంతటివాడు - మానాన్న ఇంతటివాడు, అంతటి, ఇంతటి, వారిప్రజ్ఞ మా ఔషధ నిర్మాణం అంటూ చెప్పుకొంటున్నారు. నేటికి చికిత్సా పద్ధతిలో ప్రజ్ఞ శూన్యమే! ఆడంబరం తగ్గలేదు. ఈ ఆడంబరులైన వారికి అమాయకులైన మొదటివర్గంవారు నేటికి ఆరాధిస్తూవేపున్నారు వారికి అవసరమైన మందులన్నియు తయారుచేయుచున్నారు. వారు విక్రయంలో శ్రీమంతు లవుతూవుంటే వారి ఔషధము నిర్మాణించుచున్న అనుభవ వైద్యులు పేరూ వూరు లేకుం

పేదవారుగానే వుండిపోతున్నా[illegible]ము సంపాదించియు ఈ పండిత వర్గీయు[illegible]మను[illegible]విక్రయదారులు ఆయుర్వేద సంఘాభివృద్ధికి సహ[illegible] కానీ చందా యివ్వరు. సభలలో ఆధిక్యత వారికే [illegible]డాలి. వారి కేటలాగుల ప్రాబల్యం అంతటా నిండి[illegible]డాలి. నోరుగల వాళ్ళెంట్లు విమర్శచేస్తే-సమాధానం చెప్పలేకుండా పలాయన మవుతారు. అంతే పరివర్తన తెచ్చు[illegible] కలసిరారు. సహకారం, వారి జన్మకే కూడదన్నట్లు "ఈర్ష్య"తో పునీతులై తేనెపూసిన కత్తుల్లాగ వ్యవహరిస్తారు. ఏనాటికి మారని వీరి మనస్తత్వాలు వారి స్వార్థమునకు ఎంతకాలం ప్రజా వైద్యులు ఆహుతికావలసియున్నదో దేశంలో ఎన్నిమార్పులు వచ్చిన ఈ పాత అలవాట్లు ఆయుర్వేద వైద్యులలో ఎందుకు మార్పురావో నేటి యువజన వైద్యులు సమాలోచించవలసి యున్నది.



ఆయుర్వేద సంఘోద్యమములో అంటి అంటని విధంగానే వుంటూ - సమయము వచ్చినప్పుడు సంఘ ప్రతిష్ఠ సంరక్షించవలసిన బాధ్యత వహిస్తూ, నా కార్యక్రమాల నాశీర్వదిస్తూ ప్రోత్సాహమిచ్చిన ఉన్మాదవైద్యాచార్యుడు
శ్రీ చందు సుబ్బారావుగారు.

## ఆయుర్వేదం సంకరమగుటకు ఎవరు కారణం

ఆయుర్వేద ఔషధములలో గొప్పతనం శ్లోకాలతో వర్ణించుటు, ప్రప్రథమములో పేర్కొన్నట్లు రాజవైద్యుల మనిపించుకొనుట సంస్థాన పోషకుల మనిపించుకొనుట - కాలానుగుణ్యముగా ఔషధ వర్తకులుగా మారిపోయిన ఈ పండిత ప్రకాండులు - అంతటితోను తృప్తిపొందక - వారి అన్నివిధాల పైకితెచ్చిన ఆయుర్వేదాన్ని సంకరంచేయుటకు పూనికవహించారు. ఈమాట చదివేసరికి చాలా కోపంవచ్చే స్నేహితులుండవచ్చు. గాని-మనని పైకితెచ్చిన శాస్త్రాభివృద్ధికి మన బిడ్డలకు అందించామా? శుద్ధాయుర్వేదీయుల శ్రమదానంతో తయారైన ఔషధములు విక్రయించుకొంటూ పెంచుకొన్న ఆయుర్వేద శారీరమే గదా మనం దాల్చాం. అట్టి శరీరం నిజమైన ఆయుర్వేద విధులు నెరవేర్చలేక పోయినా తమ బిడ్డలనైనా ఎందుకు వినియోగించరు!! ఊహుఁ! చెప్పేది ఒకటి చేసేది మరొకటి - బిడ్డలుకూడా ఆయుర్వేదంలో నేవుంటే భోజనంకూడా దొరకదేమో - దేశం మారిపోతూవుంది - ఆయుర్వేదానికి పతనం తప్పదు! అందుచేత భావిజీవితావసరముల దృష్ట్యా మన బిడ్డలు ఆధునిక వైద్యులైపోవాలి. లేకపోతే సంకరంగా తీర్చిదిద్దిన ఆయుర్వేదమైనా చదివించాలని ప్రారంభించారు. ఒక్కసారి దేశాన్ని విశాలదృష్టితో పరిశీలించండి. ఈ రెండో వర్గానికి చెందినవారి బిడ్డలు, వారి అనుచరులు అందరు ఆధునిక చికిత్సా కోవిదులే!! తండ్రి ఆయుర్వేద పండితుడు, కొడుకు ఆధునిక వైద్యుడు. ఇక్కడ ఆయుర్వేద పురోభివృద్ధి ఎక్కడవున్నది. ఈ పండితుని ఆయుర్వేద భక్తి విశ్వాసాలు నేతిబీరకాయలోని నెయివంటిదేనా - ఆయుర్వేదాన్ని యీవిధంగా చిత్రవధచేసి - సంకర మొనరించిన పెద్దలు - ఆయుర్వేద సంఘాల ఆధిపత్యము వచ్చినా, సంఘకృషి ఫలితంగా ప్రభుత్వం యేది సమాలోచింప ప్రయత్నించినా ఈ నీతి, నిజాయితీలను విస్మరించి - నేనంటే - నేను - అంటూ తమ తోత్తడముల చిత్రవృత్తిని మరుగుపరచి మేము మహా - అంటే - మేము మహా - అంటూ బయలు దేరుతున్నారు. మొదటి వర్గం ముందుకు వస్తారేమోనని రొసరొసలు విసవిసలు దూషణలు ప్రారంభిస్తారు.

## ఇంటిగుట్టె లంకకు చేటన్నట్టు

ముఖ్యమైన సమావేశాలు జరుగునప్పుడు, అధికార, అనధికారులు సుహృద్భావముతో సమీక్ష చేయునప్పుడు సంస్థ విలువను సమగ్రముగా రూపొందించు సంభావణలు విడనాడి "పేరుకి వేలకొద్ది వున్నారు వీరంతా చదువు సంధ్య లేనివాళ్ళు, ఊహాకొద్ది తోచిన పద్ధతుల్లో నడుచుకు పోతున్నారు వీరందరిని వైద్యుల్లాగ చూడాలంటే" అంటూ సాగిస్తారు. వ్రేళ్ళమీద లెఖపెట్టబడే కొందరి స్వార్థపు సంభావణలు - అసంఖ్యాక వైద్య బృందాన్ని అవమానపరుస్తున్నాయి. యదార్థానికి చికిత్సల్లో నైపుణ్యమూ లేదు. ఔషధనిర్మాణమూ అంటే అసలే తెలియదు. ఒక మూలిక పోలికైనా తెలియదు.

ఇట్టివారు నిజమైన వైద్యబృందాన్ని అవమానపరచి ఎంత అఘాయిత్యానికైనా పాల్పడుతున్నారు. నిజానికి ఆలోచించండి తాము యే శాస్త్ర వైద్యులమని విర్రవీగుతున్నారో – ఆశాస్త్రం మందులు విక్రయం తప్పితే మరేమీ తెలియక పోయినా సంపూర్ణమైన విశ్వాసమైనా ప్రకటించగలరా? వారి సంతతి అన్యరీతుల వైద్యులై వ్యవహరించాలి. వారి యిళ్లలో జబ్బులువస్తే ఇతర వైద్యులే చికిత్సలు చేయాలి. 'పొట్టయాత్ర' సమస్య వచ్చేసరికి "ఆయుర్వేదం, ఆయుర్వేదం" అంటూ బకజపాలు చేయాలి. ఇదేనా నీతి నిజాయితీగల ఆయుర్వేద భక్తుల లక్ష్యం!! ఇట్టి స్వార్థపరత్వం, అప్రయోజకములైన కార్యక్రమాలు ఆచరిస్తుతూ – నిజాయితీగలవారిని దుమ్మెత్తిపోస్తూ మానాభిమానములు మరచి పోతున్న వారితో ఆయుర్వేద సంఘం నగిలిపోతూవుంటే –



ఆంధ్రప్రదేశ రిజిష్టర్డు కవిరాజ వైద్యమండలి అధ్యక్షులు, ప్రస్తుత ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి కార్యవర్గ సభ్యులును నగు శ్రీ కవిరాజ స్వామి ప్రజ్ఞానానందజీ.

సంఘాల కెంతవయస్సు వుంటేయేముంది? సాధించగల్గేది యేముంటుంది? మా సుభాన్‌సాహెబ్ అంటున్నట్టు చేతిలో సంచి, సంచిలో పుస్తకంతప్ప యేమిసంఘం ఎంతవయస్సు వచ్చినా చరిత్ర కానరాని సంఘాలు అధికసంఖ్యాక వైద్యబృందాన్ని అవమాన పరచుటకేగాని మరేకార్యం లేదు!! ఒక్కసారి జరిగిన చరిత్రను పునః పరిశీలనచేస్తే – అనువంశీకుల ప్రేమాభిమానాలు, ఆదరాభిమానాలు స్పష్టం కాగలుతాయి. తల్లిపాలుత్రాగి, తల్లి రొమ్ము నే గుద్దినట్లు ధన, మాన ప్రాణములు ఒడ్డి ఆయుర్వేదాభివృద్ధికి తోడ్పడుతున్న వారిని



కవిరాజ జీబు వెంకయ్యా నాయుడుగారు

"పులితోలు కప్పుకున్నంతలో పెద్దపులులవుతారా ఆయుర్వేద వైద్యుల మనుకొన్నంత మాత్రాన చదువు సంధ్యల్లేని వారు వైద్యులవుతారా" అంటూ అవివేకపు సంభాషణలు సాగిస్తుంటే సంఘం ముందుకేమి అడుగిడగలదు.

వేలమంది వైద్యులను రిజిస్ట్రేషను చేయుటకు రుసుములు కూడా కట్టించి – రిజిస్ట్రేషను చేయించలేకపోగా రుసుములు కూడా పోగొట్టించారు. ఇదేనా సమాజానికి కల్గించిన మేలు ఇట్టి తరతమ భేదాలుతో యింటిగుట్టు రచ్చకెక్కించి పొందించిన ప్రయోజనముగాని పొందినదిగాని లేకుండా ఇంతకాలం నడిపిన ఉద్యమానికి చరిత్రయే లేకుండాజేసిన వారు నేటికి వారి వితండ వాదములు మానకున్నారు.

## దేశంలో సంఘాలు

దేశంలో అందరు ప్రజ్ఞావంతులే వుండరు. అందరు ప్రజ్ఞావంతులే అయినప్పుడు చెప్పేవారు వినేవారుకూడా లేకుండానేపోతారు. విజ్ఞానమంటూ ఒకటివుంటే – ఆ విజ్ఞానం ఎదుటివారికి ఉపకరించునదై ఆచార్యత్వము వహించుట కనువైనదై యుండాలి. నాడే దానికి రాణింపు. నాడే దానికొక రూపం. "నీకు తెలియదు – నాకు తెలుసు" అనే వాదంలో ఒక్క ఈర్ష్యయే ప్రతిబింబించింది. దానిలో మ్రగ్గిపోవుటతప్ప మరెట్టి విశిష్టత వీరికి లభించలేదు. సంఘ నిర్మాణం యెందుకు యేర్పడాలని అందరు ఆశించుతారో – తద్వారా సాధింపగల ప్రయోజన మెట్టిదో వీరికక్కరలేదు.

వీరి సంఘనిర్వహణ అట్టి సంఘర్షణలతోను, పదవీ దురహంకారములతోను నడచిపోయింది అందుకే చరిత్రలో కెక్కనటుకే అవకాశంలేనిస్థితి యేర్పడింది. పది సంఘాలు యేర్పడ్డాయి. తలకోదారిలో సంఘాలయితే వున్నాయి. వీటికొక కార్యక్రమం మాత్రం లేదు. సంఘర్షణలు మాత్రం విలయతాండవం చేస్తున్నాయి.

## నా సంఘసేవకు విఘ్నేశ్వర పూజ

నా వైద్యమిత్రులు ఈ సంఘ చరిత్రలు చెబుతూ వుండేవారు. ఒక వర్గమునకు జరుగుతున్న అన్యాయం వివరించేవారు అల్ప సంఖ్యాక వర్గం అధిక సంఖ్యాకులను వెక్కిరించుచున్న ఈ సంఘాలు, తరతమ భేదాలతో తగవులాడుకొంటున్న సంఘాలు, మిత్రులు కన్నులకు కట్టినట్లు చెబుతూవుంటే అవి సరిదిద్దుటకు పనిచేయవలయునను సంకల్పము లేకపోగా అసహ్యమే కల్గింది. దీనికి కారణం నన్ననుసరించే మిత్రులకు పదేపదే చెబుతుండేవాడిని. "చికిత్సానుభవము – ఓషధుల విజ్ఞానము – ఔషధనిర్మాణము" మూడింటా ప్రజ్ఞావంతులై అధికసంఖ్యాకులై యుండి ఈర్షతో విడదీసి పాలించు బుద్ధిగల అల్పసంఖ్యాకులనెందుకు ఎదిరించకున్నారు వారి ఆటలు ఎందుకు కట్టించ లేకున్నారు. అంటే సమాధానం నాడు మిత్రులు మాత్రం చెప్పలేకపోయేవారుగాని కాలక్రమేణ నాకు మాత్రం గోచరించింది. చెప్పగా చెప్పగా ప్రోత్సాహం వృద్ధంకాలేదు. నామిత్రులే గెలిచారు. "ప్రవేశించరాదని భీష్మించుకొని కూర్చున్న నన్ను సంఘాల్లోప్రవేశ పెట్టిరి, ఇందులో మొదటివారు శ్రీ పిళ్ళా అప్పలనరసయ్య పాత్రుడుగారు. వీరు నేడు ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలికి కోశాధిపతి. రెండవ వారు శ్రీ దాశ్యం వెంకటరామానుజసూరిగారు. వీరు నేటి ఆంధ్ర ప్రదేశ ఆయుర్వేద మహామండలికి ఔషధశాఖా కార్యదర్శి. మూడవవారు శ్రీ అవనిగడ్డ నాగభూషణంగారు. వీరు నేడు ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలికి కార్యకర్గ సభ్యులు కృష్ణాజిల్లా శాఖామండలికి ప్రధాన కార్యదర్శి వీరు ముగ్గురు యిచ్చిన ప్రోత్సాహముతో వైద్యశ్రీ మల్లెల శోభనాచల చక్రవర్తిగారితో పరిచయము కల్గింది. ఆ పరిచయముతో వారి నిరంతర ఆశీస్సులతో ఆదేశాలతో సంఘసేవా కార్యక్రమాలు ప్రారంభమైనవి. శ్రీ చక్రవర్తి తలవని తలంపుగా మిత్రుల సలహా సంప్రతింపులతోనే నావచ్చును, విజయవాడలో గల దేశీయ వైద్యసంఘం (రిజిష్టర్డు) జరుపు ధన్వంత్రి జయంతోత్సవము 14 వ వార్షిక సభ జరుగుతున్న సమయం. అది 1950 డిశంబరు 31వ తేదీ. నాడా సంఘానికి నన్నాశీర్వదించి కార్యదర్శిని చేశారు. అది నాకు తెలిసి జరిగినది కాదు. నిండు సభలో లభించిన ప్రోత్సాహం కాదనుకోవడం ఉత్తమలక్షణం కాదనుకొన్నాను. గాని ప్రారంభంలోనే బయలుదేరింది కల్లోలం, కార్యదర్శి స్థానానికర్హుడేనాయని ఆ వాదం శ్రీ కవిరాజ జీబువెంకయ్యనాయుడుగారిది. సభవారి యేకగ్రీవ సమాధానం వారిని తృప్తిపరచింది గాబోలు. ఆశీస్సులు లభించినవి. నాడు ప్రారంభమైనది నా సంఘసేవకు విఘ్నేశ్వర పూజ. తరువాత రాష్ట్రవ్యాప్తమైన విషయములు పట్టణసంఘమునుండియే సమీక్షలు జరుపుతూ వచ్చాము. మూడేండ్లు యిలా గడచుటలో జరిగినకృషి 1953 ఆగష్టు 8వ తేదీని కవిరాజ వైద్యమండలి అధ్యక్షులు కవిరాజ శ్రీస్వామి ప్రజ్ఞానానందజీవారిని ఆకర్షించింది. దీనికి కారణం శ్రీ కవిరాజ మూర్తి పూర్ణచంద్రరావుగారు. పైతేదీని జరిగిన కవిరాజ వైద్యమండలి వార్షికసభ పశివేడలలో, శ్రీ స్వామిజీ చిదానందాశ్రమములో,కవిరాజవైద్యమండలి నాటికి రాష్ట్రమండలిగానే ఆంధ్రలోని కవిరాజులందరికొరకు కృషిచేయుచున్నది. శ్రీ మూర్తివారి ప్రబలమైన ప్రోత్సాహంతో శ్రీ స్వామివారి ఆశీస్సులతో ఆ మండలి కార్యదర్శిగా బలవంతంగా పదవీ స్వీకారం చేయించడం జరిగింది. నాటిసభలో శ్రీకవిరాజ వేదాంతం వెంకటసుబ్బారావు, కవిరాజ బాదంపూడి వెంకయ్య మొదలైనవారి ఒత్తిడికూడా వచ్చింది నాడే కవిరాజ వైద్యమండలి ఆంధ్రప్రదేశ రిజిష్టర్డు కవిరాజ వైద్యమండలిగా రూపొందింపబడి కార్యక్రమం రాష్ట్రవ్యాప్తంగా అమలుజరుపుటకు ప్రారంభం చేయబడింది.


శ్రీ మోహన్

ఆంధ్రప్రదేశ రిజిష్టర్డు కవిరాజ వైద్యమండలి ప్రధాన ఆశయము బెంగాలు ప్రభుత్వ బోర్డులో ఆయుర్వేద వైద్యులుగా రిజిష్టరు పొందినవారి నందరిని మదరాసు ప్రభుత్వ బోర్డు గుర్తించవలసిన అవసరమును గూర్చి ప్రారంభమైన కార్యక్రమము అది. ఆంధ్రప్రభుత్వం ప్రత్యేకింపబడుతున్న రోజులగుటచే నా కార్యక్రమ ప్రారంభంలోనే అనగా 2-2-54వ తేదీని మదరాసు వెళ్ళి నాటి ఆరోగ్యశాఖామాత్యులనుకలుసుకొని రాష్ట్రవిభజనకారణంగావిరమించాము.

సంఘం బహుముఖంగా పనిచేయుటకు సంకల్పించికొని రిజిస్ట్రేషను పొందుటకు ప్రయత్నించి విఫలురైన అనేకమంది వైద్యమహాశయులను సంఘంలో సభ్యులుగా . చేర్చుకొని

సమైక్యకృషి చేయుట ప్రారంభమైంది. కనీసపు కోరికలు ప్రభుత్వదృష్టికి తెచ్చుటకై ప్రారంభించిన అభివృద్ధి కార్యక్రమాలలో మొదటిది ఆంధ్ర - మద్రాసు ఆస్తుల పంపకమునకై ఆంధ్రకువచ్చిన జస్టిస్ వాంఛూ గారిని కలుసుకొనుట, రెండవది 1953 అక్టోబరు 1న ఆంధ్రప్రభుత్వ అవతరణ మహోత్సవము జరపి నాటి ముఖ్యమంత్రి శ్రీ టి. ప్రకాశం పంతులు, నాటి ఆరోగ్యశాఖామంత్రి శ్రీ డి. సంజీవయ్య గార్ల ఆశీస్సులు పొందగలిగాము.

## ఆంధ్ర మంత్రుల అభినందనలు

GOVERNMENT OF ANDHRA

**T. PRAKASAM**
*Chief Minister*

KURNOOL
2nd Oct. 1953

Dear Mr. Mohan,

Thanks for your good wishes received on the eve of my accepting the Chief Ministership of the Andhra.

With Good wishes,

*Yours sincerely,*
(Sd) T. PRAKASAM.

---

**D. SANJIVAYYA,**
Minister for Planning and Public Health.

KURNOOL,
9 th Oct. 1953.

*To*
*The Secretary,*
Andhra Pradesh Regd. Kaviraj Vaidyamandali, Vijayawada.

Dear Friend,

I thank you very much for your hearty congratulations.
With best wishes,

*Yours sincerely,*
D. SANJIVAYYA.

విజయవాడను ది 26-12-53న విచ్చేసిన నాటి ఉపముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారిని కలుసుకొని రిజిష్టరు కావలసిన ఆయుర్వేద వైద్యుల గురించి వివరించుకొనుట జరిగింది.



నాటి ఉప ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు.

ది 30-12-53న విజయవాడలో నాటి ఆరోగ్యశాఖామాత్యులు శ్రీ డి. సంజీవయ్యగారిని కలుసుకొని విజ్ఞప్తి నందించి దేశంలో మారుమూల గ్రామాలలో సైతము కాపురముండి ప్రజారోగ్యమును సంరక్షిస్తూ ప్రజాపోషణతో జీవించుతున్న ఆయుర్వేద చికిత్సా నిపుణుల గుర్తింపునుగురించి విజ్ఞప్తిని సమర్పించుట జరిగింది. ది 17-1-54న నాటి ఆంధ్ర ప్రప్రథమగవర్నరు శ్రీ త్రివేదిగారివద్దకు విజయవాడముకాంలో రాయబారం వెళ్ళి ఆంధ్రలో ఆయుర్వేదాభివృద్ధిని గురించి వివరించి ప్రభుత్వ గుర్తింపు (రిజిస్ట్రేషను) అవసరమైన వైద్యులనుగూర్చి విపులముగా చెప్పుట జరిగింది.

### ఆంధ్ర ఆయుర్వేద నాయకుల సమావేశము

ఆనాడే ఆంధ్రలోగల ఆయుర్వేద పెద్దలను ఆహ్వానించి ఒక సమావేశము జరిపి ప్రభుత్వంవద్దకు రాయబారం వెళ్ళుటకు పన్నెండుమందితో ఒక కమిటి వేయబడింది. ఆకమిటి 1954 ఫిబ్రవరి 4వ తేదీని కర్నూలులో ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశం పంతులుగారిని కలుసుకొన్నది. శ్రీ ప్రకాశం పంతులుగారు ఆయుర్వేదీయుల చరిత్ర క్షుణ్ణంగా తెలిసినవారని నాటి సంభాషణలో స్పష్టమైంది. ఆయుర్వేదం అభివృద్ధిపొందాలి - ప్రభుత్వం పోషించాలి. అనే నినాదాల్లో అర్థంలేదని మందలించారు. మీరు ఇవ్వబోయే విజ్ఞప్తిలో తెలుసుకోదగిన విషయం ఒకటి ఉండదని అవన్నీ

నాకక్కరలేదని త్రోసిపుచ్చారు. రాయభారం వచ్చిన వారిలో స్పష్టంగా మాకు కావలసింది "యిదీ" అని చెప్పే సామర్థ్యం కనపడలేదు. ముఖ్యమంత్రి కార్యాలయం మౌన ముద్రలో పడింది. ఇంతకూ నేను ప్రత్యేకించి చెప్పదగిన విషయముకూడా మరొకటుంది. పన్నెండుమందిలో రాయ భారం వెళ్ళినవారం అయిదుగురం. నల్గురు మాత్రమే మంత్రి గారికి పరిచయం కాబడ్డారు. నేనా రాయభారంలో వున్నా ననే మాటే మరచిపోయారు సాటి రాయభార సభ్యులు. శ్రీ ప్రకాశం పంతులుగారు గద్దించి మాట్లాడి యేమికావాలని వచ్చారని హెచ్చరిక చేయుటతో మౌనముద్రలో మునిగి పోయారు మేమే రాయభారమునకు వచ్చినామనుకొన్న సోద రులు.

## ముఖ్యమంత్రికి నా విజ్ఞప్తి

నేను వెంటనే శ్రీ మంత్రివర్యులకు కృతజ్ఞతాపూర్వక వందనసమర్పణ చేస్తూ ఈ రాయభారంలో నేనువచ్చినా, నేను తమకు పరిచయము కాలేదని - నాయంతట నేనే తమకు పరిచయము జేసికొంటున్నానని చెబుతూ "దేశంలో ఆయు ర్వేదాభివృద్ధికి తొలుదొలుత కావలసింది ఆయుర్వేద వైద్యు లైనవారిని ప్రభుత్వం గుర్తించడం జరగాలి. గుర్తించడం అంటె వైద్యులుగా రిజిస్టరు చేయాలి. ఈ కొరతవల్ల దేశంలోని ఆయుర్వేద వైద్యులు వేలసంఖ్యలోనివారు బాధ పడుతున్నారు. బహుకాలంగా ఈ సమస్య నలిగిపోతున్నది. ప్రభుత్వ సహాయములేని వేలాది గ్రామాలలో ఈ వైద్యులు ప్రజారోగ్యమును సంరక్షించుతూ ప్రజలచే పోషింపబడు తున్నారు. ఈ వైద్యులందరికి మద్రాసుబోర్డులో చాలా అన్యాయం జరిగింది. అంటూ బహుకాలంగా నలిగిపోతున్న విషయములన్నియు వివరించాను. శ్రీ ప్రకాశం పంతులు గారు శ్రద్ధతో విని - "ఏమయ్యా అతనెవరో చెబుతున్న దంతా నిజమేనా? అసలు మీతో వచ్చినవాడేనా - అయితే పరిచయాల్లో అతని పేరు చెప్పలేదేం" అంటూ గుక్కతిర క్కుండా ప్రశ్నలు వేశారు. మిత్రులు బిక్కమొగంవేసి నిలబడి పోవడంతో శ్రీ పంతులుగారు నన్ను "ఏవూరయ్యా నీది" అంటూ - ఈ విషయాలన్నీ నాకు తెలుసు. దేశంలో వైద్యుల నందర్ని రిజిస్టరు చేయవలసిందే - చేస్తాము లక్ష్మీ పతి చాలాసార్లు చెప్పిన సంగతులే - ప్రభుత్వానికి విజ్ఞప్తి సమర్పించాలన్నప్పుడు రాష్ట్రంలో వున్న గ్రామాలెన్ని వాని జనాభా లెలావున్నాయి. ఆయా గ్రామాలకుగల వైద్య సౌకర్య మెలాంటిది. వైద్యశాలలు వున్నాయా - వుంటే యేవిధానం లోనివి. ప్రజాభిప్రాయం యే వైద్యముపై మొగ్గుతున్నది. ఇత్యాది విషయములు పేర్కొంటూ జిల్లా, తాలూకా, ఫిర్కా, గ్రామాలవారిగా వివరాలు



ఆంధ్ర గవర్నరు శ్రీ చందూలాల్ త్రివేదిగారి వద్దకు ది 17-1-54న రాయభారము వెళ్ళిన శ్రీయుతులు మల్లెల శోభనాచల చక్రవర్తి, అవనిగడ్డ నాగభూషణం, ముక్కామల వెంకటశాస్త్రి, తి. ప. రామానుజ స్వామి, కవిరాజ స్వామి ప్రజ్ఞానానందజీ, కవిరాజ మోహన్, పిళ్ళా అప్పలనరసయ్య పాత్రుడు గార్లు.

సేకరించుట అవసరమని, అచ్చట వైద్యులెంతమంది వున్నారో ఇత్యాది విషయములు తెలియ జేయాలని, అలాంటివేమీ లేకుండా ఎందుకీ విజ్ఞప్తులు. మీకేమి కావాలో మీరు చెప్పలేని స్థితిలోనిది చెబితే ప్రభుత్వానికి అర్థంకానిది ఆచరణలో పెట్టలేనిది ఎందుకయ్యా! "వైద్యుల రిజిస్ట్రేషను కావాలన్నాడు అదొక కోరిక" సాధ్యం అవుతుంది. సర్కారుకు డబ్బువస్తుంది. దానితో కొన్ని పనులవుతాయ్ - సరే



నాటి ముఖ్యమంత్రి శ్రీ టి. ప్రకాశం పంతులు గారు.

మీరు అందరు ఒకఅభిప్రాయంతో సమగ్రముగా ఆయుర్వేదం అభివృద్ధి పొందడానికి ఒక సూచన చేయండి. ఒక కమిటీ వేస్తాం-సమర్థులైనవారి పేర్లు యివ్వండి" అంటూ గంభీర స్వరముతో మాట్లాడారు. ఆయన పేర్లు అడగడమే తడవుగా జేబులో నుండిఒక కాగితం బయటకువచ్చింది. ఆ కాగితం యెప్పుడు వ్రాయబడిందో నాకుమాత్రం తెలియదు. ఆ జాబితా శ్రీ ప్రకాశం పంతులుగారు చేతితో తాకకుండానే - "ఇదిగో - మీతోవచ్చిన అతని పేరుకూడా జాబితాలో వ్రాశారా? అని ప్రశ్నించారు. దానికి మౌనమే!! మళ్ళీ మందలింపులు జరిగిన తరువాత ఆ జాబితాలో ఆ పేరు వ్రాయబడింది. తరువాత పేర్లుచదవమన్నారు. జాబితాతీసుకొన్నారు. తరువాత శ్రీ ప్రకాశంగారి మంత్రివర్గం సమయములోనే శ్రీ లక్ష్మీపతిగారి అధ్యక్షతను ఒక కమిటి వేయబడినట్లు పత్రికల్లో చదివాము.

## ఆంధ్రలో ప్రచారం

నేను ప్రథమంలో వివరించినట్లు ఏనాటికి అభిప్రాయ భేధాలు పోయేవిధం లేదని నాకు మాత్రం బాగా అర్థమైంది. ఈ కృత్రిమ విధానములతో ఈ అభిప్రాయ బేధాలతో యేమి యెలా చేయగలమో అనేది నిర్ణయించుటే కష్టమైపోయింది. అప్పటికే నా కార్యదర్శిత్వములోని ఆంధ్రప్రదేశ రిజిస్టర్డు కవిరాజ వైద్యమండలి బహు సంఖ్యాబలముతో వర్థిల్లుతున్నది. నిరంతరం ఆయుర్వేద ప్రచారమే ఆశయముగా గ్రామ గ్రామాలలో సభలు జరుపుతున్నాం. వైద్యుల ఆదరాభిమానములు విశేషంగా లభించుచున్నవి. బహుముఖంగా ప్రజాదరణయు లభ్యమగుచున్నది. ప్రచారమునకు దినపత్రికలు హర్షింపదగిన సహాయం చేయుచున్నవి. లోకం యీ విధంగా హర్షిస్తూ ఆదరిస్తూ ప్రోత్సాహ మిస్తూవుంటే - కొన్ని సంఘాలు, వ్యక్తులు, ఈర్షచే యేదోరకమైన దుమారంతో దుష్ప్రచారములు లేవదీస్తున్నాయి. నా కప్పటికి శ్రీ లక్ష్మీపతిగారి పరిచయం కల్గలేదు. గాని ఆయన ఉత్తరాలు వ్రాస్తున్నారు. కార్యక్రమం బాగున్నదన్నారు. ఆశీస్సులు పంపుతున్నారు. ఎంతమంది ఎన్ని అనుకున్నా శాంతంగా పనులు చేసుకుపోవడమే గాని ఎదిరించుతూ కార్యక్రమం పాడుచేయవద్దని వ్రాసేవారు. ఇట్లే నిరంతరం నన్ను



ది 1-10-54వ తేదీన జరిగిన కవిరాజపత్రికా ప్రారంభోత్సవ సభాదృశ్యము.



కవిరాజ పత్రికా ప్రారంభోత్సవ సభలో ప్రసంగిస్తున్న
శ్రీ డా. వై. సూర్యనారాయణరావుగారు

కలియుచున్న అభిమానులు, పెద్దలు ఐక్యంగా పనులు ప్రారంభించుట యుక్తమని మాతృసంస్థ అనేది ఒకటి వున్నదని దానికే ఈ గౌరవమిచ్చి అన్ని సంఘాలు అందులో విలీనమై యేకైక కార్యక్రమం యేర్పరచ వలసిందని సూచనలు, ఆలోచనలకు వచ్చాయి. అందుకై సమాలోచనలు జరుగుతూనే వున్నాయి. నా నిత్య కార్యక్రమము దేనికొరకు ఆపుటలేదు. ప్రచార అవశ్యకతకు స్వంతంగా ఒక పత్రిక అవసరమని తోచింది.

### కవిరాజ పత్రికా ప్రారంభోత్సవం

వెంటనే "కవిరాజ పత్రిక" అంటూ ఆర్థికంగా శక్తి చాలకపోయినా ధైర్యంతో ప్రారంభించాము. యే మూలధనంతో నిమిత్తం లేకుండానే ది 1-10-54వ తేదీని ఆంధ్రప్రభుత్వ అవతరణ మహోత్సవమునాడు "కవిరాజ పత్రికా" ప్రారంభోత్సవము జరిగింది. ప్రముఖనాయకులు, వైద్యులును ఆశీస్సులు పంపారు. ఆంధ్రలో ఆయుర్వేదోద్యమము ఇట్టి రూపంలో యేనాడు జరుగలేదని వ్రాసేవారి అభిప్రాయములు, ప్రోత్సాహమిచ్చే అభినందనలు, ఆశీస్సులు, శుభాకాంక్షలు, అసంఖ్యాకము. పత్రిక ప్రారంభమాదియు ఆనువంశిక వైద్య కుటుంబాల ఆయుర్వేద సేవ, ప్రజలకు వారిపైగల గాఢాభిమానం ప్రముఖులదృష్టికి [illegible]డానికి ఎంతో కృషిచేసింది. సభలలో సమావేశము[illegible] ప్రచారమునకు యోగ్యమైన సూచనలు ఆయుర్వే[illegible]వృద్ధి [illegible]కవసరమైన ఉపన్యాసములను ప్రకటించింది. దేశంలోని ప్రముఖుల, నిజమైన ఆయుర్వేద భక్తుల, ఆశీర్వాదముల నందింది. అధికార వర్గముల, మంత్రుల, గవర్నర్ల, కవుల, పండితుల సందేశములు పొందగల్గింది. ఆయుర్వేద వైద్యుల ప్రధాన ఆశయమైన 'రిజిస్టరు' గురించి ప్రభుత్వ దృష్టికి అభ్యర్థన చేయుటలో గొప్ప కృషిచేసింది. చికిత్సా పద్ధతుల అభ్యున్నతిని ఆదర్శంగా పనిచేసింది. వైజ్ఞానిక ప్రచారము చేయుటలో ఎంతో తోడ్పడింది. సాధ్యము గాదనుకొన్న పనుల నన్నింటిని పైన వేసుకొని సులభమొనరించింది. కార్యక్రమాన్ని సృష్టించుకొని, కావలసిన సహాయాల్ని ఆదరాభిమానములతో సంపాదించి సువర్ణాక్షరములతో లిఖింపదగిన ఆయుర్వేద ప్రచారము చేయగల్గింది. అత్యుకుమించిన ప్రతులు దేశవ్యాప్తం చేసింది.

## ఆశీస్సులు, ఆదేశములు

భారత ఉపాధ్యక్షులు :
సర్. యస్. రాధాకృష్ణన్‌గారు

*Dear Sir,*

I am glad to know tnat you are bringing out a Telugu Monthly called Kaviraj. My best wishes for its success.

---

మధ్యప్రదేశ్ గవర్నరు
శ్రీ పట్టాభి సీతారామయ్యగారు

**MESSAGE**

The first anniversary of the Andhra State is a appropriate time for your magazine to see the light of day. That you are devoting the bulk of it to the study and popularization of the Ayurvedic science adds considerably to its usefulness. I wish it success.

నేటి రివిన్యూశాఖామాత్యులు

శ్రీ కళా వెంకటరావుగారు.

*Dear Friend,*

I am glad you are bringing out KAVIRAJ. I hope and wish that your magazine will serve the cause of Ayurveda in trying to install it in its ancient glory.

---

ఆంధ్ర ఆయుర్వేద బోర్డు అధ్యక్షులు

శ్రీ భిషగ్రత్న డా॥ ఆచంట లక్ష్మీపతిగారు,

బి. ఎ. ఎమ్. బి. అండ్ సి. యమ్.

తాము నడుపు వైద్యపత్రిక లోకోపకారముగా వర్ధిల్లునని ఆశించు చున్నాను.

ఆంధ్ర ఆయుర్వేదబోర్డు స్పెషల్ ఆఫీసరు,

ఆయుర్వేదాచార్య,

శ్రీ ములుగు విశ్వేశ్వరశాస్త్రిగారు

తాము "కవిరాజ" అను పత్రికను నడుపదలచినటుల వ్రాసితిరి. అది చాల సంతోషకరవార్త. వైద్యులకు విజ్ఞానాభివృద్ధికిని, ఇతరుల అనుభవముల గుర్తెరుగుటకును వైద్య పత్రిక లెంతయు సహకారులగును. కనుక ఆయుర్వేద ప్రచారార్థమును, వైద్యులకుపయుక్తముగ నుండునటులను తమ పత్రికను నడుపునటుల నిశ్చయించిరని తెలిపియుంటిరి. ఇదెంతయు ముదావహము. మీ యత్నము సఫలమగుగాకయని శ్రీ ధన్వంతరిని ప్రార్థించుచున్నాను.

---



ఆయుర్వేదముపై సమగ్ర పథకమును రూపొందించుటకు విజయవాడలో సమావేశమైన నిపుణుల కమిటీ అధ్యక్షులు శ్రీ డా॥ లక్ష్మీపతిగారు, తక్కిన సభ్యులు.



ది 7-3-54వ తేదీన విజయవాడ దేశీయ వైద్యసంఘము (రిజిష్టర్డు) ఆంధ్రప్రభుత్వ నియమిత ఆయుర్వేద నిపుణాల కమిటి సభ్యులైన శ్రీ కవిరాజ మోహన్‌ను సుప్రసిద్ధ కాంగ్రెస్ నాయకులు శ్రీ గద్దె రంగయ్యనాయుడుగారి అధ్యక్షతను సన్మానించిన సందర్భములోని ఛాయా చిత్రము.

ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి కార్యవర్గసభ్యులు

ఆ యు ర్వే దా చా ర్య,

శ్రీ శిష్టా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

"కవిరాజ్ నవ్యభావములతో, సహనముతో, సమస్త ఆయుర్వేద వైద్యుల అభివృద్ధికి పాటుపడగలదని నమ్ముచున్నాను."

---

ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి ఉపాధ్యక్షులు,

ఆయుర్వేద సార్వభౌమ

శ్రీ మల్లెల శోభనాచల చక్రవర్తిగారు

మిత్రమా,

కవిరాజ అను ఆయుర్వేద మాసపత్రికను ఆంధ్రమున మీరు నడుప నున్నందుకు చాలా సంతోషము. ఆయుర్వేదవైద్యులను బెంగాలీలు కవి రాజులు,ఆంధ్రులు వైద్యరాజులు, ద్రావిడులు సిద్ధవైద్యులు, ఇతరప్రాంతీయులు



గుంటూరుజిల్లా ఆంధ్రప్రదేశ రిజిష్టర్డు కవిరాజ వైద్యమండలి ప్రారంభోత్సవము. (28-2-54)

యితర నామములలోను, అనుచున్నందున, పేరులు వేరైనను దాని అందరు సమానమే.

రవివెరుంగనిదికూడ కవి యెరుగుచున్నారు పరిపాలన, శిక్షణ, రక్షణ, ధాత్రీత్వము రాజగుణంబులు. కవిరాజయందు యీ రెండు విశిష్ట పదములు కలసి యున్నది లక్షణములు కొన్ని కన్పించియు, కొన్ని కన్పించకయున్న రోగములను దుష్టులను గుర్తించి శిక్షించుట, ఆరోగ్యమును రక్షణచేయుట, ఆయువును పాలన జేయించుట, బీదలకు ఉచితవైద్యము చేయుట ఆయుర్వేద వైద్యులకు సహజగుణములు. కవులందు, రాజులందు, ఉండు విశిష్టగుణములు కలది ఆయుర్వేదమగుటచేత, ఆయుర్వేద వైద్యులు నిజముగా కవిరాజులే, అందుచేత మీ పత్రిక నామము అర్థవంతముగ నున్నది.

ఆయుర్వేద పత్రికలు కొన్ని ఆంధ్రదేశమున సుమారు 40 సంవత్సరములనుండి నడుపబడు చున్నవి. అవి ఆయుర్వేద విశిష్టతను, ప్రజలకు, ప్రభుత్వమునకు, వైద్యులకు గుర్తింపచేయలేదు. వైద్యులకు విజ్ఞానము, ఐకమత్యము, సాంఘిక బలములను కూడా చేకూర్చలేదు. అందుచేతనే అవి రాణింపబడుటలేదు.

ఆంధ్రరాష్ట్ర మవతరించిన ఆరునెలలలోనే, సమగ్ర ఆయుర్వేదాభివృద్ధికర పథకము తయారుచేయుటకు ఆంధ్రప్రభుత్వముచే నియమింపబడిన ఆయుర్వేద కమిటీలో మీరును ఒక సభ్యులుగనుండి, ఆ రహస్య రిపోర్టును ప్రభుత్వమునకందజేసి యుండుటచేత, అభ్యుదయకర విధానములతో, సకలరంజకముగ యీ పత్రికను నడపండి. అందుకు సకల సాధన, సంపత్తులు, ఆయురారోగ్యములు సంపూర్ణముగా మీకు శ్రీ ధన్వంతరి ప్రసాదించుగాకయని గోరుచు నా ఆనంద ఆశీర్వాదములను తెలుపుచున్నాను.

# ఆయుర్వేదమునకు సమగ్ర పథకం

పత్రికా ప్రారంభోత్సవముపై లభించిన ప్రోత్సాహము వలెనే ఆయుర్వేదాభివృద్ధిని గురించి అనేకమంది ప్రముఖులు వివిధ సూచనలు పంపసాగిరి. శ్రీ లక్ష్మీపతి కమిటి ఆయుర్వేదముపై సమగ్రపథకం రచియించి ప్రభుత్వమునకు సమర్పించవలయునని అందు దేశములోని అసంఖ్యాక వైద్యబృందము యొక్క రిజిస్ట్రేషను సమస్యలు సవ్యంగా పరిష్కారము కావలెనని కోరుతూ వచ్చారు. ఇంతలో 1954 జూన్ 12వ తేదీని నిపుణులకమిటి సమావేశములు విజయవాడలో ప్రారంభమైనవి. అందనేకవిషయములు చర్చింపబడినవి. శ్రీ లక్ష్మీపతిగారు తమఅభిప్రాయములను ప్రకటించి అనధికార ప్రముఖుల నుండి అభిప్రాయములు సేకరించారు. అధికార సభ్యులు యేవో స్వల్ప అభిప్రాయములలో భేదమువచ్చినా చాలా భాగాలలో యేకగ్రీవం ప్రకటించారు. అందు వైద్యుల రిజిస్ట్రేషను సమస్యలో - బెంగాలు మొదలైన ప్రభుత్వ బోర్డులలో రిజిష్టరైన వారలను గురించి సరియైన తీర్మానాలు చేయబడినవి. పథకం చాలా దీర్ఘమైనదిగా రూపొందింపబడింది. ప్రభుత్వానికి సమర్పించుటయు జరిగింది.

## సంఘాల సమాఖ్య

ఆయుర్వేద నిపుణుల కమిటీ యేర్పడింది మొదలు సంఘ పురోభివృద్ధికొరకు ఆయుర్వేద చికిత్సాపద్ధతులు క్రమపరచుటకొరకు ఐక్యసంఘ సమాఖ్య నిర్మాణించుటకు కార్యక్రమం ప్రారంభమైంది. ప్రభుత్వముపై యెట్టి వొత్తిడి లేదు. ప్రభుత్వం నిపుణులు సమర్పించిన నివేదికపై ఒక అభిప్రాయమునకు రావలసి యున్నది గదా? అది ప్రకటితమైన తరువాతనే ప్రభుత్వ సమాలోచనలు ప్రారంభం కావలయుననే నిర్ణయం పాటింపబడింది. అయితే సరిపడని సమస్యలు కల్పించుకొని నివేదిక సమగ్రము కాగల్గుటకు ప్రభుత్వం నిర్ణయించిన కమిటీలో తగు సమర్థులైన సభ్యులు యేర్పడలేదనే వాదం - ప్రభుత్వానికి వ్యక్తిగతంగా వ్రాసినవారు లేకపోలేదు. సమాజముకొరకు పనిచేయకుండా మాకు ప్రాతినిధ్యము లభించలేదనే ఆవేదనతో అవాకు-చవాకు తీర్మానాలు పంపినవారు లేకపోలేదు. ఏది ఎందరు యెలాచేసినా మంత్రివర్గములలో మార్పులు సంభవం కావడం శ్రీ ప్రకాశం పంతులు మంత్రివర్గం నిష్క్రమణ జరపడం నూతన మంత్రివర్గము యేర్పరచుకొనుటలో ప్రభుత్వ రాజకీయాల సంరంభములలో ఆయుర్వేదాభివృద్ధి నివేదిక ప్రభుత్వ కార్యాలయములో రెండేండ్లు విశ్రాంతి తీసుకొన్నదని చెప్పవచ్చును.

ఈ రెండేండ్లలో దేశంలోని ఆయుర్వేద సంఘాలలో యెంతో మార్పు వచ్చింది. ఎంతో ప్రచారము జరిగింది. దేశంలో సంఘాలన్ని యేకసంఘముగా యేర్పడవలయుననే సమాలోచనలు తలయెత్తినవి. కొన్ని సమావేశములు చర్చలు అనంతరము ఒక నిర్ణయమునకు రాగలిగారు.



బాపట్లతాలూకా కవిరాజ వైద్యమండలి ది 20-3-54న పొన్నూరులో, ఆయుర్వేద నిపుణుల కమిటి సభ్యులైన శ్రీ మోహన్‌గారిని సన్మానించిన చిత్రం.



గుంటూరు, కృష్ణా జిల్లాల కవిరాజ వైద్యమండలి కార్యకర్తలసభ ది 28-4-54న జరిగినసందర్భములో

## 26వ ఆంధ్ర వైద్య సమ్మేళనము

తత్ఫలితంగానే నర్సాపురంలో చరిత్రాత్మకమైన ఆయుర్వేద మహాసభలు జరిగినవి. అవే 26వ ఆంధ్ర ఆయుర్వేద వైద్య సమ్మేళన సభలు. ఆ సభలు అంత బ్రహ్మాండంగా జరుగుటకు తగుశ్రద్ధ వహించినవారు శ్రీ వస్తాదు వెంకటస్వామిగారు. ఆంధ్రలోని అన్ని జిల్లాలవారు, అన్ని వర్గాలవారు దయచేశారు. 1955 సెప్టెంబరు 10, 11, తేదీలలో జరిగిన ఆ సభలకు మంత్రి శ్రీ ఎ.బి. నాగేశ్వరరావుగారు, శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు హాజరైనారు శ్రీ డా॥ ఆచంట లక్ష్మీపతిగారు సభ తమపర్యవేక్షణలో జరిగించారు. సహజంగా ఎన్నికలు జరుగు సభలలో ఎన్ని తమంగాలు జరుగాలో అన్ని జరిగినవి. అంతకు మించికూడా జరిగినవని చెప్పవచ్చును. వేలాది సంఖ్య వైద్యబృందముతో నిండియున్న ఆ మహాసభలో సభ్యుల ఆమోదముతో జరుగవలసిన ఎన్నికలు అల్పసంఖ్యాకులైన పదవీ వ్యామోహితులు చాలా చికాకు కల్గించారు. ఎవరు ఎట్టి అభిప్రాయములకులోనైనా శ్రీ లక్ష్మీపతిగారు విశాల హృదయంతో తమపర్యవేక్షణలో సభలు జరిపించారు. నాటి ఎన్నికలలో శ్రీ వైద్యరాజ వస్తాదు వెంకటస్వామిగారు అధ్యక్షులుగాను, నేను (కవిరాజ మోహన్) ప్రధాన కార్యదర్శిగాను, మరికొందరు ప్రముఖ కార్యవర్గ సభ్యులతోను ఆంధ్ర ఆయుర్వేద వైద్య మండలి 1955 సెప్టెంబరు 10, 11, లలో యేర్పడింది. అంతకు పూర్వం ఆంధ్ర వైద్యమండలి అనుపేరుతో నడచిన సంస్థ వివిధ రాష్ట్ర సంఘముల కలయికతో యీ నామకరణం జరిగింది. ఇంత మహోన్నతంగా జరిగిన సభలు ఆంధ్రలో యేనాడు జరుగలేదనియే చెప్పవచ్చును. వచ్చిన వేలాదిసంఖ్య వైద్యులకు శ్రీ వెంకటస్వామి గారి సహకార సంపత్తితో యేర్పడిన ఆహ్వానసంఘము ప్రశంసనీయముగా పని చేశారు. అందరికి భోజనాది వసతులు యేర్పరచారు.

చరిత్రాత్మకమైన ఈ మహా సభలను శ్రీ లక్ష్మీపతిగారు ప్రజాభిప్రాయమును గుర్తించి తమపర్యవేక్షణలో విజయము పొందించుకొన్న ఈ సభలు క్రమముగా జరుగలేదని ఆందోళన పడ్డవాళ్ళు లేకపోలేదు ప్రప్రథమంలో పేర్కొన్న రెండోవర్గం అనుయాయుల శ్రేష్ఠమీద తెఖపెట్టేవారిదే యీ బాధంతాను లోకం ఆమోదించనివారి వాంఛలు వక్రగతిలో కలాలు దొర్లించి తమ వాణిని దుర్వినియోగం చేసుకొన్నారు. ఎట్టి గందరగోళం యెవరు పడ్డా - తదాదిదేశంలో జరిగిన బ్రహ్మాండమైన ఆయుర్వేద ప్రచారము చరిత్రకారుడు బంగారు సిరాతో వ్రాయతగినదని అభిజ్ఞులు అంగీకరింప వలసినదే.

## 26వ ఆంధ్రవైద్య సమ్మేళన సభల ప్రతిభకు వైద్యమహాశయుల అభినందనలు.

### భిషగాచార్య
### గొట్టుముక్కల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
(ఆంధ్ర ఆయుర్వేద పరిషత్తు అధ్యక్షులు, కాకినాడ)

మీరు కార్యదర్శిగా యెన్నుకోబడడం నాకు చాలా సంతోషం కలిగించింది. మీ కార్యదర్శిత్వములో ఆంధ్ర వైద్యమండలి అభివృద్ధి పొందగలదని నమ్ముతున్నాను. అట్టి శక్తి మీకీయవలసిందిగా భగవంతుని ప్రార్థిస్తున్నాను.

( తరువాయి 37వ పేజీలో )

నర్సాపురంలో జరిగిన 26 వ ఆంధ్ర
ఆయుర్వేద వైద్యసమ్మేళనములో



నర్సాపురం మహాసభలు తమ పర్యవేక్షణలో విజయము
పొందించిన శ్రీ లక్ష్మీపతిగారు.



ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలికి అధ్య
క్షులుగా ఎన్నికైన శ్రీ వైద్యరాజ
వస్తాదు వెంకటస్వామిగారు.





నర్సాపురం సభల విజయమునకు
తోడ్పడిన శ్రీ కవిరాజ
బుద్ధరాజునరశింహరాజుగారు



26వ ఆంధ్ర ఆయుర్వేద వైద్యసమ్మే
ళన ఆహ్వాన సంఘాధ్యక్షులు కవిరాజ
శ్రీ బల్లా నరశింహమూర్తిగారు



ప్రధాన కార్యదర్శిగా
యెన్నికైన
శ్రీ కవిరాజ మోహన్.

## శ్రీ విప్రరత్న డా॥ ఆచంట లక్ష్మీపతిగారు

బి. ఏ., యం. బి. సి. యం.

"శ్రీ వస్తాదు వెంకటస్వామి నాయుడుగారికి ఎంత పరపతి యున్నదిన్ని, శ్రీ నాయుడుగారు ఆయుర్వేదముయొక్క ఔన్నత్యమునకై యెంత మనఃపూర్వకముగా కృషిచేయుచున్నదియు నరసాపురము ఆయుర్వేద మహాసమ్మేళనము వలన స్పష్టపడినవి. శ్రీ నాయుడుగారు తిరిగి రాగల సంవత్సరమునకు అధ్యక్షులుగా ఎన్నుకొనబడుట నాకు చాలా సంతోషముగా నున్నది."

### ఆయుర్వేదాచార్య శిష్టా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, గుంటూరు.

"మీరు వ్రాసిన ఉత్తరం అందినది. ఆయుర్వేదముయొక్కయు, ఆయుర్వేద వైద్యులయొక్కయు, అభివృద్ధికి ఆంధ్రవైద్యమండలిద్వారా చేయు కృషికి నా చేతనైన సహాయము ఎప్పుడును చేయగలను. అభిప్రాయ భేదములు కల అందరిని కూడగట్టుకొని నర్సాపురం సమ్మేళనముయొక్క ఉద్దేశములను ఆచరణలోకి తెచ్చెదరని నమ్ముచున్నాను."

### డా॥ వల్లూరి సుబ్బారావుగారు, గుంటూరు.

శ్రీ లక్ష్మీపతిగారు చేసినపని చాలా సంతోషము కలిగించినది. నారాయణుడు సారథ్యము వహించి నరులచేత కార్యములు నెరవేర్చుకొనినట్లు భారత రామాయణములు నిదర్శనములు. భారతములోని అర్జునుడిగను, రామాయణము లోని హనుమంతునిగను మీచేత కార్యములు సాధింపవలది శ్రీ లక్ష్మీపతిగారు సారథ్యము వహించారు. మీరును భక్తిశ్రద్ధలతో కార్యము నెరవేర్చగలరని ధ్యేయమునాయున్నది.

### ప్రాణాచార్య డి. రంగారాయలుగారు

(శ్రీ రామమోహన ఆయుర్వేద కళాశాల, గుంటూరు.)

"తాము ఆంధ్రవైద్యమండలి కార్యదర్శి కావడం ముదావహం. తమ కార్యదక్షిత్వమున ఆంధ్ర వైద్యమండలి త్రిగుణీకృతోత్సాహము మెరయుగాక. తాము ఆంధ్ర దేశీయ వైద్యులకు మహోపకారము చేయుదురు గాక"

## రాష్ట్రంలో ఆయుర్వేదాభివృద్ధికై తోడ్పడిన ప్రముఖ కార్యదక్షులతో శ్రీమోహన్

పశ్చిమ గోదావరి జిల్లాలో ఆయుర్వేదాభివృద్ధికై ప్రముఖముగా కృషిచేయుచున్న ప్రధాన కార్యకర్తలు కవిరాజ కూచి వెంకటసుబ్బారావు, కవిరాజ మొగల్ మస్తాన్‌సాహెబ్ గార్లు



మండలి భావి కార్యక్రమమును గూర్చి శ్రీ మోహన్‌తో చర్చించుచున్న సందర్భములోని ఛాయాచిత్రము.



నాటి సభాపర్యవేక్షణలో న్యాయముగా ఎన్నికలు జరుపుటకు తోడ్పడిన ప్రధానులలో ఒకరైన



భారత విఖ్యాత మూలికావైద్య ప్రముఖులు

శ్రీ బాలరాజ మహర్షి.



ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి ప్రధాన కార్యదర్శి శ్రీ కవిరాజ మోహన్ గారికి వైద్యమిత్రుల అభినందనలు.



మూలికా వైద్యప్రముఖులు శ్రీ బాలరాజ మహర్షిగారు కవిరాజ పత్రికా కార్యాలయమును సందర్శించినప్పుడు



బాపట్లతాలూక ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి ప్రారంభోత్సవము.

( 37వ పేజీ తరువాయి )

## కవిరాజ స్వామి ప్రజ్ఞానానందజీ

ప్రెశిడెంటు :

ఆంధ్రప్రదేశ రిజిష్టర్డు కవిరాజ వైద్యమండలి,

పశివేదల, (Via) నిడదవోలు.

“నర్సాపురం వైద్య సమ్మేళనములో కార్యదర్శిగా ఎన్నికైనట్లువిని చాలాసంతోషము కలిగెను. ఈ ఘనవిజయమునకు నా హృదయపూర్వక వందనములు స్వీకరింప గోరెదను”

## వైద్యశ్రీ చందు సుబ్బారావుగారు

26వ ఆంధ్ర ఆయుర్వేదసమ్మేళనము నర్సాపురంలో సంపూర్ణ సమైక్యతతో విజయవంతముగా ముగిసినందుకు యెంతయు సంతసించుచున్నాను. అధిక సంఖ్యాకులతో జరుపదలచిన శ్రీ నాయుడుగారు జిల్లాఅంతా పర్యటన జరిపి గ్రామాలలోయున్న వైద్యులందరిని సభ్యులుగా జేర్పించుటలో తదితర ప్రాంతీయ వైద్యులందరితో గూడిన సభా మందిరము క్రిక్కిరిసిపోయింది. పదేండ్లుగా ఇటీవల జరిగిన ఆంధ్ర ఆయుర్వేద సమ్మేళనము ఇంతటి సంపూర్ణ సంఖ్యాబలంతో జరిగియుండలేదు. ప్రత్యేకవిశిష్టతతో వివిధ ఆయుర్వేద సంస్థలన్నియు సమైక్యతతో పాల్గొన్న స్వరూపం చూస్తే సమ్మేళనముకెంతో శోభాయమానం కల్గింది.

ఆంధ్ర ఆయుర్వేద ప్రాముఖ్యమునకు యేకైక నాయకుడైన శ్రీ ఆచంట లక్ష్మీపతిగారి పాత్ర ఎంతయు స్తవనీయ మైనది. తాత్కాలికాధ్యక్షులగు శ్రీ లక్ష్మీపతిగారు గొప్ప విశాల భావంతో ధీరోదాత్తతతో శ్రీ వస్తాదు వెంకటస్వామి గారిని సమ్మేళనాధ్యక్షులుగా ప్రతిపాదించి యేకగ్రీవ యెన్నికకు జయజయ ధ్వనులమధ్య విజయము కల్గించినారు. నిజమునకు గత 10 సంవత్సరములుగా జరుగుతూన్న ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలిలో పెంపొందుచున్న వర్గ పోరాటములలో - కారణాంతరములచేత కొద్దిగనో గొప్పగనో నేను చిక్కుపడి, శ్రీ లక్ష్మీపతిగారితో యేకీభావంలేక ఆంధ్ర వైద్యలోకమునకు స్థాయిని కల్పించిన



ది 27-11-53న గుంటూరులో జరిగిన ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి కార్యవర్గ సమావేశము.



శ్రీ ఆయుర్వేదాచార్య శిష్ట్లా సుబ్రహ్మణ్యశాస్త్రిగారి గృహావరణలో గుంటూరుజిల్లా యం. యల్. ఎ. లకు జరిగిన సన్మాన సందర్భములో

వారిలో నేనొకడ్ని. అట్టి చర్యకు కారణభూతులైన నాయక వర్గ పోరాటములలో అనుయాయినైన నాబోటివాడు శ్రీ లక్ష్మీపతిగారితో యేకీభవించ లేకపోయినందుకు యెంతో పశ్చాత్తాప హృదయంతో యీ ప్రకటన చేయుచున్నాను. శ్రీ లక్ష్మీపతిగారు ఎట్టి పరిస్థితులలోనైనను యేకైక నాయకుడుగా వ్యవహరింపవలసినవారు. ఆత్మ విశ్వాసముతో వారి నాయకత్వంక్రింద సమ్మేళనాధ్యక్షులు శ్రీ వస్తాదు వెంకటస్వామిగారును, మిగిలిన సోదర వైద్యులును, శ్రీ లక్ష్మీపతిగారి అడుగు జాడలలో నడచిన నాడే ఆంధ్రాయుర్వేద వైద్యమండలికి సహజమైన ప్రతిష్ట రాగలదని నావిశ్వాసము. శ్రీ లక్ష్మీపతిగారు అధ్యక్షులైనను గాకుండినను - ఎల్ల దేశాలకు శ్రీవారే యేకైక నాయకులని చెప్పకొనక తప్పదు. ప్రత్యేక విశిష్టతకు ఇతరనాయకలోకం పెనగులాడక గత

మనుమరచి భావిలో లక్ష్మీపతిగారినాయకత్వం శిరసావహించి, అఖిలభారతఆయుర్వేదమహాసభలను డిశంబరు 29, 30, 31, కర్నూలులోజరుప పూనుకొన్న శ్రీ లక్ష్మీపతిగారియొక్క కార్యభారములో భాగస్వాములై ఆర్థిక-శ్రామిక - రంగములలో శక్తివంచనలేని సహకారము నెరపుటకు పూనుకొనవలసినదిగా సోదర వైద్యమహాశయులందరికి నా విజ్ఞప్తి. అఖిల భారత ఆయుర్వేద వైద్యమహాసభలను లక్ష్మీపతిగారినాయకత్వమున విజయవంతి మొనర్చుటకు ప్రతి ఆంధ్ర ఆయుర్వేద వైద్యుడును తన విధియని నమ్మి ఆయుర్వేద పురోభివృద్ధికి నిష్కల్మష హృదయంతో తోడ్పడగలందులకు ప్రార్థించుచున్నాను.

## రాజవైద్య, వేదాంతం శ్రీనివాసాచార్యులుగారు

(ప్రెశిడెంటు గుంటూరుజిల్లా ఆంధ్రవైద్య మండలి, దుగ్గిరాల.)

"మీరు మండలి ప్రధాన కార్యదర్శులుగా ఎన్నికోబడి నందుకు చాలా సంతోషముగ నున్నది. మీ సారధ్యమున ఆంధ్ర ఆయుర్వేద వైద్యుల యేకైక సంస్థ అభ్యుదయమార్గమున శరవేగముతో పురోగమించి ఆంధ్రప్రజల ఆరోగ్య భాగ్యమును, వైద్యసోదరుల గౌరవాభ్యున్నతులను యినుమడింపచేయగలదని విశ్వసించు చున్నాను. ధన్వంతరి యనుగ్రహమున మీరు మీ కర్తవ్య నిర్వహణమున కృతకృత్యులగుదురు గాకాయని కోరుచున్నాను."

## కర్నూలులో జరిగిన 41వ అఖిల భారత ఆయుర్వేద మహాసభలు

ఇట్టి అమితోత్సాహముతో యువజన వైద్యప్రముఖుల తోడ్పాటుతో ఆయుర్వేద ప్రచారము ప్రారంభమై శ్రీ డాక్టరు అచంట లక్ష్మీపతిగారి ప్రోత్సాహంగా రాష్ట్ర)

( తరువాయి 40 వ పేజీలో )



మహాసభల్లో ఉపన్యసిస్తున్న ఆరోగ్యమంత్రి శ్రీ కళా వెంకటరావు, పండిట్ శివశర్మ గార్లు.



శ్రీ శిరిపురపు శేతుమాధవరావుగారు ప్రదర్శించిన శ్రీ నాగార్జున మూలికా ప్రదర్శనశాలా దృశ్యము.



ప్రపంచ ప్రఖ్యాత వ్యాయామ కోవిదులు శ్రీ దండమూడి రాజగోపాలరావుగారు తమ బలప్రదర్శనముచే సభలను రంజింపచేసిన దృశ్యము.

## కర్నూలులో జరిగిన 41వ అఖిల భారత ఆయుర్వేద మహాసభలు

( 39వ పేజీ తరువాయి )

వ్యాప్తముగా ప్రచారం ప్రారంభమైంది. అనేక ముఖ్య ప్రాంతములలో పర్యటన జరిగిన పిమ్మట 41వ అఖిల భారత ఆయుర్వేద మహాసభలు ఆంధ్రకు రాజధానియైన కర్నూలులో జరుపుటకు కార్యక్రమము ప్రారంభమైనది ఆంధ్ర ప్రభుత్వమునకు నిపుణుల కమిటి సమర్పించిన నివేదికపై ప్రభుత్వము ఎట్టి అభిప్రాయాన్ని ప్రకటించలేదు. ప్రభుత్వ దృష్టిలో ఆయుర్వేదాభ్యున్నతికి తగు కార్యక్రమము కల్పించవలసి యున్నదని అందుచేత 41వ అఖిల భారత ఆయుర్వేద మహా సభలు కర్నూలులో జరుపుట మంచిదని శ్రీ లక్ష్మీపతిగారు సూచన చేశారు. ఆయుర్వేదం విజయోన్ముఖ మగుటకు యిదిసమంజసమైన సూచనగా అభివృద్ధి కాముకులు తలంచారు. శ్రీ లక్ష్మీపతిగారికి తోడ్పాటుయిచ్చారు. చేయబడిన కృషిలో ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి ప్రధాన పాత్ర వహించిఎన్ని అవాంతరములనో ఎదుర్కొనవలసి వచ్చింది. ఇంటా బయటా కూడా అనైక్యపరుల దుశ్చర్యలను ఎదుర్కొంటూ సభా విజయం పొందించు కొన్నాం. భారతదేశంలో యేనాడు ఇంతటిమహోన్నతస్థాయిలో సభలు జరుగలేదను విఖ్యాతి లభించింది. ప్రభుత్వ అధినేత లందరు విచ్చేశారు. సుహృద్భావంతో ఆయు

( తరువాయి 41వ పేజీలో )



నర్సాపురం మహాసభల విజయానికి తోడ్పడిన వైద్యరాజ శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్య చౌదరిగారు. వీరు రాష్ట్రమండలి జాయింటు కార్యదర్శి.



కర్నూలులో జరిగిన 41వ అఖిల భారత ఆయుర్వేద కాంగ్రెస్ మహాసభలు.

వైద్యశ్రీయుతులు పండిట్ శివశర్మ, విద్యాపీఠాధిపతి పండిట్ బిశ్వేకర్, అధ్యక్షులు పండిట్ పార్థనారాయణ్ జీ, పండిట్ రాధాకముద ముఖర్జీ, కవిరాజ్ ప్రతాపసింహ, డాక్టరు లక్ష్మీపతి, కవిరాజ మోహన్, వైద్యరాజ వెంకటస్వామి, కవిరాజ కందుకూరి వెంకట సుబ్బారావు, సుభాన్ మొదలైనవారు, ఇంకా అనేకమంది వైద్యప్రముఖులు.

ర్వేదాభివృద్ధికి తోడ్పాటు లభింప చేస్తామన్నారు. తత్ఫలితంగానే ఆంధ్ర ప్రభుత్వం ఆయుర్వేదాభివృద్ధికి సమాలోచనలు కొనసాగించింది. నాటి ఆరోగ్య శాఖామంత్రి శ్రీ కళా వెంకటరావుగారు. దేశంలోని ఆయుర్వేద వైద్యుల పరిస్థితులు క్షుణ్ణంగా ఎరిగినవారు. వారి ఆధిపత్యములో ఆయుర్వేదానికొక మహోన్నత స్థాయి లభించాలని ఎంతగానో విజ్ఞప్తులు, అభ్యర్థనలు కొనసాగించాము. జిల్లా, తాలూకా, సంఘాలు స్థాపించు కొంటూ, నలుమూలలనుండి ప్రభుత్వమునకు వైద్యుల అభిప్రాయాలు అంపచేశాము. ప్రజాదరణ పొందగలిగాము. ఆంధ్రలోని ఆయుర్వేదోద్యమము సమీక్షించుచున్న అఖిల భారత ఆయుర్వేద సంఘాధ్యక్షులు శ్రీ వై. పార్థనారాయణ పండిట్‌జీ ఆహ్వానించగానే ఆంధ్రకు దయచేశారు. వారిచే ఆంధ్రలో చాలా భాగం పర్యటింపచేయించి - ప్రచారము చేశాము. ఇన్ని ఘనకార్యాలు మరపురాని సభలు సమావేశాలు జరిపిన ఫలితం అఖిల భారత నాయకులుహర్షించారు. భారత ప్రాచీన వైద్య శాస్త్రంపైగల ఆంధ్రుల ప్రేమానురాగాలకు ఆశీస్సులు పంపారు. వివిధ ప్రోత్సాహం లభింపచేశారు.

## ఆంధ్ర ప్రభుత్వం

ఆంధ్ర ప్రభుత్వం ఇంతలో చిత్తుచట్టం ప్రకటించింది. దానిపై అభిప్రాయాలు అందచేయ వలసిందని - ప్రకటించింది. ది 23-6-56 వ తేదీని చిత్తుచట్టంపై సూచన లందించుటకు నిర్ణయించుకొని నాటి ఆరోగ్య శాఖామాత్యులు శ్రీ కళా వెంకటరావుగారు విజయవాడ వచ్చిన సందర్భములో చిత్తుచట్టంపై అభిప్రాయములు వెల్లడించుటకు వచ్చిన 49 గురు ప్రముఖులతో ప్రభుత్వ అతిథి గృహానికి వెళ్ళి శ్రీ వెంకటరావుగారిని దర్శించాము వారి ఆదరాభిమానములతో చిత్తుచట్టముపై సమగ్ర సలహాల నందచేశాం. ఈ

(తరువాయి 44వ పేజీలో)



ఆరోగ్యశాఖామాత్యులు మాన్యశ్రీ కళా వెంకటరావుగారిని ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి జూలై 8వ తేదీని సన్మానించిన సందర్భములోని ఛాయాచిత్రము.



ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి ప్రారంభోత్సవములో ఏర్పడిన తాత్కాలిక కార్యవర్గము.

### అఖిల భారత ఆయుర్వేద మహా మండలి అధ్యక్షులు

## వైద్యశ్రీ పార్థనారాయణ పండిట్‌జీ తమ ఆంధ్ర పర్యటనలో



విజయవాడలో ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలివారు సన్మానించిన సందర్భములో
వేదికపై : శ్రీయుతులు పురపాలక సంఘాధ్యక్షులు పోతిన గణపతిరావు పాత్రుడు, అవనిగడ్డ నాగభూషణం, పండిట్ జీ, మోహన్ మొదలైనవారు.



కొవ్వూరులో
పండిట్ జీకి సన్మానం.



విజయవాడలోని వైద్యబృందములో
శ్రీ పండిట్ జీ

## కర్నూలులో జరిగిన
## 41వ అఖిలభారత ఆయుర్వేద మహాసభలు

( 41వ పేజీ తరువాయి )

గౌరవం ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలికే దక్కింది. రాష్ట్రములో వైద్యులు, అభిమానులు ఈసత్యాన్ని గ్రహించి అమితమైన ప్రోత్సాహం ఆర్థికంగా శారీరకంగా లభింప చేశారు. మండలికార్యవర్గ, స్థాయిసభ, మహాసభయు కార్యక్రమము సులభంచేయుటకు తోడ్పడింది. తత్ఫలితంగా తయారు చేయబడిన చిత్తుచట్టంపై సవరణలు ది 8-7-56న విజయవాడలో మంత్రి శ్రీ వెంకటరావు గారికి సమర్పించాము.

## ఆయుర్వేద చట్టము

భారతదేశ చరిత్రలో ఆయుర్వేదం చట్టంగా రూపొందించిన రాష్ట్రాలు బహుకొద్ది. ముఖ్యముగా మదరాసు ప్రభుత్వం ముప్పది యేండ్లుగా ఆయుర్వేదాన్ని గుర్తించినట్లు చరిత్ర కన్పిస్తూ వుంది. గాని పొందిన అభివృద్ధియు లేదు స్థిరమైన కార్యక్రమము లేదు. కన్పించే కార్యక్రమము ఎప్పటి కప్పుడు జి. ఓ. లపై ఆధారపడుతూ వచ్చింది. ఆ జి. ఓ. లు అధిక సంఖ్యాకులైన ఆయుర్వేద వైద్యులకు నష్టదాయకముగా నడచినవి. ఎందరు ఎన్ని ప్రయత్నములు చేసినా ప్రయోజనము లభించలేదు. ఆంధ్ర ప్రభుత్వం ప్రత్యేకింపబడ్డ తరువాత వైద్యలోకమంతటికి సంబంధించిన సంస్థ యేర్పడుతుందని ఆశించాము. అందులో ముఖ్యముగా ఆయుర్వేదమునకు వెన్నెముక యనదగిన గ్రామవైద్యులకు లభిస్తుందని ఆశించాము. అట్టి ఆశయముతోనే నేను ఆయుర్వేదోద్యమములో కృషిచేశాను. ఆ యాశయసిద్ధికే దేశమంతటా పర్యటించాను. సభలు సమావేశాలు జరిపాను. కలసిరాని వైద్యుల నందరిని కలసి వచ్చునట్లు కూడగట్టుకొని వేలాది సంఖ్యగల వైద్యులను మండలిలో కూర్చుకొని వారి ఆదరాభిమానములతో ప్రోత్సాహముతో ఇటు పత్రిక నడుపుతూ, అటు సంఘ పురోభివృద్ధిని సంపాదించుకుంటూ వచ్చాము. అట్టి సోదర వైద్యబృంద మందరచేతను మండలిచే చిత్తుచట్టముపై సమర్పింపబడిన సవరణలు బలపరచుటకు మంత్రి వర్గమునకు మహజర్లు పంపునట్లు ప్రయత్నించి విజయము పొందాము. దేశంలో గొప్ప సంచలనం వచ్చింది. ప్రజలుకూడా హర్షించారు. ప్రభుత్వం ఆదరించింది. వైద్యులు కృతజ్ఞత వెల్లడించారు. ఇంత ప్రతిభావంతమైన కార్యక్రమము మండలి ఆధ్వర్యముననే జరిగింది. ఇంతటి ఉత్సాహంతో అహర్నిశలు కృషిచేసి దేశవ్యాప్తంగా అభినందనలు పొందుతున్నను, మనలోని ఈర్ష్యాపరులు ప్రప్రథమంగా వివరించిన పెద్దన్నయ్యలు వెక్కిరింపులు మానలేదు.



అఖిలభారత ఆయుర్వేద మహామండలి అధ్యక్షులు రాజమండ్రి విచ్చేసిన సందర్భములో శ్రీ పండిట్ జీ, స్వామి ప్రజ్ఞానానందజీ, మోహన్, శ్రీ సుబ్రహ్మణ్యశర్మ, బంగారయ్య ప్రభృతులు.



ఆంధ్రాఆయుర్వేద వైద్యమండలి విజయవాడలో ఆంధ్ర ప్రదేశ్ శాసనసభాధ్యక్షులు శ్రీ కాశేశ్వరరావుగారిని సన్మానించినప్పుడు

పుట్టుకతో వచ్చిన బుద్ధి పుల్లలలో పెట్టినప్పుడే పోతుందన్నట్లు వ్యవహరిస్తూనే వున్నారు.

## కా ర్య ద ర్శి తో చ ర్చ

ప్రభుత్వ ఆరోగ్యశాఖా కార్యదర్శికి జూలై 1వ తేదీని చిత్తుచట్టముపై సవరణలు దాఖలు పరచాము. ఆయన అనేక ముఖ్యవిషయములు చర్చించి ఆమోదించారు. ప్రభుత్వ చిత్తు చట్టంలోని భాగాలు, మండలి సమర్పిత సవరణలు ప్రత్యేక ముగా ఇంగ్లీషులో, తెలుగులో ముద్రించాము. దేశవ్యాప్త ముగా ఆంధ్ర శాసన సభాసభ్యులకు మండలి సభ్యులకు అనేకమంది నిపుణులకు పంపి సూచనలు బాగున్నవని ఆమో దింప చేశాము. ఇంతకృషి అనంతరం ఆంధ్ర మంత్రిమండలి అగస్టు 1956 రెండవవారంలో ఆలోచించింది. ఏకగ్రీవంగా ఆమోదించింది. నాటి ఆరోగ్యమంత్రి శ్రీ కళా వెంకట రావుగారు 16వ తేదీ అగస్టు 1956న ఆంధ్ర శాసన సభలో ప్రవేశపెట్టి ఆయుర్వేద ప్రతిష్టను అభ్యున్నతిని సంరక్షిం చారు. ఆంధ్ర శాసనసభ్యుల ఆమోదముతో చట్టం కాబ డింది. రాష్ట్రపతి ఆమోదం పొందినట్లు అనుమతి వచ్చు సరికి కర్నూలునుండి ప్రభుత్వం హైదరాబాదు మార్పునందింది ఈ మార్పులువల్ల కాలం కొంత గడచిపోయింది. ఇటీవల 1957 మే 28వ తేదీని చట్టమునుసరించి బోర్డు నిర్మాణము జరిగింది. సెప్టెంబరు 20వ తేదీని బోర్డు సమావేశములకు ప్రారంభోత్సవమున్నూ జరిగింది. బోర్డు అధ్యక్షులు శ్రీ డాక్టరు లక్ష్మీపతిగారు విశాలదృష్టితో ఆయుర్వేదాభివృద్ధికై పథకములను ప్రవేశపెట్టి, సర్వతోముఖంగా అభ్యున్నతిని కూర్చగలరని, సభ్యులందరు తమ వెనుకటి ఆశయాలకు స్వస్తి చెప్పిఅయినా కార్యసౌలభ్యానికి దారితీస్తారని, ఆశింప వీలు వుతుందని అనుకొంటున్నాము. ఇంతటి సందేహానికి కార ణాలు బోర్డు నిర్మాణము సమగ్రముగా లేకపోవుటయే కార ణము, యే ఆశయముతో యీ కార్యక్రమము విజయవంత మగుటకు కృషి చేయబడిందో దాని కనుగుణ్యమగు నిర్ణయములు లేకుండుట – ఇంతటి ఘనకార్యానికి ఎవరు



42వ అఖిలభారత ఆయుర్వేద కాంగ్రెసు సంఘాధ్యక్షుల
(బెంగుళూరు)
కవిరాజ్ పండిట్
శ్రీ అనంత త్రిపాఠిశర్మగారు, బరంపురం.





7-9-57న శ్రీ శిష్ట్లా సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అధ్యక్షతను గుంటూరులో శ్రీ నాగార్జున మూలికా పరిదర్శనశాలయందు శ్రీ కవిరాజ మోహన్‌గారిని సన్మానించిన సందర్భములో



కడపజిల్లా ఆయుర్వేద మహామండలి సభకు అధ్యక్షత వహించిన శ్రీ మోహన్ గారికి వేదపండితులు ఆశీస్సులొసంగు దృశ్యము.



కారణభూతులలో వారికి స్థానములేకుండ ప్రభుత్వ నిశ్చయములు దొర్లిపోవుట, కార్యవాదులైన మండలి సభ్యులు పదవులకై పెనుగులాడేవారు కాదు. ఆశయసిద్ధికి భంగకరమైన నిర్ణయమని మాత్రము అసంతృప్తిని పొందారు. కార్యదీక్షాదక్షులు గనుక, శక్తివంచన లేకుండా తోడ్పాటు లభింపజేసి సహకరింప దలచారు.

మండలి సభ్యులీమాత్రమైనా అసంతృప్తిని పొందుటకు కారణము - కార్యరంగములో యేనాడు కన్పించనివారిని దేశంలో ఆయుర్వేదం పరిస్థితులు ఎరుగనివారిని, నేడు దేశములో ఆయుర్వేదం ఎలా అభివృద్ధి పొందవలెనో - ఆయుర్వేదీయులేమి కోరుచున్నారో - వారి అవసరములు ఎట్టివో గ్రహింపలేనివారిని - మొండి పట్టుదలతో వాదించేవారిని యేర్పరచుటయే కారణము. మద్రాసు బోర్డువలెనే వాదోపవాదములకే తావొసగునట్లున్న వారితో నిర్మాణించినందువలన యేర్పడిన బోర్డు యేమి చేయగలదో చూడవలయునని నిరీక్షించుచున్నాను.

## ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి

చరిత్రలో ముఖ్యభాగాలు వివరించుటలో పై కార్యక్రమము లన్నియు ఎట్టి వివాదములకు చోటీయకుండా ప్రధాన కార్యదర్శినైన నా ఆశయమునకు సంపూర్ణ సహకారము లభింపచేసింది. ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి కార్యవర్గ సభ్యులైననేమి, స్థాయీసమితి సభ్యులైననేమి, సర్వసభ్యులైననేమి అందరు ప్రోత్సాహమిచ్చారు. తగు సూచనలు యిచ్చారు. సభ్యతకు అలంకారమైన కార్యవర్గం జాబితా ఈ క్రింద పొందుపరచితిమి.

( తరువాయి 48వ పేజీలో )



తాడేపల్లిగూడెం తాలూకా ఆయుర్వేద వైద్యమండలి 7వ వార్షిక సభను శ్రీ మోహన్ ప్రారంభోత్సవము జరిపినదృశ్యం



గుంటూరు తాలూకా ఆయుర్వేద వైద్యమండలి వార్షికమహాసభకు శ్రీ మోహన్ అధ్యక్షత వహించిన దృశ్యం.



శ్రీ ఎనిబిల్లి సూర్యరాజుగారు తమ జననీ జనకులవర్ధంతి సందర్భంలో శ్రీ మోహన్‌గారిని సన్మానించి రు 116 లు నొసంగుట.



డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి 77వ జన్మదినోత్సవం

గుంటూరు తాలూకా ఆయుర్వేద వైద్యమండలి వారిచే శ్రీ డాక్టరు వల్లూరి సుబ్బారావుగారి గృహావరణలో జరిపినపుడు



గుంటూరు తాలూకా ఆయుర్వేద వైద్యమండలి శ్రీ పార్థనారాయణ పండిట్‌జీ గౌరవార్థం జరిపిన సభ.

( 45వ పేజీ తరువాయి )

ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి కార్యవర్గం వి 11-9-55 నుండి 27-12-56 వరకు పాలనలో నున్నది.

## వివరములు

1 అధ్యక్షులు-వైద్యరాజ వస్తాదు వెంకటస్వామిగారు

2 ఉపాధ్యక్షులు-1. ఆయుర్వేద సార్వభౌమ మల్లెల శోభనాచలచక్రవర్తిగారు

2. ఆయుర్వేద విశారద చక్రవర్తుల నరశింహాచార్యులుగారు

3 ప్రధాన కార్యదర్శి - కవిరాజ ఉరిటి సూర్యనారాయణ మోహన్‌గారు

4 కోశాధ్యక్షులు - చికిత్సావిశారద పిళ్ళా అప్పలనరసయ్యపాత్రుడుగారు

5 సంయుక్త కార్యదర్శులు- 1 వైద్యరాజ వస్తాదు వెంకటరత్నంగారు

2 వైద్యరాజ గోగినేని వెంకటసుబ్బయ్యచౌదరిగారు

## సభ్యులు

6 ఉన్మాదవైద్యాచార్య చందు సుబ్బారావుగారు

7 వైద్యరాజ దాశ్యం వెంకట రామానుజ సూరిగారు

8 వైద్యరాజ అవనిగడ్డ నాగభూషణం గారు

9 కవిరాజ రెడ్డి కోటయ్యనాయుడుగారు

10 వైద్యరాజ వి.కృష్ణమాచార్యులుగారు

11 రాజవైద్య వేదాంతం శ్రీనివాసాచార్యులుగారు

12 కవిరాజ బల్లా నరశింహమూర్తిగారు

13 ఆయుర్వేద వైద్యభిషక్ పురం వెంకటసుబ్బయ్యగారు

14 వైద్యశ్రీ పప్పు సూర్యనారాయణ దొరగారు

15 వైద్యశేఖర పొన్నాడ వెంకటాద్రి గారు

16 కవిరాజ గన్నామంతిన వెంకట జమాలుశెట్టిగారు

17 కవిరాజ మొగల్ మస్తాన్‌సాహెబ్ గారు

18 వైద్యశ్రీ వల్లూర్ సుబ్బారావుగారు

19 కవిరాజ రాపర్తి రామజోగిగారు

20 వైద్యరాజ చిత్రికవి అనంతాచార్యులుగారు

21 వైద్యరాజ కొండపనేని చలమయ్య చౌదరిగారు

22 కవిరాజ మిద్దె సంజీవనాయుడుగారు

23 కవిరాజ యం. యస్. సుభాన్ సాహెబ్‌గారు

24 కవిరాజ్ టి. కృష్ణమోహన్ గారు

25 వైద్యరాజ పాలపర్తి మోసస్‌గారు

26 వైద్యరాజ పసుపులేటి వెంకటసుబ్బారావు

27 వైద్యరాజ ముక్కానివసంరాజుగారు.

( తరువాయి 50వ పేజీలో



డి 18-11-56 న అనకాపల్లిలో జరిగిన విశాఖపట్నం జిల్లా ఆయుర్వేద వైద్యమండలి ప్రారంభోత్సవము. చిత్రంలో శ్రీ తి. వ. రామానుజస్వామి, శ్రీ కవిరాజమోహన్, శ్రీ పి. ఉమామహేశ్వరరావు, నాగం అప్పారావు మొదలైనవారు గలరు.





డి 15-4-56 వ తేదీని రాజమండ్రిలో ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి 2వ కార్యవర్గ సమావేశం. జరిగినప్పటి చాయాచిత్రము.





28-1-56 న తిరువూరు తాలూకా ఆయుర్వేదవైద్యమండలి ప్రారంభోత్సవము జరుపుతున్న శ్రీ కవిరాజ మోహన్.



గుంటూరు తాలూకా ఆయుర్వేద వైద్య మండలి వార్షిక సభా సందర్భములో పాల్గొన్న పెద్దలు, నూతన కార్యవర్గము



28-10-56 న ముక్త్యాలపేటలో జరిగిన కృష్ణాజిల్లా జగ్గయ్యపేట తాలూకా ఆయుర్వేద వైద్యమండలి ప్రారంభోత్సవము

( 48 వ పేజీ తరువాయి )

28 వైద్యశ్రీ పెద్దింటి వెంకటాచార్యులుగారు
29 కవిరాజ స్వామి ప్రజ్ఞానానందజీగారు
30 ప్రాణాచార్య డి రంగాచార్యులుగారు
31 వైద్యరాజ ముక్కిపూడి రామకోటీశ్వరరావుగారు
32 వైద్యశ్రీ ఈదర వెంకటరామయ్యగారు
33 వైద్యవిద్వాన్ కంభంమెట్టు విష్ణువర్ధనరావు
34 వైద్యశ్రీ కానులనాటి ఆంజనేయ శర్మగారు
35 ఆయుర్వేదాచార్య శిష్ట్లా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
36 వైద్యశ్రీ ప్రకాశచంద్ర శతపథిగారు
37 వైద్యశ్రీ శిరిపురపు శేతుమాధవరావుగారు
38 భిషగాచార్య గొట్టుముక్కల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
39 వైద్యావధాని, కవిరాజ కందుకూరి వెంకటసుబ్బారావుగారు
40 పండిట్ ధన్వంత్రి రఘూత్తమాచార్యులుగారు
41 కవిరాజ స్వామీ హంసానంద సరస్వతిగారు
42 వైద్యరాజ టి. జియ్యరుదాసుగారు M. L. A.
43 కవిరాజ వి. కామరాజుగారు

ఇట్టి దీక్షాతత్పరులైన 45 గురు కార్యవర్గ సభ్యులతో, 175 గురు స్థాయిసమితి సభ్యులతో 18 వందలకు మించిన సర్వసభ్యులతో నిండియున్న ఆంధ్రఆయుర్వేదవైద్యమండలి ప్రభుత్వములమార్పు ననుసరించి హైదరాబాదులోని ఆయుర్వేద మండలిని విలీన పరుచుకొని ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలిగా రూపొందించుకొనుటకు ఆలోచనలు కొనసాగినవి. ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి, విశాలమైన హృదయంగల కార్యకర్తలు గలది గనుక స్థాయిసమితిలో చర్చించిఒక నిర్ణయమునకువచ్చి ది 28-12-56 వ తేదీని విజయవాడలో విలీన మహాసభలు జరుపుకొని తాత్కాలికముగా మహాసభ జరుపువరకు కార్యవర్గమును యేర్పరచుకోవడమైనది. అందులో 30 మంది కార్యవర్గ సభ్యులున్నారు. గత కార్యవర్గమే చాలా భాగమిందులో నున్నది. హైదరాబాదు శాఖవారే క్రొత్తసభ్యులని చెప్పవలసి యుంటుంది. విలీనం జరుగునాటికి ఆంధ్రలో గల మండలి సభ్యులు 18 వందలమంది వున్నారని యిదివరకే వ్రాసియున్నాము. నేడు దాదాపు నాల్గువేలమంది దాటినారు. ఇంతమందిలోను హైదరాబాదు శాఖవారు చేర్చిన సభ్యుల సంఖ్య యేమియు చేరలేదు. ఆ సంఖ్య యెంతవున్నదియూ అర్థము కావడంలేదు. నైజాంజిల్లాలలోని వైద్యసంఘాల సమైక్యమునకై యెంతో కృషిచేయవలసి యున్నది. కార్యదీక్షా తత్పరత లోపించినందున ఆ ప్రాంతీయ పరిస్థితులు మరింతలోపించిపోయినవి. ప్రతివారుకార్యదర్శులు, అధ్యక్షులు అంటూ నామకరణంచేసికొనుటతో తృప్తి పొందుచున్నారు.

( తరువాయి 52 వ పేజీలో )



23–9–56న కృష్ణాజిల్లా ఆయుర్వేద మహాసభలో ఆహ్వాన సంఘాధ్యక్షులైన శ్రీ హరుపిళ్ల చిట్టి M. L. A. గారు ప్రసంగిస్తున్న దృశ్యం.

★



ది 18–11–56 న కర్నూలుజిల్లా ఆయుర్వేద మండలి ద్వితీయ వార్షికసభ జరిగినప్పటి ఛాయాచిత్రము.

★



ది 15–2–57 న భీమవరం తాలూకా ఆయుర్వేద మండలి ప్రారంభోత్సవము జరిగినప్పటిఛాయాచిత్రం, శ్రీ బాలరాజ మహర్షి, కవిరాజ స్వామిప్రజ్ఞానానందజీ, శ్రీ మోహన్, శ్రీ నరశింహరాజు మొదలైన వారు ఆశీనులైయున్నారు.



18-10-56 న జరిగిన
కృష్ణాజిల్లా ఆయుర్వేద మహాసభకు అధ్యక్షతవహించిన
శ్రీ మోహన్ ఉపన్యసించుట.



ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి
ప్రారంభోత్సవ సందర్భములో ఆయుర్వేదాచార్య
శ్రీ శిష్ట్లా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఉపన్యసించుట.

( 50 వ పేజీ తరువాయి )

అది పాతచరిత్ర. ఆంధ్రలో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలు గుర్తించియైన కృషిచేసి తమతమప్రాంతీయ పరిస్థితులు క్రమస్థితిలోకి తేవడానికి ప్రయత్నించుట గౌరవము. సమాజ వికాసమునకు "ఆంధ్రప్రదేశ్" అంటూ నామకరణం చేసికొన్నందుకు సార్థక మవుతుంది. అదియుగాక ఆంధ్ర ప్రాంతమును చూపుతూ మేము నాయకులమై పోయామని తృప్తిపడితే లాభములేదు. ఆంధ్రలో కార్యకర్తల నీతి, నిజాయితి అలవర్చుకోవాలి. ఆంధ్రలో కార్యదక్షత అఖిల భారతంగా విఖ్యాతమైంది. అఖిలభారత ఆయుర్వేద కాంగ్రెస్ వారు భారతదేశములోని వివిధరాష్ట్ర సంఘాలవారు, భారత ఆయుర్వేద ప్రముఖ నాయకులు మన కృషిని అభినందించు చుండుట ఆంధ్రలో కార్యక్రమాన్ని చూచి మీ మీ రాష్ట్రములు సరిదిద్దుకోవలసిందని వివిధ రాష్ట్రములకు సలహాల నిచ్చుచుండుట జరుగుచున్నది. ఒక్కమాటలో చెప్పవలసివస్తే భారతదేశం మొత్తముమీద ఆంధ్రప్రదేశలోని మన మండలికి గల గౌరవ ప్రతిష్టలు, సభ్యత్వ సంఖ్యాబలము, సాటియే సంఘమునకు ఏ రాష్ట్రములోను లేదని చెప్పవచ్చును. ఇట్టి ప్రతిభ మన సంఘానికిన్నీ ఇటీవలనే లభించిందని, దీని ప్రతిష్టను మరింతా ఉన్నతపరచాలని ఎవరిశక్తికొద్ది వారు పనిచేయుచున్నారు ఇట్టి పట్టుదలను పరీక్షించుతున్నవారందరు హర్షించి పూర్వపు తగువులు, తంటాలు లేకుండా ఉత్తమస్థాయిలో మండలి నడచుట గమనించి చీలిపోయినవారంతా లీనమై పనిచేయుచున్నారు. "చీలిపోయిన వారు" అన్న మాటపై కొంత వివరణముచేయ ప్రయత్నించు చున్నాను.

మన మండలి యేనాడో స్థాపింపబడింది. 40 యేండ్లు వయస్సుకూడా వచ్చింది. ఇంత చరిత్రలోను ఐక్యత సంపాదించలేకపోయింది. తగిన సంఘీభావము లేక నిర్మాణయుక్తమైన కార్యక్రమము లేకపోయింది. యే సమావేశము చూచినా ఎలుకమీద పిల్లి, పిల్లిమీద ఎలుక అంటూ తగవులేగాని ఆదర్శప్రాయకమైన కార్యక్రమమే లేదు. పాలించినవారు పాల్గొంటున్నవారు మహామహా ప్రముఖులే అయివున్నారు. ఎందరు పాల్గొన్నా ఎవరు పాలించినా కార్యక్రమం నూన్యం. చరిత్ర కొక్క విషయమైన దొరకదు. జరిగిన కార్యక్రమము అయినా లభించదు. వార్షిక మహాసభలలో కలహాలేగాని ఒకరినుండి మరొకరు ఒప్పగించుకొను రికార్డు గానరాదు. అహంకారపుమాటలే వినిపిస్తాయి. ఒకరిపై ఒకరు దుమ్మెత్తి పోసికోవడం – "ఆ కార్యదర్శి ధనమపహరించాడు– యీ కార్యదర్శి రికార్డు దొంగిలించాడు–"

( తరువాయి 54వ పేజీలో )



ఆంధ్రఆయుర్వేద వైద్యమండలి విజయవాడలో ది 27-8-56 న ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు గారిఅధ్యక్షతను ఆరోగ్యశాఖా మాత్యులు శ్రీ కళా వెంకట రావుగారిని సన్మానించుట.





ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘాధ్యక్షులు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు సన్మాన సభలో ప్రసంగించుట.





ఆంధ్ర ఆయుర్వేద వైద్య మండలి ప్రధానకార్యదర్శి శ్రీ మోహన్ సన్మాన పత్రము సమర్పించుట.

( 52వ పేజీ తరువాయి )

అనుకొనేదే చరిత్ర. నేనీ ఐక్యమండలికి కార్యదర్శిగా వచ్చుసరికి వప్పగించుకొన్న రికార్డు ఎలాంటిది అంటే చాలా హాస్యాస్పదంగా వుంటుంది. వయస్సు 40 యేండ్లు వున్నది. ఈ గందరగోళంలో జరుగు సభలకు సమావేశాలకు వచ్చిపోవు వైద్యులు కార్యకర్తలు చాలా నలిగిపోయారు. యేవగించుకొన్నారు. సభ్యుడుగా వున్నామని చెప్పుకొనుటకు కూడా అసహ్యించుకొన్నారు. నేను కార్యదర్శిగా ఎన్నుకోబడిన 26 వ సమ్మేళన మహాసభనాడు సభ్యుల పాత జాబితా మచ్చుకైనా లేదు. సంఘాల ఐక్యసంఘటన ననుసరించి మహాసభకువచ్చినవారే సభ్యులుగా గుర్తించుట జరిగింది. ఇట్టి కార్యక్రమాల్లో, ఇట్టిఛిద్రస్థితిలో చీలిపోయినవారంతా నేడు మన కార్యక్రమమును హర్షించుతూ సమాజ పురోభివృద్ధికి కృషిచేయుచున్నారు.

## మన ఐక్యతచూచి సహించలేనివారు

మనలోని కట్టుబాటును కార్యక్రమాన్ని చూచి సహించలేక కొందరు వెనుకటి అనైక్యతాంత్రికబుద్ధి గలవారు మనలో మనకు చీలికలు కల్పించాలని ఎంతో ప్రయత్నము చేయుచున్నారు. ఎంత అబద్ధ మాడుటకైనా వెనుకంజ వేయుటలేదు. ఈవిధంగా వారు చేయు అనర్థపు కార్యక్రమాలవల్ల సంఘం చీలికలు అయిపోతే వారికి ఒక భాగములో నాయకత్వము లభిస్తుందనే దుస్సంకల్పమేగాని - ప్రతిభావంతంగా అభివృద్ధిపొందిన సంఘ గౌరవ మర్యాదలు సంరక్షించుదామనిగాని, కార్యకర్తలకు ప్రోత్సాహమిద్దామనిగాని తలంపు కాదు. వీరి ప్రయత్నము అనుకున్నంత సుళువుగా ఫలించనందున మన సంఘీయులలో, మన కార్యకర్తలలో చీలికలు పెట్టటాక పనిగా పెట్టుకొన్నారు. ఈ చీలికలు పెట్టు సంకల్పమునకు నేడు బోర్డుపదవుల పోలిక, కష్టించి పనిచేయు కార్యకర్తల ప్రతిష్ఠా, గౌరవ మర్యాదల పోలికలు తీసుకొని పనిచేయుచున్నారు.

## బోర్డు పదవులలో కల్పించిన చీలికలు

ఒక వర్గానికి చెందినవారిలో యే వొకరిద్దరికో ప్రభుత్వ బోర్డులో స్థానాలు లభిస్తే వారిద్వారా ఆవర్గం యొక్క ఆశయాలు నెరవేర్చుకోవడం ధర్మం. అట్టి ధర్మాల్ని పాలించుటలో నా మిత్రకోటిని ముమ్మందు పేర్కొని వేరొకరిని పేర్కొనవలయునని చెప్పవచ్చును. అట్టి కట్టుదిట్టములుగల సమాజంలో ప్రవేశపెట్టిన చీలికల సమాజంవారు «నీవు ముప్పది యేండ్లుగా సమాజంలో వున్నావు. నీకు లేని స్థానం మోహన్‌కు వచ్చిందే-» ఇలాంటి మాటలు మూటగట్టుకొని తిరుగుటయే వృత్తిగా పెట్టుకొన్నారు. ఈ యీర్ష్యాపరులకు, ప్రప్రథమముగా పనిచేయకుండా మండలి మర్యాద నశించిపోతూ వున్నా, మేము మండలికి ప్రధానులమనుకొనేవారి గొంతుకు వురిదగిలించి నట్టయింది వారి మూలంగా మరికొందరికి - ఈ సమయములో రెండు మాసములుగా ప్రారంభమైన ఈ యీర్ష్యాలనమునుండి విముక్తి పొందలేక నానా అగచాట్లు పడ్డాము మిత్రుల్లాగచేరి తిన్నయింటికి వాసాలెక్కించే సభ్యులుకూడా యిటీవల సంఘాభివృద్ధిలో కలసిన వారున్నారు. తగవులు తంటాలు నోటి దురుసుతనం వీరికి ఆస్తి. అలాంటివారి ప్రోత్సాహంకూడా ఈర్ష్యలో ద్యోతకమైతే సమాజం బాధలు వర్ణింపగలమా ? ఈ తగవులు తంటాలు సమయములోనే ది 12-9-57 న జరిగి కార్యనిర్వాహకవర్గ సమావేశములో - దేశానికి మహోపకారము - సమాజంలో వికాసం కల్గించుటకు మండలి ప్రతి సభ్యుడికి అందచేసిన ఆమోదపత్రంపై దాడివెడలించారు. దానికి అపార్థాలు అనవసరంగా కల్పించారు. అభ్యుదయ కరమైన మార్గం ఆ యీర్ష్యలో నలిగిపోవాలనే వాంఛ - ఆయుర్వేద మండలి సభ్యులను - ఆయుర్వేద వైద్యులుగా అంగీకరించరాదని వాదం «కంచెయే చేనుమేస్తే» అన్నసామెతగావుంది. మండలికిది ఎంత పరువునష్టమో కొందరికప్పుడు తోచలేదు. ఈ ఆందోళన తెచ్చినవారిలో యిలాంటి ఆమోద పత్రాలు, అంతకుమించినవి దేశంలో వైద్యులకిచ్చి ధనంసేకరించి జీవించే తెగకూడా వుంది. యే ఫలాపేక్షలేకుండా మండలి వుచితంగాయిస్తే వారికి నష్టంకల్గుతుందనే బాధకూడా యిందులో చేరింది.



చరిత్రభాస్కర కోట వెంకటాచలంపంతులుగారి అధ్యక్షతన కవిరాజ పత్రిక ద్వితీయ జన్మదినోత్సవము జరుపుకొన్న సందర్భములో సంపాదకులు, ముద్రాపకులు, తదితర వైద్యమిత్రులు.

ఏది ఎలాగయితేం ఆమోదపత్రాలు యివ్వకూడదని తీర్మానం చేశారు నలుగురి అభిప్రాయంతో యింతటి ఘనకార్యం నశించిపోతుందని కొందరి అభిప్రాయం. చరిత్రలో ఈమండలికి లేని సంఖ్యాబలం నేడుగలదని-వారంతా ప్రతిభావంతులేనని ఆమహాజనులు ఈసడించి ఛీ అంటారనే వివేకమైనా లేకుండా వ్యవహరించుటలో యేనాడు మండలి అంటే సరిపడని, ఈర్ష్యగల పత్రికలు తాటికాయంత అక్షరాలతో నన్ను విమర్శ చేయుటకు తలపడ్డాయి.

చూచారా! నేను కార్యరంగంలో అడుగిడిన తరువాత యే పరిస్థితులలో యేనాడులేని ఎదురీత దేశమంతా హర్షించే ఒక కార్యక్రమంమీద తెచ్చారు. నేను ఆమోద పత్రం (Confirmatary certificate) అందచేయుటలో భారత దేశంలోని వివిధ రాష్ట్ర సంఘాలు, నిపుణులు - ఇచ్చిన సలహాలపై యిచ్చాను. అది మండలి వికాసమునకేగాని - ఏ వొక్కరి స్వార్థము కాదు. యీ ఆమోద పత్రము అందచేయుటకు ఆ సభ్యులనుండి ఒక్క రూపాయికి తక్కువగాని విరాళం యివ్వమని కోరాను. యిచ్చినవారు యిచ్చారు. యివ్వనివారు యివ్వలేదు. తాలూకా, జిల్లా సంఘాల సరపతులు అభివృద్ధి పొందించుట అవసరము గనుక - ఆయా శాఖలకు పంపి విరాళములు వసూలు చేయమన్నాము. రాత్రి పగలు అనకుండా యేకైక శక్తితో వృద్ధిపొందించుకొంటున్న కార్యక్రమాలకు ఒక్కరూపాయి విరాళము వసూలుచేయుట దోషంగా భావించారు. పనిచేయలేరు - చేయువారిని దుమ్మెత్తిపోస్తారు. అందులో ఈ చెదపురుగుల విలయ తాండవంలో సమాజాన్ని చిత్రవధ చేయుటకే తలపెట్టారు కార్యక్రమములో వ్రేలుపెట్టి చూపలేని వారైనందున - యే అభాండమైనా - ఎంత అవినీతికరమైన మాటలైనా అనడానికి, నిందలైనా వేయడానికి సిద్ధపడుతున్నారు. యీవిధంగా విసిగి వేసారునట్లు చేస్తే అసహ్యంచుకొని వైదొలిగిపోతానని వారి భావం. నేను యిట్టి బెదరింపులకు జడిసేవాడిని కాను. జీవితమంతా యేపని చేయకుండా సంఘాన్ని పట్టుక వ్రేలాడుట నా ఆశయం కాదు. రెండు దశాబ్దాలుగా నలిగిపోతున్న రిజిస్ట్రేషను సమస్య అష్టకష్టాలుపడి ఒక మార్గానికి తెచ్చాము. ఎందరు అడ్డుతగిలినా అది విజయవంతంగా నెరవేరుతుంది. ఇంతలో శ్రీ డాక్టరు

(తరువాయి 56 వ పేజీలో)



కవిరాజ పత్రిక తృతీయ జన్మదినోత్సవ సందర్భములో వేదికపై సభాధ్యక్షులు శ్రీ దండమూడి రాజగోపాలరావు, ప్రారంభకులు శ్రీమతి రంగమ్మ రెడ్డి, ముద్రాపకులు శ్రీ గోపాలరావు, సంపాదకులు శ్రీ మోహన్ గార్లు.



సర్దార్ శ్రీ మరుపిళ్ల చిట్టి M. L. A. గారి అధ్యక్షతను కవిరాజ పత్రిక చతుర్థ జన్మదినోత్సవము జరుపుకొన్న సందర్భములో

( 55వ పేజీ తరువాయి )

ఆచంట లక్ష్మీపతిగారు దేశంలో వైద్యుల పరిస్థితులు ఎరిగినవారు. వారే నేటి బోర్డు అధ్యక్షులు. వారి నాయకత్వములో క్లిష్టసమస్యలెన్నివుండినా సమసిపోగలవు వున్న వైద్యులను వున్నట్లు గుర్తించి గాబోవువారికై ఎన్ని పరిమితులైనా పెట్టవచ్చుననే వాదం దేశంలో పెద్దలంతా అంగీకరించారు. ఈవిధంగా వ్రాస్తూవెళితే మహాభారతమంత గ్రంథం పెరుగుతుంది. అది ముద్రించి మీముందు పెట్టలేనుగదా? ఇప్పటికే నేను ఋణాలతో క్రుంగిపోతున్నాను. కవిరాజ వైద్యమండలి నిర్వహణలో దాదాపు 15, వందలు ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి, మహామండలి పేర్లతో దాదాపు రెండువేలు, కవిరాజపత్రిక పేరుతో మూడేండ్లలో 37వందలు రూపాయలు-వృత్తిపోయింది. సంపాదన లేదు సమాజంలో పనులు యింకా మిగిలియే యున్నవి. ఎందరు ఎన్ని చందాలు చెల్లించినా విరాళములు యిచ్చినా బహు స్వల్పమే. దాని వల్ల పనులు పూర్తికావు. జరిగినదానిలో వచ్చిన చిక్కులు- జరుగనున్న కార్యంలో కష్టాలు - సమాలోచించే సంఘం కన్పడదు. స్నేహితులు కన్పించరు. చెబితే మానంగా విని వూరుకొంటారు. నేనంటే ఈర్ష్యగలవారు, సహకారం చేయు వారినుండికూడా రానీయకుండా ప్రచారము చేస్తున్నారు పైగా సంఘ ధనమంతా నాకే వర్తించుతున్నదని ప్రచారం - ఇట్టి అవినీతి పరులతో నలిగిపోతూ యేమి సంఘసేవ చేయగలము? అర్థంకాదు. నేడు యువకులు నీతి నిజాయతీ గలవారు సమాజంలో వున్నారుగనుక వారందరు నడుముకట్టి బాధ్యతగల స్థానాల్లో ప్రవేశించి మండలి పురోభివృద్ధికై కృషిచేయ గలరని ఆశించుతున్నాను. అలా సహకరించి ముందుకు రాకపోతె అకారణ కలహాలతో నలభైయేండ్లుగా నలిగిపోతున్నట్లే మండలి నలిగిపోతే నేటి లోకం నవ్వి పోతుంది. నేటి సంఘం నవీన యుగమును దృష్టియందుంచుకొని పాత అలవాట్లు, పద్ధతులు మార్చుకొని పనిచేయక పోతే లాభంలేదు. ఒకరు యిద్దరు కార్యకర్తలు ముందుకు వస్తే లాభంలేదు. ఆర్థికంగా బాధపడతారు. నాలాగ బైరాగులైపోతారు. పనిచేయు చున్నంతసేపే - లోకం - ఓహో - అంటుంది. కాళ్ళిరిగి మూలపడితే - ఈరాపరు అతోపాటు లోకంకూడా నవ్వుతుంది. గనుక నా ప్రత్యేక సమీక్ష ఎందుకు సమర్పించానంటే - నా గొప్పతనం కొరకు కాదు. చేసినపని స్పష్టంగా వుండాలని. ఈ ప్రత్యేక సంచిక ఎందుకు ప్రచురించానంటే నా కార్యక్రమం చరిత్ర

( తరువాయి 57వ పేజీలో )

( 56వ పేజీ తరువాయి)

ప్రసిద్ధం చేద్దామనే!! చరిత్ర కందిన కార్యరంగములో పొందిన ప్రయోజనము వివరించడానికే - యిప్పటికే దీర్ఘమైనసమీక్ష వ్రాశాను. ఇంకా ముఖ్యవిషయాలు చాలా వ్రాయవలసినవి వుండిపోయినవి. గ్రంథ విస్తర భీతిచే వ్రాయుటకు హితవుగాలేకపోయినా మిగిలిన విషయాలుకూడా క్లుప్తంగా వివరిస్తున్నాను. నేను మండలి కార్యదర్శినైన పిమ్మట మండలిలో ఆచరణలోలేని దరఖాస్తుఫారం ప్రవేశపెట్టాను. ప్రతివైద్య సభ్యుడినుండి దరఖాస్తుఫారము తీసుకొనవలయునని, దానిపై ఆమోద పత్రము అంగీకరింప వలయుననియు మండలి నియమావళిలోనే వున్నది. దానిననుసరించి, స్వర్గీయ శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి అభిప్రాయాను సారముగా దరఖాస్తుఫారం రూపొందించి ఆచరణలో పెట్టాను. ఆ దరకాస్తుఫారములోని విషయాలు యీ క్రింద పొందుపరుస్తున్నాను. గమనింప మనవి:-

# ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి,

రాష్ట్రకమిటీ కార్యాలయం

ఆఫీసు : గాంధీనగరం : : విజయవాడ-2.

—:o:—

రిజిష్టరు నెం.

శ్రీ రాష్ట్రకమిటీ ప్రధాన కార్యదర్శి గారికి—

ఆర్యా !

ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలిలో సభ్యుడుగా చేరి మండలి నియమావళిని, ఆదేశములను అనుసరించగలవాడను. ఈ దరఖాస్తులో వివరించిన నా పూర్తి వివరములను పరిశీలించి నన్ను మండలిలో సభ్యునిగా చేర్చుకొనగోరుచున్నాను. సభ్యత్వం ఒక రూపాయి పంపితిని.

పూర్తి పేరు

అడ్రసు

వయస్సు తండ్రి లేక భర్త పేరు

గ్రామం పోస్టు తాలూకా

పంచాయతీ జిల్లా

కులము

ఎంతకాలముగా మీరు వైద్యవృత్తిలో అనుభవము కల్గివున్నారు?

భారతదేశంలో యేరాష్ట్రములోనైనా రిజిస్ట్రేషను పొందివున్నారా ?

మీరు వైద్యశిక్షణ పొందిన వివరములు

మీ గ్రామప్రజల కేవైద్యమునందభిరుచి ?

తేది పూర్తి సంతకము.

గమనిక :- విలేజివైద్యా, లేక అఖిలభారత ఆయుర్వేద విద్యాపీఠ పరీక్షలుగాని, ఆయుర్వేదకళాశాలల్లోగాని చదివియుండిన, మీకేమైనా ప్రత్యేకతలు వుంటే యీ క్రింద వ్రాయండి.

( దరఖాస్తుఫారం 57వ పేజీ తరువాయి )

## సర్టిఫికెటు

ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి రాష్ట్రకమిటీ కార్యదర్శిగారికి

ఈ దరఖాస్తుదారులైన వైద్యశ్రీ గారు
మా గ్రామములో ఆయుర్వేద వైద్యులుగా సంవత్సరములుగా పనిచేయుచున్నారు. వీరిని నేను బాగా ఎరుగుదును.

గ్రామం సంతకం
తేది హోదా

N. B :- సభ్యత్వరుసుము పంపకుండా దరఖాస్తు పంపరాదు. దరఖాస్తుఫారంపై గ్రామాధికారుల అనగా కరణం, మున సబులుగాని, పంచాయతీ అధ్యక్షులుగాని, ఇంకా పై అధికారులచేతగాని సంతకము విధిగా చేయించవలెను.

ప్రధాన కార్యదర్శి.



సభ్యత్వము చెల్లించి, దరఖాస్తుఫారము పూర్తిచేసి పంపిన తరువాత మండలి ఆసభ్యుని ఆమోదించినట్లు గుర్తుగా యీ క్రిందివిధముగా ఆమోదపత్రము (Confirmatory Certificate) అందజేతాను.

JAI DHANVANTARI.  JAI AYURVEDA.

# Andhrapradesh Ayurveda Maha Mandali

( Registered under Companies Act XXI of 1860 )

*Office* : Gandhinagar :: VIJAYAWADA-2.

## CONFIRMATORY CERTIFICATE

As

"Ayurvedic Medical Practitioner"

(A. M. P.)



Registered No
Name
Father/Guardian's Name

( ప్రక్కపుటలో )

( ఆమోదపత్రం తరువాయి )

Address : Village                Post
Taluk                District
Age
Number of Practising years.

Assignment of
Village officer / Munciff / Panchayat Board President.

Village
Dated

It is hereby certified by the Andhra Pradesh Ayurveda Maha Mandali that He/She is recognised to be an Ayurvedic Medical Practitioner (A. M. P.) by the above information received from His/Her village.........................................

Date

Signature.

**(Uriti Suryanarayana Mohan)**
*General Secretary*
Andhrapradesh Ayurveda Maha Mandali

Office Stamp.

NOTE : Members are requested to enroll their names by paying their yearly subscriptions.

( తరువాయి 60వ పేజీలో )



ది 1-9-56న ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలి, విజయవాడలో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారి అధ్యక్షతను నాటి మధ్యపాన నిషేధ శాఖామాత్యులు శ్రీ ఎ. బి. నాగేశ్వరరావుగారిని సన్మానించుట.



మండలి ప్రధానకార్యదర్శి శ్రీ మోహన్ మంత్రిగారికి సన్మానపత్రం సమర్పించుట.



# ఆమోదపత్రములు (Confirmatory Certificate) మండలి సభ్యులకందజేసిన పద్ధతిని ప్రశంసించిన ప్రముఖుల అభిప్రాయములు

భిషగ్రత్న

**డా|| ఆచంట లక్ష్మీపతి** B. A. M. B. & C. M.

ప్రెశిడెంటు ఆంధ్ర ఆయుర్వేద బోర్డు

క్యాంపు: త్రివేంద్రం.

"మండలి దరఖాస్తు, ఆమోద పత్రము చూచాను. ఈ పద్ధతి బాగానే యున్నది"

* *

భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖ ఆయుర్వేద సలహా దారులు, పండిత వైద్యరత్న, కవిరాజ

## ప్రతాపసింహజీ అభిప్రాయము

This is a good method but if it is not properly scrutinized, there is a chance of entering un-authorised persons in the Mandali, which is undesirable in the present stage of Ayurvedic Samelan.

* *

అఖిలభారత ఆయుర్వేద ప్రముఖ నాయకులు ఆయుర్వేదాచార్య, పండిట్

## శివశర్మగారి అభిప్రాయం

I have gone through the Certificate of Confirmation and the application and I think they are quite adequate. You should go ahead with that scheme.

* *

ఆలిండియా ఆయుర్వేద కాంగ్రెస్ కార్యదర్శి

## అభిప్రాయం

We have received the specimen of the membership forms of your Mandali and the Confirmatory Certificate issued by you to the members. We think they are in order.

* *

అఖిలభారత ఆయుర్వేదకాంగ్రెస్ మాజీఅధ్యక్షులు

## వైద్యరాజ శ్రీ పార్ధనారాయణపండిట్‌జీ

"మీ దరఖాస్తు, ఆమోద పత్రము ఇతర రాష్ట్ర సంఘములు అనుసరింపదగిన ఆదర్శమైన పద్ధతి"యని చెప్పదగును.

* *

ఈవిధంగా ఆంధ్రప్రదేశలోని జిల్లా, తాలూకా, మండలి తీర్మానములు, సభ్యుల ప్రత్యేక అభిప్రాయములు అసంఖ్యాకంగా వచ్చినవి. అనగా వేలాది వైద్యుల, సంఘాల ఆమోదనీయమైనపద్ధతి ప్రధానకార్యదర్శి అందజేసిన ఆమోద పత్రములు చెల్లవని, ఆమోదపత్రములు యివ్వనక్కరలేదని ప్రచారము జేసిన కార్యవర్గసభ్యుల, ఇతర పత్రికల చర్యను గర్హిస్తూ ఖండించిన మండలిలోని ప్రముఖకార్యకర్తల కార్యవర్గ సభ్యుల అభిప్రాయములు స్థలవిస్తరణభీతిచే వారిపేర్లు మాత్రమే సూచించుచున్నాము.

కవిరాజ యం. ఎ. సుభాన్ (మండలి కార్యవర్గ సభ్యులు) వైద్యవిశారద పి. టి. వెంకటాచార్యులు (మండలి కార్యవర్గ సభ్యులు), వైద్యభూషణ అవనిగడ్డ నాగభూషణం (మండలి కార్యవర్గ సభ్యులు, కృష్ణాజిల్లా ఆయుర్వేదమండలి ప్రధాన కార్యదర్శి), కవిరాజ, వైద్యవిద్వాన్ వి. కామరాజు (మండలి కార్యవర్గసభ్యులు, విశాఖజిల్లా ఆయుర్వేద మండలి ఉపాధ్యక్షులు), వైద్యభూషణ శిరిపురపు శేతుమాధవరావు గారు (మండలి కార్యవర్గ సభ్యులు, గుంటూరు తాలూకా ఆయుర్వేద మండలి అధ్యక్షులు), కవిరాజ ఎ. ఆదిశేషప్ప (మండలి స్టాండింగు కమిటి సభ్యులు, కడపజిల్లా ఆయుర్వేదమండలి ప్రధానకార్యదర్శి), వైద్యరాజ పంతులఉమామహేశ్వరరావు గారు (మండలి స్టాండింగుకమిటీ సభ్యులు, విశాఖజిల్లామండలి అధ్యక్షులు). కవిరాజ నాగం అప్పారావు (మండలి స్టాండింగు కమిటి సభ్యులు, విశాఖజిల్లా ఆయుర్వేద మండలి ప్రధాన కార్యదర్శి). ఇద్దరు ముగ్గురి దురభిప్రాయాలతో, ఈపద్ధతి ప్రచారమైంది. మండలిచేయు కార్యక్రమాలలో మెజారిటి మైనారిటీల ప్రసక్తి తీసుకొనకుండా అందరి అభిప్రాయములు విని సమాధానపరచుట ఆచారమైయున్నది. ఏ వ్యతిరేక అభిప్రాయములనైన రికార్డు చేయవచ్చును. గాని ప్రచారము చేయు ఆచారములేదు. అనే పద్ధతిని జరిగిన తీర్మానాలు ఈ వ్యతిరేకులు ప్రచారం చేశారు. మండలిలోజరిగిన తీర్మానాలు జరిగిన కార్యక్రమం పత్రికలకు అందించుటలోగాని, ప్రచారము చేయుటగాని ప్రధాన కార్యదర్శిదే అధికారము. ఈ వార్తలు పంపింది, ఇతర పత్రికలలో ప్రకటించుటకు ప్రాకులాడింది, ఈ ఇద్దరి ముగ్గురు ప్రయత్నములే! ప్రధాన కార్యదర్శి ప్రచురించలేదు.

(ఇంకావుంది)

## ప్రధాన కార్యదర్శి సమీక్ష

60 వ పేజీ తరువాయి

ఈ స్థితిలో రాష్ట్రమండలి వార్షిక సభలు జరుపు టొక కార్యక్రమం మిగిలి పోయింది. మండలి పుట్టి 40 ఏండ్లు దాటినను కొన్ని వార్షిక సభలు జరుగ నందున జరుప వున్నది 27 వ వార్షిక మహాసమ్మేళన మనిపించు కొంటుంది.

## ఆంధ్ర వార్షిక మహాసభలు

ఆంధ్రమండలి ఆంధ్ర ప్రదేశమండలి అయింది గనుక ప్రథమ వార్షిక మహాసభయనే పేరుతోనే జరుపవలెనని కొద్ది మంది అభిప్రాయము గాని యే నిర్ణయము కాలేదు ఈ నిర్ణయ సమస్య యిట్లుండుగా 1957 మార్చి 24 వ తేదీని హైదరాబాదులో జరిగిన కార్యవర్గ సమావేశములో రాష్ట్ర మహాసభలు 1957 జూన్ నెలలో విజయవాడలో జరుపుటకు తీర్మానించారు. తీర్మానానుసారం జూన్ నెల శ్రీ కృష్ణా పుష్కర సమయము కూడా కలసి వచ్చి నందున ఎంతో బ్రహ్మాండముగా జరుప వచ్చునని విశ్వసించాము. గాని జూన్ నెల ప్రపంచ మంతటా అవరించిన శీతజ్వరముల మహామ్మారి దేశానికి దాపురించింది ఈ విషయము అందరు ఎఱిగియున్నదే. శీతజ్వరములు జాడ్యం ఆగష్టు ఆఖరువరకు పూర్తిగా వదల నందువల్ల సభలు జరుగలేదు. 1957 సెప్టెంబరు 12 వ తేదీని విజయవాడలో నొక కార్యవర్గ సభ జరిగింది ఆ సభలో వార్షిక సభలు జరుపు అవకాశం హైదరాబాదుకు లభింప చేయ వలసిందని హైదరాబాదు కార్యవర్గ సభ్యులు కోరారు. విజయవాడలో జరుపుటకు ఆహ్వానించి దేశమంతటా ప్రచారము జరిపి అనేకమంది ప్రముఖ నాయకులను ఆహ్వానించి కార్యక్రమములో నున్న కృష్ణాజిల్లా ఆయుర్వేద మండలి కార్యదర్శి శ్రీ అవనిగడ్డ నాగభూషణం గారు తమ ఆహ్వానము ద్వారా జరిగిన కార్యక్రమము - పరిస్థితులు వివరించారు గాని చెవిటివానివద్దశంఖమూదినట్లుపరిణమించింది. నాటికార్యవర్గం డిశంబరులోగా జరుప వలసిందని హైదరాబాదు వారికి అవకాశం యిచ్చారు. దానిపై దేశంలో అనేకమంది కార్యకర్తలు జిల్లా, తాలూకా సంఘములు అసంతృప్తిని వెల్లడించినవి. తీర్మానములు చేసినవి. ఈ ఆందోళన కార్యక్రమ మంతయు ది 24-11-57 వ తేదీని కార్యవర్గ, స్థాయిసమితి సభలో ప్రవేశ పెట్టాను. నాటి కార్యవర్గము మరింతా ఉద్రిక్త పరిస్థితులలో నడచింది. ఆదినుంచి మండలిలో ఉన్న వాదమును కానే కొందరు సభ్యులు దూష్యంగా మాట్లాడుకొని - ప్రధాన కార్యకర్తలపై అభాండములు వేసి - చరిత్రలో పేర్కొన దగని పద్ధతులలో నాటిసభ ముగిసింది. ఆ సభలో వార్షిక సభలు హైదరాబాదులో జరుపుటకు తీర్మానించారు. సభలు డిశంబరులోగాజరుగునని తెలియజేశారు. వారుఆడిశంబరులోగా సభలు జరుపలేక పోయారు.

## జిల్లా, తాలూకా, అధ్యక్ష, కార్యదర్శుల ప్రధాన కార్యకర్తల సభ.

ఈ అనైక్యస్థితి వర్తించిన దేశములోని జిల్లాలోని తాలూకా మండలముల అధ్యక్ష కార్యదర్శులతో ప్రధాన కార్యకర్తలతో విజయవాడలో ది 1-2-58 తేదీని ఒక సభకు విజయనగర వాస్తవ్యులు శ్రీ పంతుల ఉమామహేశ్వరరావు గారు అధ్యక్షత వహించారు. సభలో రాష్ట్రమండలి, కార్యవర్గ స్థాయి సమితి సభ్యుల అనైక్యతకు విచారమును వెల్లడించుతూ సమైక్యముగా విజయవాడలో రాష్ట్రసభలు జరుపవలసిందని, సభ్యులు గల ఆంధ్ర ప్రాంతములో సభలు జరుపక సభ్యులు లేని ప్రాంతములో జరుపుట కూడదని తీర్మానించారు. ఇచ్చిన అవకాశమును సద్వినియోగ పరచుకొనని హైదరాబాదు వారికి ఇంకా సభలు జరుపు అవకాశం వారికిచ్చుట కూడదనియు హెచ్చరిక చేశారు. యీ తీర్మానములు ది 2-2-58 వ తేదీని జరిగిన మండలి కార్యవర్గ స్థాయి సమితులలో చర్చకు వచ్చింది తీర్మానములు సానుభూతితో పరిశీలించి హైదరాబాదు వారి ప్రత్యేక అభ్యర్థన చేత మరొక అవకాశము కూడా యిచ్చారు. అందులో 1958 మార్చి 15 లోగా జరుప వలసిందని పేర్కొన్నారు. జరుపనున్న కార్యక్రమము కార్యవర్గముతో సమాలోచించి చేయుమని సూచనచేశారు మరియు సభ్యులు లేని ప్రాంతమగుట చేత వార్షికసభలలో ఎన్నికల కార్యక్రమములు లేకుండా జరుపుకొనుటకు అంగీకరించి తీర్మానించారు. ఆ యవకాశమున్నా మార్చి 15 లోగా జరుపలేక పోయారు. ఇట్టి కాలయాపనల వల్ల కార్యక్రమము అంతయు స్తంభించుక పోవుచున్నది. 1957, 58 సంవత్సరముల సభ్యత్వము వసూలుచేయు అవకాశము లేకుండా రద్దయిపోతున్నా మండలి ఆర్థిక సౌష్ఠవము సన్నగిల్లి పోతున్నా కార్యక్రమము పెడదారి బట్టుచున్నా కార్యవర్గ సభ్యులు మౌనముద్ర వహించారు. ఈ అవకాశము వల్ల మండలి నష్టపడుచున్నది. అదిగాక సభ్యులలో అభిప్రాయ సేకరణకు ప్రయత్నించినా ఫలించలేదు. దీనివల్ల 1958, 59 సంవత్సరముల సభ్యత్వమున్నా వసూలుచేయు అవకాశం లేదు. ఇట్టి స్తబ్ధత వల్ల రాష్ట్రమండలి సంవత్సరిక చందాలు నిలచిపోయి రాదాపు పదివేల రూపాయిలు నష్టము పొందినది. దీనిని దృష్టికి తెచ్చుకొన్న. కార్యవర్గం కన్పించదు

అసమానమైన కీర్తి ప్రతిష్టలు కల్గి రాష్ట్ర, రాష్ట్రేతర మూలయందు కూడా పలుకుబడి సార్జించిన రాష్ట్రమండలి కార్యవర్గ మిట్టిస్థితులలో నున్నదంటే ఎంతఅవమానమో తెలిసికొనుటలేదు. వేలాది సభ్యులు గల సంస్థ వ్రేళ్లపై లెక్క పెట్టు కొద్దిమంది వల్ల ప్రసిద్ధి గోల్పోవు స్థితి యేర్పడినది నేడు ఆయుర్వేదం ఎట్లు వర్ధిల్లగలదో, క్రమశిక్షణతో గూడిన

# ఔషధపాక పరిజ్ఞానము

( 20వ పేజీ తరువాయి )

మందును పొయ్యిమీద పెట్టిన కొన్నిగంటలకు ఉడుకుట ప్రారంభమై పలచ నగును పిదప క్రమముగ నుడుకుచు ముద్దగ నగుచుండును. ఇందు కడ్డీని వేయుచుండినచో వానియొక్క పరిణామములన్నియు తెలియుచుండును. కడ్డీలుగ గుండ్రముగ నుండు గొడుగుఊచలు మొదలగువాని నుపయోగింపవలయును. ఇవి చిగురున సమానముగను అడుగునకొన మొదలగునవి లేకుండ నుండవలయును. దీనినికుప్పె రంధ్రముగుండా కుప్పెయందు వేసి యొక నిముషములోపుగనే తీసినచో మందుయొక్క పరిణామములు చాలవరకు తెలియును ముద్దగనుంటి తగ్గుచున్నది మొదలు పాకోన్ముఖమైనదానినిగ తెలియవలయును క్రమముగ ముద్దపట్టుకొనుట తగ్గి కొద్దిగ పలచగ పట్టుకొనును క్రమముగ నింకను పలచగ (సన్నముగ) చమర్చినట్లు పట్టుకొనును తుదకు కడ్డీ చిగురున ఆ పలచగకూడ పట్టుటమాని చిగురునుంచి క్రమముగ పట్టుట తగ్గుచుండును. అప్పుడింకను పాకోన్ముఖమైనదని గ్రహింపవచ్చును. తుదకు కడ్డీవేయునప్పుడు కుప్పెముఖము వద్దనే కొద్దిగ చెమర్చినట్లుగ పట్టును కొంతసేపటికి యెచ్చటను కూడ యేమియు చమర్చినట్లుకూడ పట్టక కడ్డీవేసినవిధముగనే పొడిగనుండును. అప్పుడు గంధకమువలెంచి పాకమువచ్చినట్లుగ గ్రహించి మంటనుతీసి నిప్పులను అటులనేయుంచినచో సరిగ పక్వమై యుండును కాని కడ్డీకి చెమర్పుటకూడ మానగనే 1-2 గంటలలో పూర్తిగ పాకమునకు వచ్చునని గ్రహించి కొద్దిగమంటవేయుచు కడ్డీనివేసి చూచుచుండినచో కుప్పెలో వేసిన భాగము బూడిదపూసినట్లు తెల్లగనగును క్రమముగ నింకను తెలుపగుచు మసిపూసినటగను క్రమముగ తెల్లగ స్వచ్ఛముగు వెండిపూసినట్లుగాని వెండితోనే చేయబడినట్లుగాని యుండును కడ్డీనివేయుటకు పూర్వము కడ్డీఅంతయు నల్లగనుండి కుప్పెలోవేసి వెంటనే తీయునప్పటికీ సగము వెండితోను సగముఇనుముతోను చేయబడినట్లుండి చూపరులకు అధికమగు నాశ్చర్యమును కలిగించుచుండును. ఇప్పుడు గంధకమంతయు పూర్తిగ నశించినదనియు పాదరసముకూడా పైకి వచ్చుటకు ప్రారంభించినదనియు తెలిసికొని వెంటనే పొయ్యిలోనున్న నిప్పులనుకూడ ఆర్పివేయవలయును చెమర్పుటమానగనే కడ్డీని వాసనచూచినచో గంధకపువాసనను కలిగియుండును క్రమముగ నావాసనకూడ తగ్గి రసము కొద్దిగ తెల్లగపట్టుట ప్రారంభించును రసము పట్టుచున్నకొలదియు కడ్డీ తెల్లనగుచుండును అప్పుడు చేతివ్రేళ్లకు కొద్దిగ తడిని చేసి కడ్డీమీదొక్క రాచినచో పాదరసము తెల్లగ చిన్నచిన్న ఉండలుగ వ్రేళ్లరేఖలలో అంటియుండును. క్రమముగ పాదరసము బాగుగా అంటుటయేగాక కడ్డీని నీటిలోముంచిగాని ఊరకనేగాని చూచినచో కడ్డీకి తెల్ల చిన్నచిన్న ఉండలుగ పట్టియుండును. కడ్డీని నీటిలోముంచి అరచేతిలోనొక్క రాచినచో పాదరసము అరచేతిలోనికి దిగును. ఇది కడ్డీకి వెండి పూసినట్లుండునప్పుడు కలుగు లక్షణములు. ఇంకను పొయ్యిమీదనుంచినచో పాదరసముకడ్డీతో ముద్దలుముద్దలుగ వచ్చుచు మందు మాడిపోవును. కాన కడ్డి తెల్లగనై పాదరసము చేతివ్రేళ్లకుపట్టుట ప్రారంభమవగనే పాకము సరిగవచ్చినట్లుగ గ్రహించి నిప్పులనుకూడ ఆర్పవలయును. కడ్డీకి చెమర్చుట మానగనే మంటను తీసినచో నొక్కొక్కప్పుడు సా వేడి చాలక లోపల కొద్దిగ గంధకము మిగలవచ్చును. లేక పాకము మెచ్చురావచ్చును. కాన కొద్దిమంటను వేయుచు లక్షణముల నన్నిటిని చూచి సరియైన పాకములో దింపవచ్చునని నా అభిప్రాయముతో పిదపకూడ కొద్దిగ మంటవేసి సరియైనపాకము

---

# కార్యదర్శి సమీక్ష

( 61వ పేజీ తరువాయి )

కార్యక్రమమేమొ ? ప్రభుత్వం వీరినెట్లు గుర్తింపునో పరిశీలింప వలసియున్నది మండలి ప్రతిష్ఠకొరకు, సౌష్ఠవము కొరకు అహర్నిశలు కృషిచేసిన నా హృదయానికిది రంపపుకోత కోయుచుండినా – మరి ఒకరిద్దరు బాధపడుచున్నా – మిగిలిన వారు మండలి పతనమునే కాంక్షించుచున్నారా అన్నట్లు తయారయింది. వార్షిక సభలు జరుపుటకు నేటికి కార్యక్రమము కన్పించదు నేడు 1958 మే 1 వ తేదీయని గుర్తింప గోరుచున్నాను ఎట్లో వార్షిక సభ జరుపు వరకు నా కార్యదర్శిత్వము వుండక తప్పదు. నిరంతర అభిప్రాయ భేదములతో నలిగిపోవు సంస్థలలో కార్యదర్శుల బాధలు వ్రాయునలవి కాదు. గౌరవ సభ్యులందరికి నా ప్రత్యేక విజ్ఞప్తి యేమంటే వివాదములతో నిండియున్న సంస్థలో ప్రజాక్షేమానికి కృషి చేయుటము, జన్మతా వచ్చిన బుద్ధులకు పరివర్తన లేనప్పుడు ఎట్టి ప్రయోజనము లభించదు అందుచేత సర్వసభ్యులు శ్రద్ధవహించి భావిలోనైనా వివేకవంతుల్ని ప్రధాన స్థానములలో ప్రవేశ పెట్టకపోతే మండలి సభ్యత్వం నిష్ఫలమని – సభ్యత్వ నిష్ఫలముగాక–సరిదిద్దు వలసిందని నా విజ్ఞప్తి మరొక్క మాట కూడా మనవి చేస్తున్నాను. దేశం మొత్తమీద మన మండలికి దాదాపు ఆరువేల మంది సభ్యులున్నారు. ఇంత మంది సభ్యుల పురోభివృద్ధి ఆకాంక్ష వేళ్లమీద లెక్క పెట్టబడే పదిమందితో నలిగిపోవుటకూడదు. దీనికై మీ సర్వశక్తులు వినియోగించుకొని మండలిని సంరక్షించుకొనగలరని ఆశించుచున్నాను జై! ఆయుర్వేద!!

చూచి నిప్పులనుకూడ ఆర్పునని చెప్పబడినది. పై పాక లక్షణములనుబట్టి యెట్టివారుకూడ నిర్భయముగ మందులను వండవచ్చును. కడ్డీకి ముద్దగపట్టుటయు చమర్చుటయుకూడ మానువరకు ఏమియు భయములేదుగదా! పిదప కొద్దికాలములోగాని కడ్డీ కొద్దిగ తెల్లనగుట ప్రారంభమవగనేగాని నిప్పులను చల్లార్చినయెడల మందు సరిగ పక్వమునొందియుండును. కడ్డీకి యేమియుపట్టక చెమర్చకుండ పొడిగనుండుటయు తెల్లగనగుటయు ప్రత్యక్షములగు విషయములేకదా? ఈ లక్షణములను దూరమునుండి చూచికూడ పాకమును గుర్తింపవచ్చును. కాని యెంత వ్రాసినను దగ్గరనుండి స్వయముగ చెప్పుచున్నను అన్నమును క్రొత్తగ వండుమనిషి అన్నమును తర్చు కలియత్రిప్పుచు మెతుకులను అనేకసారులుచూచుచు చేతులు వగయిరాలను కాల్చుకొనుట మొదలగు నవస్థలను పడుచు తుదకన్నమును చెడకొట్టునట్లు ఔషధమునుకూడ ప్రారంభమునకొందరు చెడకొట్టవచ్చును. కాని క్రమముగ నన్నిసంగతులు తెలియగలవు. పైపాకలక్షణములన్నియు షడ్గుణము, పూర్ణచంద్రోదయము, రజితచంద్రోదయము, మకరధ్వజము, సిద్ధమకరధ్వజము మొదలగు సిందూరప్రధానములగు మందులకే కలుగును. కాంతవల్లభరసము, రజితలోహరసాయనము, వంటవసంతకుసుమాకరము నవగ్రహి, మొదలగుమందుల యందు పాకలక్షణములు వేరుగనుండును. వానికి ముఖ్యలక్షణము లేవియనగా గంధకపువాసన కడ్డీకైనను లేకుండ గంధకము నశించుట, తాళకము, మణిశిల, వెలిగారము, మొదలగునవి కడ్డీకంటుకొనుచు తెలియుచు లేవిపోవుట మొదలగునవి. కాంతవల్లభరసము, రజితలోహరసాయనము మొదలగు లోహప్రధానములయినట్టియు కొంతకాలమధికముగ నుంచినను నష్టములేనట్టియు, మందులను కొంతకాలమధికముగనే యుంచవలయును.

## పూర్ణచంద్రోదయము.

ఇందు స్వర్ణదళమని స్పష్టముగ చెప్పుటచే పలచగ రేకులుగగాని చుట్టలుగగానియుండు కుందనమునే వేసికొనవలయు. కేవలకుందనమును వేసికొనినయెడల అడుగున మిగిలియున్న దీనిని మరలకరగించినయెడల ముద్దగ బంగారమగును. గావున సరిగ నిది జీర్ణమయిన సరియైనగుణములను కలిగించదు. కావున సువర్ణభస్మమునే వేసికొనవలయుననికొందరు చెప్పెదరు కుందనమును వేసికొనునెడల మొదటపాదరసములో 4-5 రోజులు బాగుగనూరి పిదప గంధకమును వేసి నూరవలయును. "మేము చేసినయెడల బంగారము పైకియెక్కి సిందూరములో కలియును" అనికొందరు చెప్పెదరు. కాని నమ్మతగినవిషయముగ కనపడదు. పాదరసమందు బంగారమును ఆరుమాసములుంచి నూరినచో బంగారము పైకియెక్కునని చెప్పెదరు అట్లుచేయగా కార్యసిద్ధికాలేదు. ఫలానిరసముతో మర్దించినచో పైకియెక్కును అని అనేకమంది అనేకరసములను చెప్పిరి. కాని మాకునమ్మకముగ చెప్పినకొంతమందియొక్క మాటలను విని చేమ్మతీగ ఉత్తరేణు, మొదలగువానియొక్క రసములతో వారు చెప్పవిధముననే నూరి వండితిమి. కాని యెంతమాత్రము పైకి యెక్కలేదు. రసమునకు అష్టాదశసంస్కారములు చేసినచో పైకియెక్కునని కొందరుచెప్పెదరు. అది యెంతవరకునిజమో తెలియదు. ఇట్లుమేము చేసితిమి పైకియెక్కినదని ఎవరును ధైర్యముగ చెప్పలేదు బంగారముకలసిన యితరమందౌషధములను ఇతరలోహములు కలసిన లోహరసాయనము మొదలగునవి యు కలవు. అందు ఆలోహము పైకెక్కునా? బంగారము పైకెక్కునా? మొదలగు యితరవిచక్షణలను మాని కేవలపూర్ణచంద్రోదయమువద్దనే బంగారము యెక్కువిషయమై ఆలోచ కలుగుటకు కారణము తెలియదు. అడుగునున్నబంగారము జీర్ణముకాదు. దానితో కలసియుడుకుటచే సిందూరమందు బంగారుగుణముకొంత సంక్రమించును. కావున అడుగుబంగారము తీసివేసి కేవలము పైసిందూరమునే వాడుకొనవలయును, అని కొందరు చెప్పెదరు. కాని అడుగున భస్మరూపకముగనున్న బంగారమును కూడ కలుపుకొనుటయే సాంప్రదాయము. కుందనమునుమాని భస్మము వేసినయెడల యెట్టిసందేహములేదు. అనుపానద్రవ్యములను కలుపువిషయమై అర్థము 2,3 విధములుగ స్ఫురించుచున్నది. అనేకమంది అనేకవిధముల కలుపుకొనుచున్నారు. కస్తూరియొక్కయు, పచ్చకర్పూరము యొక్కయు భాగముల ననుసరించి వేడిచేయుట మందముచేయుట మొదలగు లక్షణము లొక్కొకప్పుడు కలుగుచున్నవి. అర్థభేదములును వేరొనువిధానములును గుణములును, గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు. అనుభవమును వ్రాయుచున్నాను, "పై సింధూరము అడుగునున్న బంగారమును పూర్తిగ గ్రహించి జాజికాయ పిప్పళ్లు, మిరియాలు, లవంగములు వీనిని ప్రత్యేకముగ మొదట వేసిన బంగారమునకు సమానముగను, పచ్చకర్పూరమును స ముగను, కస్తూరిని పదునారవ వంతుగను గ్రహించి అనగా సిందూరమును బంగారమును కలిసిన అసలు మందు ఒక తులమైనయెడల జాజికాయలు మొదలగు మూడింటిని వేడఎత్తు చొప్పునను, పచ్చకర్పూరమును అణా ఎత్తుగను, కస్తూరిని అరకా చొప్పునను కలుపవలయును. మందము చేయున వెడిభావము పచ్చకర్పూరమును శాస్త్రవిహితమగు భాగములో సగము తగ్గించడమైనది. అనుపాన దినుసులను కలుపుకొనిన పిదప మునగ రసములతో మర్దింపక పన్నీరుతో మర్దించుసాంప్రదాయకలదు

పూర్ణచంద్రోదయమునకు, మకరధ్వజమునకును, మకరధ్వజము లేక షడ్గుణబలిజారిత మకరధ్వజమునకును, సిద్ధమకరధ్వజమునకును, రసము, గంధకము, బంగారము వీనియొక్కయు వంటలయొక్కయు భేదముల ననుసరించియే భేదముకాని వేరే భేదములేదు. కాని బంగారము మొదలగు వానియొక్క ఆధిక్యతనుబట్టి గుణాధిక్యత యుండును.

మకరధ్వజ మందుకూడ అనుపాన విషయమై అర్థభేదములును, సాంప్రదాయ భేదములును కలవు. పూర్ణచంద్రోదయ మందువలెనె చూచుకొనుడు

షడ్గుణ బలిజారిత మకరధ్వజము మొదలగు వానియందు అనుపాన విశేషములు చెప్పబడకపోయినను కలుపుకొనవచ్చును. మకరధ్వజమందు మిరియాలుఅని చెప్పబడి యున్నది. పూర్ణచంద్రోదయమందు పిప్పళ్లను వేయుచున్నారు. ఇందు "త్ర్యూషణ" త్రికటుః మూలుఅని పాఠభేదముకలదు. ఇటువంటి అనేక విషయములు విమర్శింప దగినవికలవు. కాని గ్రంథవిస్తర భీతిచే ఎంతమాత్రము విమర్శింపలేదు.

సిద్ధమకరధ్వజమునకు కొన్ని యోగములయందు పాళ్లభేదము కొద్దిగ కలదు. మరియు రెండురెట్లు గంధకమును చేర్చుకొనుచు మూడుసార్లు వండవలయునని కూడ కలదు.

## స్వర్ణవంగము (హేమసుందర రసము)

మొదట వంగమును కరగించి పొయ్యిమీదనుంచి దింపి వెంటనే యందు పాదరసమును పోసి వెంటనే వేరు పాత్రమందు పోయవలయును. కొద్దికాలమునకు బిళ్లవలెనగును. దీనిని ఖల్వమందుంచి నలియకొట్టినచో తొందరగనే ముక్కలుగ విరుగును. దీనిని మెత్తగ నూరినపిదప గంధకమును వేసి నూరి కలబందరసముతో మర్దించి తుదకు నవాసారమునువేసి మరల కలబంద రసముతోడనే మర్దింపవలయును. నవాసారమును వేసిన పిదప కలబంద రసమును బహుస్వల్పముగనే వేసికొనుచు మర్దించవలయును ఈకలబందరసము అధికమైనచో మందంతయు మిక్కిలిపలచనై చాలాదినములవరకు గట్టిపడదు. వంగమును పలచనిరేకులుగా చేయించి చిన్నచిన్నముక్కలుగ కత్తిరించి పాదరసమందు వేసి నూరినను పాదరసమందు కలిసిపోవును. పిదప గంధకమును చేర్చుకొనుట మొదలగువానిని చేసుకొనవచ్చును. పాకవిశేషపరిజ్ఞానము:- పదేసితులములచో॥ వేసికొని యొక్క కుప్పెయందు వండుకొనినచో సుమారు 15-30 గంటలు వండవలయును మంద ఉడుకునప్పుడు కడ్డీవేసిన యెడల మొదట కొద్దిగ నల్లగ పట్టుకొనును. క్రమముగ బంగారపువర్ణముగ పట్టుకొనును. అప్పుడు పూర్తిగ పక్వమైనట్లు తెలిసికొనవలయును. మరియు మొదట కడ్డీవేసినప్పుడు నవాసారము తెల్లగ జిగురుగ పట్టుకొనును. పాకమువచ్చునప్పటికి క్రమముగ పట్టుకొనుట తగ్గును. మరియు మందునందువేసిన కడ్డీకి గంధకమువాసనలేకుండ నుండవలయును. ఇదియుపాకలక్షణమే. దీనికి కుప్పెమూతియందు సిందూరముండదు మందుఅడుగుననే వుండును. బంగారపువర్ణమును కలిగివుండును. పదితులముల చొప్పున వేసినపుడు తయారైనమందు సుమారు 12-15 తులములుండును. మందుమిక్కిలి చులకనగ నుండును. దానికుప్పెలు కట్టుకొనరు మొదటమందును నూరి నిలవయుంచి వండినచో పాకము సరిగరాదు. ఈమందును యెట్టిసీసాలయందైనను (మట్టి పూసినగుడ్డలు చుట్టియే) వండెదరు. మరియు మట్టిమూకుళ్ళయందుంచి సంధిబంధనముచేసి యాసంపుటమును పొయ్యిమీద పెట్టి వండెదరు ఇట్లుచేయునప్పుడు పైమూకుడుమధ్యయందు సన్నని రంధ్రమును పొడిచి యారంధ్రమునుండి కడ్డీని వేసికొనుచు పాకమును చూచుచుండవలయును. కాచకుప్పెయందు వండినమందే చక్కనివర్ణమును కలిగివుండును. దేనియందువండినను మందుకు పైభాగము కొంతమిగిలి నల్లగనున్నయెడల దానిని తీసివేసి శుభ్రమైనదానినే గ్రహింపవలయును.

## సూర్యావర్తి

లఘుసూర్యావర్తి:- పమిడిపత్తిగింజలను కొద్దిగవేయించి బట్టయందుమూటగట్టి సామాన్యముగనలియగొట్టి తీసి యాగింజలను విదిల్చినయెడల నందలిపప్పుక్రిందపడును. గింజలలో నింకను పప్పు మిగిలియున్నట్లు తోచినయెడల మరలబట్టలోకట్టి మరల నలియకొట్టి విదల్పవలయును. గింజలను హెచ్చుగ (ఎఱ్ఱగాని దోరగగాని) వేయించిన యెడల పప్పునల్లగ మండిపోవునుకాన గింజలను బాగుగ వేడితగల (కలుగ) గనే వేగినట్లుగుర్తించవలయును. 4 తులముల గింజలకు 1 తులముపప్పు దిగును. కాకిదొండయనగా కొద్దిగ పొడుగుగనుండు కాయలుకలదానిని గాక గుండ్రముగనుండుకాయలు కలదానిని గ్రహింపవలయును. వీని విత్తులు బీరవిత్తులువలె నుండును. ఈవిత్తులపై పెంకునుతీసివేసి లోనిపప్పును తీసుకొనవలయును ఈవిత్తులను అడ్డముగ గోడుగనుంచి పైనమెల్లిగ కొట్టినచో పైపెంకు త్వరలో నేకముగ నూడిపోయి లోనిపప్పు త్వరలో బయటకి తీసికొనుటకు బాగుగ వీలుగనుండును. 1 తులము గింజలనుండి ½ తులము పప్పు వచ్చును. ముత్యభస్మ అని చెప్పబడియున్నను కొందరు ముత్యపుచిప్పలభస్మనే వేయుదురు. చమురుగల పప్పులుకలియుటచే కుప్పెలోత్వరలో నారవు విశేషగుణములు:- లఘుసూర్యావర్తి చలువజేయునది కావున ఉడుకుతోగూడిన నోటిపూతమొదలగు పైత్యవ్యాధులయందు చక్కగపనిచేయును. దానిని గర్భిణీస్త్రీలకు కలుగు పైత్యవ్యాధులన్నిటియందును ఉపయోగించెదరు

సువర్ణసూర్యావర్తి:-కొందరు దీనియందు కేవలము బంగారమునే వేయుదురు, కాని భస్మమువేయుట శ్రేష్టము- ఇందు టంకణము 2 భా. అనిపాఠభేదము కలదు. కస్తూరిని తుదకు కలిసి నూరవలయును. లవంగముల కషాయముతో నధికముగ మర్దించిన యెడల మందునల్లగనగును. ఇదివుడుకుతోకూడిన పైత్యవ్యాధులయందు కంటె వాతముతోకూడిన పైత్య వ్యాధులయందు

(తరువాయి 187వ పేజీలో)

# ★ స్వర్ణవసంతమాలతి ★

ఆచార్యశ్రీ చరణతీర్ధజీమహారాజు గోండల్

ఇచ్చట "స్వర్ణవసంతమాలతి" అను ఔషధములో వేయబడుచుండు ఓషధీసంయోగము అను గురించి, వస్తుభేదములనుగురించి వివాదములుచేసి చర్చింపబడిన విషయములు వివరించబడినవి.

1. నవనీతము పాలనుండి తీయబడినదా (లేక) పెరుగునుండి తీయబడినదా? దానిని కలుపుచున్నారా ?

2. నవనీతము ఏపాలులో కలుపవలసి యున్నది ?

3. నిమ్మరసము ఎంత మానములో వుపయోగించుట యుక్తము ?

4. స్వర్ణవసంత మాలతిలో నల్లమిరియాలు ఉపయోగింప వలెనా లేక తెల్లమిరియాలు ఉపయోగింపవలెనా ?

1. నవనీతము అనగా పాలనుండి తయారు చేసినదా ? లేక పెరుగునుండి తయారుచేసినది కలుపుట శాస్త్రయుక్తమా ?

స్వర్ణవసంత మాలతి యందైనను, మరియేయితర ఔషధము నందైనను «నవనీతము» ఉపయోగింప వలెనని చెప్పబడి యున్నచో పెరుగునుండి తీయబడిన వెన్ననే ఉపయోగింప బడినట్లుగా శాస్త్రజ్ఞులు, గ్రంధకారులుకూడ చెప్పియున్నారు. భావప్రకాశాది గ్రంధకారులు, అమరకోశాది కోశకారులు కూడ నవనీతమనగా దీనికే అర్ధము చెప్పిఉన్నారు. వాని పర్యాయ పదములు, మృంజ్జణం, సరజం, హైయంగవీనం, హాయ్యనోదోహోద్భవం అని వ్రాయబడి ఉన్నవి.

అమరకోశ టీకాకారులు

నవనీతం మథితాత్ దధ్నఃనవం తత్కాలనీతం
ఉద్ధృతం, నవనీతం

పెరుగునుంచి చిలుకరింపగా తీసిన వెన్ననే నవనీతమని చెప్పుచున్నారు.

నవనీతముయొక్క రెండవ శబ్దం "హైయంగవీనం" అనగా "హ్యఃపూర్వ దినెకృతో యోగోదహః గోదుగ్ధం తస్మాత్ దధిః రూప ప్రాప్తాత్ గోదుగ్ధాత్ ఉద్భవః ఉత్పత్తిర్యస్యతత్ హాయంగవీనం" - అనగా ముందటిరోజు తీయబడిన ఆవు పాలును ఉపయోగింపవలెనని చెప్పబడెను. అనగా ముందటి రోజు తీయబడిన పాలును పెరుగుగాచేసి నవనీతము తీయ వలెను. కాని ఒకరోజు ముందుపాలు ఆమరుసటి దినమ ఉపయోగించుటకు వీలుండదు. అందుచే «హైయంగవీనం అను మాటనుబట్టికూడ పెరుగునుండి తీయబడిన వెన్న కా భావముకల్గుచున్నది.

కాని పాలనుండి తీయబడిన వెన్నను గూర్చిన వివరము చూచిన పెరుగునుండి తీయబడిన వెన్నకంటేకూడ శ్రేష్టము తలచబడును. కాని ఏరోగులకైనను పెరుగునుండి వెన్నతో తయారుచేసిన ఔషధమే మంచిది.

> క్షీరోత్థం తదతిస్నిగ్ధం చక్షుష్యం రక్తపిత్తనుత్
> వృష్యం బలకరం గ్రాహి మధురం శీతలం పరం॥

పాలనుండి తీయబడిన వెన్న నుపయోగించిన కండ్లకు చల చేయును. రక్తపిత్తమును నాశనము చేయును. తియ్యగ నుండును. హితకారి.

రాజ నిఘంటుకారుడు పెరుగునుండి తీయబడిన వెన్నను గూ

> శీతం రుచ్య నవోద్ధృతం సుమధురం వృష్యంచ
> నాతాహిప
> కాసఘ్నం క్రిమినాశనం కఫహరం సంగ్రాహి
> శూలాపప
> బల్యం పుష్టికరం తృషార్తి శమనం సంతాప విచ్ఛేదః
> చక్షుష్యం శ్రమహారి తర్పణకరం దధ్యుద్భవం
> పిత్తజిత్

అనగా పెరుగునుండి తీసినవెన్న వాతమును పోగొట్టు దగ్గును శమింపజేయుట, కఫమును వెడలుబుచ్చుట, శూ లను పోగొట్టుట, శరీరములో రక్తవృద్ధిజేసి బలమును కల

(తరువాయి 68వ పేజీలో

## స్వర్ణ వసంత మాలతి

( 65వ పేజీ తరువాయి )

...యుట, నేత్రములకు చలువ నిచ్చుట, జ్వరములను, పైత్యములనణచుట, తాపము శమింపజేయుట మున్నగు సద్గుణములు కలిగిఉన్నది.

అనగా ఈపై జెప్పిన గుణములు పాలనుండి తీసిన వెన్న యందుకంటె మించి ఉన్నవా అను సందేహము కలుగవచ్చును.

కాని స్వర్ణవసంత మాలతి ముఖ్యముగా క్షయ వ్యాధులకు చెప్పబడిన మందు.

భోజనమునందు అరుచి, శరీరము నీరసము జెందుట, వాత ప్రకోపముచే మలబద్ధముగాని, విరోచనము లగుటగాని సంభవించుట, దగ్గు ఎక్కువగా నుండుట, జ్వరము జీర్ణించియుండుట, ఎక్కువ దాహము మున్నగు లక్షణములుగల క్షయ రోగమునందుండును. ఈ లక్షణము లన్నింటిని శమింపజేయగల శక్తి ఒక్క పెరుగునుండి తీయబడిన నవనీతమునకే కలదు. క్షయ మున్నగు వ్యాధులలో వాత పిత్త కఫములు మూడున్ను ప్రకోపము జెందవచ్చును. వానిని శమింపచేయగల శక్తి పెరుగునుండి తీయబడిన "వెన్న" కే కలదు ఇన్ని అధిక గుణములను కలిగియుండుటచే శాస్త్రకారులు ఈ "వెన్ననే" ఉపయోగింప వలసినదిగా చెప్పియున్నారు.

కొంతమంది శాస్త్రకారులు పెరుగునుండి తీసిన వెన్నలో మజ్జిగ కలిసియుండుననియు, ఆమజ్జిగతో కూడిన వెన్నను ఉపయోగించిన శరీరమునకు హాని కలిగించుననియు చెప్పుచున్నారు. కాని స్వర్ణవసంతమాలతిలో ఉపయోగించు వెన్న బహుకొద్ది భాగమనియు, అదికూడ నిమ్మరసముతో మర్దించినపుడు దానిభాగము ఉండనేరదనియు, చెప్పియున్నారు. జీర్ణజ్వరములలోను, రాజ యక్ష్మల యందు కూడ మజ్జిగను విరివిగా ఉపయోగింపవచ్చును. కనుక ఇట్టి

( తరువాయి 69వ పేజీలో )

## స్వర్ణవసంతమాలతి

( 68వ పేజీ తరువాయి )

మంచిగుణముల నివ్వగల శక్తి పెరుగునుండి తీయబడిన వెన్న కేకలదు గాన ఉపయోగింప వచ్చునని నిస్సందేహముగా చెప్పవచ్చును.

2. నవనీతం స్వర్ణవసంతమాలతిలో ఏ ప్రమాణములో కలుపవలెను ?

ఈ ఔషధములు అయిదు రకములైన వస్తువులను మొత్తం 17 భాగములు తీసికొని మిశ్రమముచేసి నవనీతంలో మర్దన చేయవలసినట్లుగా వ్రాయబడి ఉన్నది. యోగతరంగిణిలో మొదట ఈ వస్తువులను వెన్నతో కలిపి నిమ్మరసముతో మర్దన చేయవలసినదిగా చెప్పబడి ఉన్నది. యోగరత్నాకరము, మున్నగువానిలో మొదట ఆ వస్తువులను నవనీతముతో మర్దన చేసి, తరువాత నిమ్మపండ్ల రసముతో మర్దన చేయవలసినదిగా చెప్పి ఉన్నారు.

భైషజ్య రత్నావళిలోకూడ మొదట నవనీతముతో మర్దన చేసిన తరువాత నిమ్మరసముతో మర్దన చేయవలసినదిగా చెప్పబడి ఉన్నది. రసరత్న మణిమాలలోకూడ

సురభి నవనీతే సకలం ఖల్వే దృఢం
యథాక్యా త్తథా సంమర్ద్య పిండే సమం
భవతి అథో పశ్చాత్ నింబూద్ భూత్తైరస్సైః
సంమర్ద్య నవనీతస్య లయః భవతి
తదా రత్తిమాత్రాం గుటికాం రచయ !

అనగా అన్ని ద్రవ్యములను ఖల్వమునందుంచి ఆవువెన్నతో బాగా మర్దన చేయవలెను. ఆ ద్రవ్యములన్ని ముద్దగా అయిన తరువాత నిమ్మరసము పోయుచు నూరవలెను. నవనీతము పూర్తిగా కరిగినతరువాత ఔషధము తయారు అయినట్లు గ్రహించవలెను.

### ప్రమాణం

మొత్తం పదునెనిమిది తులముల వస్తుసముదాయము కలసి ముద్దకట్టువరకు వెన్నకలుపుచు ఖల్వమునందు నూరవలెనని రసోద్ధార తంత్రమునందు చెప్పబడి ఉన్నది. ఇట్లు చేయగా 9 లేక 10 తులముల వెన్నను ఉపయోగింపవలసి యుండుట అవసరమని చెప్పబడి యున్నది. శీతల ఋతువులో వెన్న గట్టిగానుండిన మరి ఒకటి, రెండు తులములు అధికముగా ఉపయోగింపవలసి యుండునట్లు చెప్పబడి యున్నది. శాస్త్రకారులు నవనీతము ఇంత ప్రమాణములో వేయవలెననుట వారి

అభిప్రాయము కాదు. వస్తుసముదాయమంతా బాగా కలియునట్లు మర్దన చేయుటకు అవసరమైన వెన్నను ఉపయోగింపవచ్చునని వారి భావము. మర్దన జరిగిన తరువాత మొత్తం ముద్దను తూచి అందలి వెన్న ప్రమాణము కనుగొనుటయే యాబది సంవత్సరముల నా ఔషధ పరిజ్ఞానమువల్ల చెప్పగలిగినది. నవనీతము (వెన్న) ఎక్కువగా ఉపయోగించిన పిమ్మట నిమ్మరసముతో 20, 25 రోజులవరకు మర్దన చేసినను, నిమ్మరసములోనుండు ఆమ్లత్వమువల్ల దోషము కలుగదు. అట్లుగాక తగిన పాలులో నవనీతము (వెన్న) కలుపని యెడల ఆమ్లత్వము నిలువ ఉండిపోవును.

### 3. నిమ్మరసము ఎంత ఉపయోగించుట యుక్తము ?

నిమ్మరసము ఎంత ప్రమాణములో వేయవలసినది మనము చెప్పగలుగుట కొంచము అసాధ్యమైన విషయం. స్వర్ణవసంత మాలతిలో వేయబడిన నవనీతం (వెన్న) ను బట్టి నిమ్మరసంతో మర్దన జరుపవలెను. వెన్న తక్కువగా నుపయోగించి నిమ్మరసముతో ఎక్కువ మర్దన అయినచో ఆమ్లత్వము వెంటనే జెంది గుణము చెడును. సామాన్యముగా వెన్నలో ఔషధ సముదాయము బాగుగా కరిగి కలసినతరువాత తమారమి నిమ్మరసముతో 8 రోజులు మొదలు 20 రోజులవరకు మర్దన జరుపుచునే ఉండవలెను. కనుక ఈ విషయములో గమనింపవలసినది వెన్నయొక్క స్నిగ్ధత్వము మందులోపోయి ఆమ్లత్వము జెందే ముందుగా మర్దన విరమించవలసినదిగా శాస్త్రకారుల అభిప్రాయమని అనగా దానినిబట్టి స్వర్ణవసంత మాలతిలో నెయ్యి, నిమ్మరసములమధ్య యుద్ధము జరిగి ఒకవిధమైన రసాయినిక మార్పు కల్గుచున్నది. నిమ్మరసము యొక్క ఆమ్లత్వమును పోగొట్టును. వెన్నయొక్క స్నిగ్ధత్వమును నిమ్మరసము తగ్గించును. కనుక ఎల్లప్పుడు ఈమందును తయారు చేసుకొనవలసినవారు ఒకపర్యాయము తయారు చేయుటలో ఎన్నితులముల మందునకు ఎన్నిపాత్రల (ఒక కొలపాత్రి రసమును తూచి) రసము ఉపయోగించినది జ్ఞాపక

(తరువాయి 71వ పేజీలో)

# ఆయుర్వేద పురోభివృద్ధి

ఆయుర్వేదాచార్య,
పండిత కవిరాజ్ అనంత త్రిపాఠీ శర్మజీ
( అఖిల భారత ఆయుర్వేద కాంగ్రెస్ అధ్యక్షులు )

అధ్యక్షా, ఆహ్వాన సంఘ సభ్యులారా !

సోదర సోదరీమణులారా !!

నన్ను అఖిల భారత ఆయుర్వేద కాంగ్రెసు అధ్యక్షునిగా ఎన్నుకొనినందులకు ఇదియే నా కృతజ్ఞతాభివందనములు. పోటీఎన్నికలు జరుపుటకు దోహద మివ్వకుండుటకై శ్రీ వైద్యరత్న పండిత శివశర్మగారు, వైద్యరాజ శ్రీ పార్థనారాయణ పండిట్, రాజవైద్య శ్రీ రామేశ్వరశాస్త్రి మరియు శ్రీ వామనరావు డి. వైద్య గార్లు, నాయందుగల ప్రేమాతిశయములచే వారి పేర్లను ఎన్నిక సభ్యుల జాబితా నుండి తొలగింప జేసికొనినందులకు వేనోళ్ల కొనియాడవలసి యున్నది. ఈ అధ్యక్షపదవిని స్వీకరించుచు, తదుపరి నా ఆఫీసు కర్తవ్యములను నా శక్తినంతయు ధారపోసి పనిచేయుగలందులకు మిమ్ములనందరిని నమ్మించుచు, ఆయుర్వేదజ్ఞుని యొక్కయు, ఆయుర్వేద అభిమానుని యొక్కయు సహకారమును నా కార్యనిర్వహణమునకై తోడ్పాటు చేయగలందులకు కోరుచున్నాను.

## ఆయుర్వేద ప్రాశస్త్యము

"ఆయుర్వేదము" అనుమాటలోనే ఇది వేదసంబంధమైనదను అభిప్రాయమును వెలువరించుచున్నది. ఋక్, యజు, సామ వేదములలో అనేకములైన ఆయుర్వేద ఔషధములను చెప్పబడి యున్నవి. అందు అశ్వనీ కుమారులచే చెప్పబడిన అనేక ఆయుర్వేద వర్ణనములుకూడ కలవు. అథర్వణ వేదములో వివిధములైన చికిత్సా వర్ణనములు చెప్పబడియున్నవి. అసలు "వేదము" అను పదమునకే శాస్త్రమని అర్థము కలదు. అందుచే "ఆయుర్వేదము" అనగా జీవరక్షణ శాస్త్రమని అర్థము. వైద్యశాస్త్రములన్నీ ఒక రోగ నివారణా విషయములు, దానికి పలయు ఔషధములనే చెప్పుచున్నది. ఆయు

( తరువాయి ప్రక్కపుటలో )

( 70 వ పేజీ తరువాయి )

ముంచుకొని అదేకొలమానములో ఉపయోగించుకొనవచ్చును.

4. స్వర్ణవసంతమాలతిలో ఉపయోగించ వలసినది నల్ల మిరియాలా ? (లేక) తెల్లమిరియములా ?

జవాబు: అన్ని గ్రంథములలోను కూడ శాస్త్రకారులు "మిరియములు" అంటే నల్లమిరియములనే భావించవలెను. శొంఠి, పిప్పలి, మిరియాలు, త్రికటుకములు అనగా ఇచ్చట నల్లమిరియాలు అనే భావము. భావప్రకాశలో మరిచం, వెల్లజం, కృష్ణభూషణం, ధర్మపత్తనం ఇది నల్లమిరియములకే పర్యాయ పదములు కాని తెల్లమిరియములకు కావు.

కొంతమంది వైద్యులు నల్లమిరియములు శుద్ధిజేసినది కానని యు తెల్లమిరియములు శుద్ధిచేయబడినవి కనుక అవి ఉపయోగించుట శ్రేష్టమని చెప్పుదురు. కాని మనదేశమునుండి వేలకొలది టన్నుల నల్లమిరియములు ప్రపంచములోని అన్ని ప్రాంతములకు ఎగుమతి యగుచున్నది. అనేక అల్లోపతి ఔషధములలోకూడ ఈ నల్లమిరియములనే ఉపయోగించుచున్నారు. మిరియములపైనుండు పైపొరను ఒలిచి తీసిన మిరియములే శుద్ధము అయినవి కావని చెప్పవచ్చును. దానికి ప్రకృతిలోనున్న తొక్కను తీసివేయుట వాని శుద్ధత్వమునకు భంగకరము. కనుక పూర్వము అనేక శాస్త్రములలో చెప్పబడినది - వేలకొలది సంవత్సరములనుండి యోగముల ప్రకారం చేయుచున్న దానిని నేడు త్రోసిపుచ్చుట కడు శోచనీయ విషయంకాని సామాన్యంకాదు. అందులకుగాను ఇంకా ఆయుర్వేదములో కడుపరిశోధనములు జరిపి నిదర్శనములు చూపవలసిన అవసరము గలదు.

(అఖిలభారత ఆయుర్వేద సమ్మేళన పత్రికనుండి)

## ఆయుర్వేద పురోభివృద్ధి

( 71 వ పేజీ తరువాయి )

ర్వేద శాస్త్రిమట్లుగాక రోగ నిరోధక మార్గములు కూడ చెప్పుచున్నది. పూర్వకాలములో అనేకమంది మహర్షులచే గ్రహింపబడిన శాస్త్రమిది. 6 వ, శతాబ్దములో వందల కొలది విద్యార్థులు, నలంద, తక్షశిల మున్నగు ప్రాచీన విశ్వ విద్యాలయములలో ఈ ఆయుర్వేద శాస్త్రము నభ్యసించి నట్లుగా చరిత్రలుద్ఘాటించు చున్నవి. ఆ రోజులలో చరక, శుశ్రుతాదులచే చేయబడిన ఆయుర్వేద పరిశోధనలన్నియు వన్నెకెక్కినవి. విదేశీ విద్యార్థులనుకూడ ఈ విశ్వవిద్యాలయములు ఆకర్షింపగలిగినవి. ఆ విశ్వవిద్యాలయములలో నున్న పరికరములనుబట్టి చూస్తే ఆనాడు శస్త్రచికిత్స ఎంత అభివృద్ధిలో నున్నదో తెలియగలదు. బుద్ధుని కాలములో కూడ ఆయుర్వేద శాస్త్రము అభివృద్ధిలో నున్నదని చెప్పుటకు ఆధారములు లేకపోలేదు ఈనాడు అలోపతి వైద్యులు ఉపయోగించు "థిరపిటిక్" అను పదము ఆనాడు బౌద్ధయుగములో నుపయోగింపబడిన స్తిరపుటా (Stteera Putta) అను పదమునుండి గ్రహింపబడినదే అలెగ్జాండరు మన దేశముపై దండెత్తి నప్పుడుకూడ ఆయుర్వేదము చాలా అభివృద్ధిలో నున్నదనుటకు వారి సైన్యములో అనేకమందికి, మన వైద్యులు శస్త్రచికిత్సలు నడపినట్లుగా తెలియుచున్నది. మరియు అలెగ్జాండరు తిరిగి వెళ్ళునపుడు కొన్ని గ్రంథములు తన దేశమునకు తీసికొని పోయినట్లు తెలియుచున్నది. ఈవిధముగానే చరక, శుశ్రుతములు నెమ్మదిగా అరేబియా, మున్నగు దేశములకు చేర్చబడి వారివారి భాషలలోనికి అనువదింపబడినవి. అశోకునినాటి శాసనములుచూస్తే ఆనాడు ఆయుర్వేద, పశువైద్య శాస్త్రములు ఎలా అభివృద్ధిలో నున్నవో తెలియగలవు. పృథ్వీరాజు, శివాజీ మున్నగు చక్రవర్తులు కూడ అనేక ఆయుర్వేద రసయోగములను ప్రయోగించి దృఢకాయులైనట్లు తెలియవచ్చుచున్నది. వేదకాలములో అశ్వనీ కుమారులు కడునిపుణతతో శస్త్రచికిత్సలు నేటికి కూడ ఆచరణకు తేలేని విషయములు జరిపినట్లుగా తెలియుచున్నది. సుశ్రుతుడు తన గ్రంథములో శస్త్రచికిత్స కుపయోగింపబడిన 125 పరికరములనుగూర్చి వర్ణించియున్నాడు.

( తరువాయి 73 వ పేజీలో )

## ఆయుర్వేద పునరభివృద్ధి

( 72వ పేజీ తరువాయి )

గర్భస్థమైయున్న మృతశిశువునుకూడ శస్త్రచికిత్సా పరికరములచే వెలువరించినట్లుగా తెలియుచున్నది. ఆత్రేయుడు గౌతమ బుద్ధునకు గొప్ప శస్త్రవైద్యము నడిపినట్లుగా చాణక్యుని అర్థశాస్త్రములో చెప్పబడియున్నది. ఇట్టి ప్రాశస్త్యముతో కూడియున్న ఆయుర్వేదము నేటికికూడ నూటికి ఎనుబదిమంది హిందువులచే ఉపయోగింపబడుచున్న వైద్యశాస్త్రమిది. ఆయుర్వేద మనగా సిద్ధ, యూనానీ, మున్నగు దేశీయ వైద్యములన్నికూడ ఇమిడియున్న శాస్త్రమనియే అర్థము.

## ఆయుర్వేద పతనము, సజీవము చేయవలసిన ప్రయత్నములు.

పాశ్చాత్య వ్యామోహముచే ఇట్టి ప్రాశస్త్యమైన ఆయుర్వేద శాస్త్రము అడుగంటుట చాలా విచారకరమైన విషయము. 12వ, శతాబ్దము ఆదినుండి 1947 వరకు కూడ ఇండియా పాశ్చాత్య ప్రభుత్వముచే త్రొక్కబడియున్నది. మహమ్మదీయుల కాలములో ఈ ఆయుర్వేదము పూర్తిగా అశ్రద్ధ చూపుటచే దాని పతనమునకు కారణమైనది. కాని బ్రిటిష్‌వారి పరిపాలనా కాలములో వారు వారి అల్లోపతి శాస్త్రమును అభివృద్ధి చేసుకొనుటకే ప్రయత్నించారుకాని ఆయుర్వేద శాస్త్రమును అణగద్రొక్కుటకు ప్రయత్నింపకుండుట కడు ముదావహము. హిందూదేశములో జాతీయ ఆందోళన ఉద్భవించిన తరువాత 1920వ, సంవత్సరమునుండి రాష్ట్రప్రభుత్వములవారు ఈ ఆయుర్వేద అభివృద్ధి సూచనలకై అనేక కమిటీలు ఏర్పరచుట, వారి సూచనలపై ఆయుర్వేద కాలేజీలను, ఆతురాలయముల నెలకొల్పుట జరుగుచు వచ్చుచున్నది. నాగపూరులో జరిగిన నేషనల్ కాంగ్రెసు సభలలో ఆయుర్వేదాభివృద్ధికొరకై ప్రత్యేక తీర్మానము కూడ చేయబడి వున్నది. మెల్లగా ఆయుర్వేదము అభివృద్ధికి రాగలదనే ఆశించాము.

## ఆయుర్వేదము - భారత ప్రభుత్వము

మన దురదృష్టముచేతనో విదేశీమందుల అభివృద్ధి సూచకములచేతనోగాని భారత ప్రభుత్వ మాజీ ఆరోగ్యశాఖా మంత్రిణి శ్రీ రాజకుమారి అమృతకౌర్ గారు ఆయుర్వేద అభివృద్ధి మార్గములకై పాటుపడుచున్నట్లునటించుచు, దానిని పతనము జేయుటకు, ప్రయత్నించు చున్నది. ఆమె-నూటికి తొంబదిమందికంటె యెక్కువమంది ప్రజలలో ఆకర్షణీయముగా మెలగుచున్న ఈ ఆయుర్వేద శాస్త్రమునకు ఇంతవరకు ఎట్టి అభివృద్ధి మార్గములను భారత ప్రభుత్వమువారు యేర్పరచి వుండలేదు. బడ్జటులో ఇందులకు నియమింపబడిన యావత్తుడబ్బు అల్లోపతి శాస్త్రాభివృద్ధికే ఖర్చుపెట్టబడు చున్నది. గాంధీమహాత్ముని నిర్యాణానంతరము మన భారత ప్రభుత్వ మాజీ ఆరోగ్యశాఖా మంత్రిణిగారు తన నిజోద్దేశ్యముతో, ఆయుర్వేదమును నాశనము చేయదలచి భారత ప్రభుత్వమునే ప్రోత్సహించుచున్నది. కాని ఇది కడు విచారణీయము.

## భారతప్రభుత్వము నియమించిన కమిటీలు

దఫదఫాలుగా భారత ప్రభుత్వము ఈ ఆయుర్వేద అభివృద్ధి మార్గముల పథకముల నందజేయుటకు అనేక కమిటీలను

( తరువాయి 74వ పేజీలో)

## ★ రొమ్ము వ్యాధి ★

( భోగట్టా సేకరణ )

వల్లభాయ్ పటేల్ వైద్య ( రొమ్మువ్యాధుల ) సంస్థలో నెలకొల్పిన చికిత్సా పరిశోధనా కేంద్రానికి యీవాళ డా. రాజేంద్ర ప్రసాద్ ప్రారంభోత్సవం జరిపారు. ఈ సందర్భంలో సంస్థ డైరెక్టరు డా. ఆర్. విశ్వనాథన్ మాట్లాడుతూ ఇలా అన్నారు. ఈ పరిశోధనా కేంద్రం నెలకొల్పడంవల్ల, మానవ శరీరంలో వచ్చే మార్పులు మున్నగువాటిని పరిశీలించి ప్రత్యక్ష పరిశోధనలకు ఉపయోగపడే భోగట్టా సమకూర్చుకోడానికి అవకాశం కలుగుతుంది. పరిశోధనా ఫలితాలు, వ్యాధి నివారణకు, ఆరోగ్యాభివృద్ధికి చేసే కృషికి తోడ్పడకపోతే వైద్య పరిశోధనలు పనికిమాలినవవుతాయి.

ఇంతవరకూ మనదేశంలో గుండెజబ్బులు, ఉబ్బసం, రొమ్ము పడిసెము మున్నగు వ్యాధులు రావడానికి కారణాలు, ఎంతమంది యీ వ్యాధులతో బాధపడుతున్నారు అన్న విషయాల గురించి భోగట్టా లేదు. ఈ పరిశోధనా కేంద్రం యీ భోగట్టా సేకరించడానికి కృషిచేస్తుంది.

ఈ వైద్యసంస్థ ఇతర శాస్త్రీయ శాఖ భవనాల వద్దనే వున్నందువల్ల చాలా ప్రయోజనాలు ఉంటాయి.

## ఆయుర్వేద పురోభివృద్ధి

( 73వ పేజీ తరువాయి )

నేర్పరచినది. అందు «భోర్ కమిటీ» చాల ముఖ్యమైనది. దానికి ఛైర్ మెన్ గా "జోసఫ్ భోరు" అను వారు నియమింపబడ్డారు. వారు అందించిన పథకములనుబట్టిచూస్తే ఇండియా తన యావత్తు ఆదాయమును ఆయుర్వేదాభివృద్ధికే ఖర్చు చేసినను చాలని విషయము. వారు చెప్పినంతిమంది వైద్యులను 25 సంవత్సరములలో తయారు చేయుట కడు శోచనీయము.

అట్లు తయారుకాబడిన 185000 డాక్టర్లకు ( అంచనా వేయబడినట్లుగా ) 75% మంది పట్టణములకు ఎగబాకుటకు చూస్తారుకాని పల్లెలలో పేదప్రజానీకమునకు సాయమొనరింప ప్రయత్నింపరు. ఒకచో ఇట్లు పల్లెలలో నియమింపబడిన డాక్టర్లు పట్టణముల కెగబ్రాకుటకే ప్రయత్నింతురుకాని పేద ప్రజలసేవ ప్రథమోద్దేశము కానేరదు. పేదప్రజలు ఎక్కువగా ఆయుర్వేద వైద్యమునకే ముఖ్యస్థానము ఇస్తారుకాని, భోర్ కమిటీ సలహాప్రకారం తయారుకాబడిన వైద్యులుప యోగించు అల్లోపతి విధానమునకు ఎంతమాత్రము దోహదమివ్వరు. వారి సలహాలలో వేయబడిన అంచనాలు, స్కీములు చూస్తే అవి ఏవిధముగా చూచినా ధనికవర్గమునకు, పట్టణ ప్రజలకే లాభదాయకములుగాని పల్లెలకు, పేద ప్రజానీకమునకు అభివృద్ధిదాయకము కానేరవు. మన యిండియా ప్రభుత్వమునకు స్వాతంత్ర్యము లభించినప్పటికిని వైద్యవిధానములో పరతంత్ర్యపిపాస నశించలేదు. రాజకీయముగా పరిపాలన స్వాతంత్ర్యము స్వహస్తా నాయకత్వముపై

( తరువాయి 75వ పేజీలో )

## ఆయుర్వేద పురోభివృద్ధి

(74వ పేజీ తరువాయి)

ప్రజ్వరిల్లుచున్నది. కనుక మన వైద్య బృందము కూడ శ్రీ గాంధీజీ చెప్పినట్లు, అతడు ఆయుర్వేదమునందు చూపిన శ్రద్ధాభక్తులు మనము ఆచరించాలి.

కాని మన మాజీ ఆరోగ్య శాఖామంత్రిణి బడ్జెటు ప్రకారముగా రెండు వైద్యశాఖలకు డబ్బు ఖర్చుపెట్టుటకు ఇష్టములేక, అల్లోపతి అభివృద్ధికొఱకై పాటుపడదలచి ఆయుర్వేదమును పతనము చేయదలచినది. యదార్థమునుబట్టి చూస్తే అల్లోపతి శాస్త్రము చాలా అభివృద్ధి నందినదనియే చెప్పవచ్చును. కాని మన ఆయుర్వేదమునకుకూడ కడు ప్రోత్సాహమున్నచో అట్టి కొఱతలుండనేరవు. అందులకు ప్రభుత్వమువారు ప్రోత్సాహము ఇచ్చుటలేదు. సరికదా దానిని అణగద్రొక్కదలచి మనలను నిరుత్సాహపరచుచున్నారు. నిజమునకు ఆయుర్వేదశాస్త్ర విధానములపై తయారుకాబడిన వైద్యులు, ఉపాధ్యాయులు మున్నగువారు ప్రస్తుతములో కొఱతగానే ఉన్నారు. కాని అట్టి కొఱతను ప్రభుత్వమువారుకూడ తీర్చగలరు. ప్రజాప్రభుత్వమునకు యీ బాధ్యతలు తీసికొనవలసిన అవసరములు గలవు. వారు అట్టి కర్తవ్యపాలనము చేయనిచో అది నిరంకుశ ప్రభుత్వము గామారినదని చెప్పకోక తప్పదు. తరువాత 1946 డిశంబరులో దేశీయ వైద్యపరిశోధనామార్గమునకు సూచన లందజేయుటకై ఒక కమిటీని "చోప్రాకమిటీ" అను పేరుతో ఏర్పరుపబడినది అటుతరువాత 1949 నవంబరు నెలలో ఈ విషయముల నందచేయుటకే ప్రభుత్వమువారు పండిట్ కమిటీ నొకదానిని నియమించారు. అటుతరువాత మరల 1955 లో శ్రీ గయాశంకరదవే ఛైర్ మెన్ పదవిని ఒక కమిటీని ఏర్పరచారు. కాని ఎన్ని కమిటీలు ఏర్పరచినా వీనిలో ఒక్కరైనను ఆయుర్వేద పండితుడు మెంబరుగా లేకపోవుట చేతను, మెంబర్లు అంతా అల్లోపతివైద్య వ్యామోహులగుట చేతను ఆయుర్వేదాభివృద్ధికి సరియైనసూచన లందజేయలేకపోయారు. ఆ ఏర్పరుపబడిన కమిటీ సవతితల్లి ప్రేమను చూపుచున్నది. ఇందులకై పెద్ద ఆందోళన జరుపగా ఒక ఆయుర్వేద పండితుని ఏర్పరుచుటకు సూచించారు. కాని అతని అభిప్రాయము ఆ కమిటీలో మైనరు విషయం అయినది. అల్లోపతి వైద్యకమిటీలలో ఆయుర్వేద వైద్యులను నియమించకుండినట్లే ఆయుర్వేద వైద్యకమిటీలలో అల్లోపతి వైద్యులను నియమించుట చాలా బాధాకరమైన విషయము. ఇది బ్రిటిష్ పరిపాలనలో ఎంతసేపు న్యాయశాఖలో వారి దొరలనే నియమించుకొని వారిజాతికే లాభము ఒనగూర్చుకొనుటకై యత్నించుట అగపడుచున్నది. అందుచే పైనవివరించిన కమిటీలు ఎన్ని వేసినా వారు ఇచ్చిన సలహాలు అన్నియు ఆయుర్వేదమునకు వ్యతిరేకములైనవే అందు కొన్ని వారి అభిప్రాయములు ఈ క్రింద ఇవ్వబడినవి.

## శాస్త్రముల కలయిక

శాస్త్రము ఎట్టిదైనను శారీర విషయములు అన్ని శాస్త్రముల రీత్యా ఒకటే విధానమై యున్నది. ఈ ఆధారముపైననే చోప్రాకమిటీవారు ఆయుర్వేద, యూనానీ, అల్లోపతి విధానములను ఏకము చేయ సూచించారు. ఇది చాలా ఆకర్షణీయముగానే నుండును. కాని శాస్త్రముల కట్టుబాట్లు తప్పక నశించును. అందు ఒకమూల అల్లోపతి శాస్త్రజ్ఞులు ఆయుర్వేదమునుండి వివిధ విషయములను గమనించి వారి పరిశోధనలలో మిళితము చేసుకొంటున్నట్లే, వారి శాస్త్ర విషయములుకూడ ఆయుర్వేద శాస్త్రములో కలుపవలెను. కాని ఈ విధానమువల్ల ఆయుర్వేద శాస్త్రవిధాన మంతయు అడుగంటబడుననియు స్కూళ్లలోని విద్యార్థులు ఎల్లసమయములందు అల్లోపతిశాస్త్ర పఠనమునకే వినియోగిస్తారని చెప్పారు. కాని ఈ శాస్త్రములు రెండును ఏవిషయముల లోనుకూడ కలయిక ఉన్నట్లు నాకు తెలియదు.

## కాలేజీలలో ప్రవేశించుటకు విద్యార్హతలు

దవే కమిటీవారు ఆయుర్వేద కాలేజీలలో చేరు విద్యార్థులకు ఐ. యస్. సి. తగు విద్యార్హతగా ఏర్పాటు చేశారు. ఇదికూడ ఆయుర్వేద పతనమునకే దోహద మిచ్చుచున్నది. ఎవరైతే ఐ. యస్. సి. ప్యాసయి ఆయుర్వేద కాలేజీలలో చేరజాతురో అట్టివారు ఎంతసేపు అల్లోపతిశాస్త్రమే చదువజూతురు. అలోపతి కాలేజీలలో ప్రవేశ స్థానములు లభించనివారు మాత్రమే ఈ కాలేజీల కగబాక చూతురు. కొద్దిమాత్రముకూడ సంస్కృతజ్ఞానము లేకపోవుటచే వారు శాస్త్ర పుస్తకములోనున్న శ్లోకమైనను అర్థముచేసికొను శక్తిలేక, పరీక్షలలో ఉత్తీర్ణులగుటకే ప్రయత్నించుచు పట్టాలుపొందిన తరువాత ఆయుర్వేద శాస్త్రమునకు స్వస్తిచెప్పి అలోపతి వైద్యవిధానమునే నాచరింతురు.

దవే కమిటీవారు సూచించినట్లుగా కాలేజీలలో 4½ సంవత్సరముల కోర్సులుపెట్టి విద్యార్థులను తయారుచేస్తే వారు కవిరాజులు గాకుండాను, డాక్టర్లు కాకుండాను తయారు కాగలరు. ఒక అలోపతి విధానమున తర్ఫీదు కాబడి బయటకు వచ్చుసరికే ఆయిదుసంవత్సరముల కాలము పరిపడుచున్నది. అట్లుగాక 4½ సంవత్సరములలో రెండుశాస్త్రములు నేర్వవలసిన వైద్యుడు బయటకువచ్చి ప్రజలను మోసగించ

ప్రయత్నించవలెను కాని అతని ప్రావీణ్యము ఏ శాస్త్రము పైనను చూపలేదు.

## పరిశోధనా ప్రణాళిక

ఇక పరిశోధనలు జరుపుటకై కొన్ని ప్రణాళిక లివ్వబడినవి. అవి యదార్థమునకు ఆయుర్వేద శాస్త్రాభివృద్ధికై చేయబడినవా (లేక) ఆ శాస్త్రమును నాశనము చేయుటకు చేయబడినదో బోధపడుటలేదు. నా అభిప్రాయమునుబట్టి చూస్తే, తప్పక ఆయుర్వేద శాస్త్రమునకు ఈ పరిశోధనా ప్రణాళికలు అరిష్టదాయకములని చెప్పవచ్చును. పరిశోధనలు మూడవస్టేజిలో చేయవలసినది. మొదటి రెండు విభాగములు అండరు గ్రాడ్యుయేటు, పోస్టుగ్రాడ్యుయేటు తరగతులను పూర్తిచేయుట. ఇప్పటివరకు అన్ని రాష్ట్రములలో కూడ అండరు గ్రాడ్యుయేటు తరగతులు మాత్రమే కలవు. ఈ మధ్యనే ఒక జామ్‌నగరులో పోస్టుగ్రాడ్యుయేటు తరగతి నెలకొల్పినారు. కనుక ప్రస్తుతములో ఇట్టి పరిశోధనలు జరుపుటకు తగిన విద్యావేత్తలు లేరని చెప్పవచ్చును. కాని ఈ సూచన ప్రకారముగా పరిశోధనలు నెలకొల్పుటకుగాను రెండు టీములు నెలకొల్పవలెను. అందు మొదటిది ఆయుర్వేద వైద్యులతోను, రెండవది అల్లోపతి వైద్యులతోను నెలకొల్పవలసి యున్నది. దీని ప్రకారం మొదట ఒక రోగిపై ఆయుర్వేద వైద్యులు మందులనుపయోగించి చూచి వాటి ఫలితములను గ్రహించవలెను. మరల ఈ ఫలితములను అలోపతి వైద్యులు సరిచూచి రెండు విషయముల ఫలితములు సరియైనవని తోచిన ప్రచురించవచ్చును. కాని రెండుశాస్త్రముల ఫలితములు యెన్నడు యేకము కానేరవు. కనుక యిది కూడ ఆయుర్వేద శాస్త్ర పతనమునకే మార్గము. కనుక ఈ కమిటీలు సూచించిన ఈ మూడు విధానములుకూడ ఆయుర్వేద పునరభివృద్ధికి మార్గము కానేరవు. మిగిలిన సూచనలు కొన్ని బాగుగనే ఉన్నవి. కాని అవి ప్రభుత్వము వారు అంగీకరించలేదు.

## ఒకటి, రెండు పంచవర్ష ప్రణాళికలు, ఆయుర్వేదము.

రెండవ ప్రపంచ యుద్ధము ముగిసిన తరువాత దేశములో అనేక అభివృద్ధి కార్యక్రమములు చేయబడ్డాయి. అందు రెండు పంచవర్ష ప్రణాళికలను చేసి, అందు మొదటి ప్రణాళికలోనే పరిశ్రమలు, వర్తక వ్యాపార రహదారుల విషయములలోను అనేక అభివృద్ధి సూచనలు చేశారు. ఇండియా అన్ని విషయములలోను అభివృద్ధి చెందింది. కాని ఆయుర్వేదములో మాత్రము లేదు. మొదటి పంచవర్షప్రణాళికలో ఆయుర్వేద పరిశోధనల నిమిత్తము 16 లక్షల రూపాయలు, 5 పరిశోధనాలయములకుగాను ఖర్చుపెట్ట నిర్ణయించింది. అందు ప్రభుత్వము జామ్‌నగరులో ఒక పరిశోధనాలయం మాత్రమే నెలకొల్ప కలిగింది. మొదటి ప్రణాళికలో నిర్ణయించబడిన బడ్జటుసొమ్ము ఖర్చునకు స్కీము లేకపోవుటచే రెండవ ప్రణాళికలో నిర్ణయింప ఉల్లంఘించినది మన మాజీ ఆరోగ్యశాఖా మంత్రిణిగారు రానురాను అనేక స్కీములను అందజేసినప్పటికిని అవి భారత ప్రభుత్వము ఆమోదమును పొందలేకపోయాయి. ఇక చోప్రా కమిటీ వారు అందజేసిన స్కీములు దేశ ప్రభుత్వమునకు అర్థికముగా అందని మ్రానిపండ్లు అయాయి. చోప్రాకమిటీ సూచనలకై చాలా సొమ్ము ఖర్చుపెట్టారు. కాని వారి సూచనలన్నియు నిష్ప్రయోజనాలు అయాయి. అందు మొదటి పంచవర్ష ప్రణాళికలో అల్లోపతి ఆసుపత్రుల కొరకు మితము లేని ధనవ్యయముచేసి ఒక దేశీయ వైద్య విధానమునకు అందు 5-6% మాత్రమే వెచ్చించారు.

( తరువాయి 89వ పేజీలో )



మూలికావైద్య నిపుణులు, భారత విఖ్యాత వైద్యులు శ్రీ బాలరాజ మహర్షిగారితో, మూలికా వైద్యప్రభావమును ముచ్చటించుచున్న దృశ్యము.

ఎడమనుండి: శ్రీ కవిరాజమోహన్, శ్రీ బాలరాజమహర్షి శ్రీ వి. రామమూర్తి (గుడియాత్తం, ఆర్కాటు జిల్లా.)



వైద్యశ్రీ, వైద్యరాజ
ఇలిపిల్లి అప్పారావు పాత్రుడుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్.
( కొత్తపేట, విజయవాడ, కృష్ణాజిల్లా. )

వీరు కార్మిక కుటుంబంలోపుట్టిపెరిగి పెద్దయైనవారు. వీరు మంత్రితీర్థములతో ప్రారంభమైన ప్రజారోగ్య సంరక్షణ' మూలికా, రసవైద్యములలో పెరగి పెద్దయైనవి. అరువది యేండ్లుదాటిన వృద్ధవైద్యులు. మంత్రతీర్థములతో, మూర్ఛ, ఉన్మాద, గ్రహ, పీడితులకు, ఆరోగ్యమును కల్గించుచున్న ఘనవైద్యులు. కవిరాజ పత్రిక ప్రధాన పోషకవర్గములో చేరినవారు. ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి స్టాండింగుకమిటి సభ్యులు. ఆయుర్వేదాభివృద్ధి కార్యక్రమాలలో నిరంతరం పాల్గొంటూ, ఆర్థికంగా, శారీరకంగా, తోడ్పడుతున్నవారు. విజయవాడలో నాగేంద్ర దేవాలయం నిర్మాణించినవారు.



వైద్యశ్రీ, వైద్యరాజ
ఈపూరి లక్ష్మీపతిరాజుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్.
( గర్భాం, శ్రీకాకుళంజిల్లా. )

శ్రీ లక్ష్మీపతిరాజుగారు పెద్దలయందు భక్తి విశ్వాసములు గలవారు. వైద్యాసక్తితో అనేక ఆయుర్వేద గ్రంథములను అనుభవ ఆయుర్వేద వైద్యప్రముఖులను ఆశ్రయించి అనుభవము గణించి, ప్రజారోగ్యమే తన భాగ్యముగా భావించి నిరంతరకృషి చేయుచున్నవారు.

అనేకములైన దీర్ఘవ్యాధులు నివారించుటలో ప్రఖ్యాతి గన్నవారు. వీరు ప్రధానముగా అపస్మారము, శ్వేతప్రదరములు, బాలరోగములు నివారించుటలో నిపుణులగుదురు. ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి స్టాండింగుకమిటి సభ్యులు. వీరి సహాయము మండలి పురోభివృదికి చిర్విత చర్వణము.

---

## ఇది విూకు తెలుసా

శ్లోకాలు పఠించడమే వైద్యంకాదు. రోగి సాధక బాధకాలు ఎరిగి చికిత్స చేయువాడే వైద్యుడు. చికిత్సలలో నైపుణ్యంలేని పాండిత్యం పాండిత్యంకాదు. వైద్యముకాదు.



వైద్యరాజ

**శ్రీ అద్దేపల్లి వీరరాఘవులుగారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్.

( నూతక్కి, వయా దుగ్గిరాల, గుంటూరుజిల్లా )

శ్రీ అద్దేపల్లి వీరరాఘవులుగారు నూతక్కి గ్రామవాసులు. ప్రస్తుతము వీరి వయస్సు రమారమి ఏబది సంవత్సరములు. ఆయుర్వేద వైద్యమునందు వీరు మంచి అనుభవము గడించినవారు. తరతరాలనుండీ వారి వంశము వైద్యమునందు పేరు గాంచినది. సద్భావంగల వైద్యునకుండవలసిన లక్షణములు గలవు. దయ, నిస్స్వార్థసేవ మొదలగు ఉత్తమోత్తమ గుణములు వీరియందు మూర్తీభవించి యున్నవి. రోగికి ధైర్యముకలిగించి మనోబలము చేకూర్చుటలో వీరికి ప్రత్యేక ప్రావీణ్యము కలదు. వీరిది అమృతహస్తము. ప్రసిద్ధి పొందిన డాక్టర్లచేతకూడ నయముకాని అనేక వ్యాధులు వీరి చల్లనిచేతితో నివారింపబడుచున్నవి. రోగనిదానము చేయుటలోను,చికిత్స నిర్ణయించుకొనుటలోను వీరికి చాల నేర్పుగలదు. వీరివద్ద అనేకులు చికిత్సా పద్ధతులు నేర్చుకొని ప్రావీణ్యము గడించుచున్నారు. అమృత కలశము చేతధరించిన ధన్వంతరివలె వీరిదర్శనమె ఆనందమును, సంతృప్తిని కలిగించుచుండును. ప్రస్తుతము వీరు తమ స్వగ్రామమునందు వైద్యవృత్తిలో నున్నారు. ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి స్టాండింగుకమిటి సభ్యులు.



వైద్యశ్రీ, కవిరాజ

**బుద్ధరాజు నరశింహరాజుగారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్.

( వాండ్రం, వుండిపోస్టు, భీమవరం తాలూకా, పశ్చిమ గోదావరిజిల్లా. )

శ్రీ రాజుగారు పశ్చిమ గోదావరిజిల్లా భీమవరం తాలూకా ఆయుర్వేద వైద్యమండలి అధ్యక్షులు. అనుభవముతో ప్రజారోగ్యమును కాపాడగలుగుతున్న వైద్యరాజు. వీరి ప్రజాసేవ దేశవ్యాప్తమైనది. బాపూజీ ఆదేశానుసారము కారాగారములలో మ్రగ్గి మారని మనస్సుతో యేకైక దృక్పదముతో కాంగ్రెస్ ఆశయములకు కట్టుబడి యుండువారు. ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి స్టాండింగుంమిటి సభ్యులు. ఆయుర్వేదమే ప్రజాక్షేమమునకు ప్రధానమైన వైద్యమని నమ్మి ప్రచార మొనరించుచున్న ఆయుర్వేద భక్తులు.

---

## నోటిపూత

సాధారణమైనా, అసాధారణమైనా, వెన్నతో క్రియాకల్పం వాడండి. ఎలాంటి నోటిపూతలైనా తగ్గిపోతాయి.



వైద్యశ్రీ, కవిరాజ
**వి. రామమూర్తిగారు**
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్.
(గోపాలపురం, గుడియాత్తం పోస్టు, ఉత్తరార్కాటుజిల్లా.)

ప్రముఖ విద్వద్వైద్యులు, వంశపారంపర్యా మేహము, కుష్ఠు, మేహమచ్చలు, ఎఱ్ఱపొడ, తెల్లపొడ, ఆస్త్మా, ఏనుగ కాలు, సవామేహ దోషములు, భగరంధ్రములు, మొదలగు దీర్ఘ వ్యాధులకు చికిత్స చేయుటలో నిపుణులు. ఆంధ్ర ప్రదేశ్ ఆయుర్వేదవైద్య పురోభివృద్ధి కారక్రమాలలో అడుగడుగున, అనుక్షణములోను పాల్గొంటున్న కవిరాజులు.

వీరు 1924 వ సంవత్సరము ఆగష్టు నెల 15 వ తేదీన జన్మించిరి. వీరి జన్మస్థానము గుడియాత్తము. శ్రీమాన్ ఆయుర్వేద పండిత వేణయ్య మహర్షి గారి తృతీయ పుత్రులు. వీరు చిన్నప్పటినుండి ఆయుర్వేద వైద్యములో చాలా నేర్పును పేరును సంపాదించిరి. చాలా ఉదార స్వభావులు.

1956 వ సం॥రం గుడియాత్తంనందే స్థిరనివాస మేర్పరచుకొని మేహకుష్ఠులు, మేహమచ్చలు, ఎర్రపొడ, తెల్ల పొడ, ఆస్త్మా, ఏనుగకాలు మొదలగు వ్యాధులకు చికిత్సచేసి బంగారు పతకమును, యోగ్యతా పత్రములను పొంది ప్రజానురంజకమైన వైద్యులుగా పనిచేయుచున్నారు.



(కవిరాజ్ పి. వెంగ్యాల్)
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్.
అగ్రహారం, గుంటూరు.

ప్రజారంజకమైన చికిత్సా పద్ధతులతో మూలికల ప్రభావమును గురించి రస, ఔషధముల ప్రయోగము అనుభవముతో చేయుచు మేహదోషములు, గనోరియా, ఉపదంశ మేహం, మొదలైన దీర్ఘ వ్యాధులను నివారింప చేయగల్గు సమర్థులు. గుంటూరు తాలూకా ఆయుర్వేద వైద్యమండలి ఉపాధ్యక్షులు. ఆయుర్వేదాభివృద్ధికి వీరి సహకారం పేరెన్నిక గన్నది. ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి స్థాయిసమితి సభ్యులు.

## ప్రాణాచార్యులు

గ్రామగ్రామాల్లోను అనుభవముతో ఆయుర్వేద చికిత్సలు జరపి ప్రజారోగ్యమును సంరక్షిస్తున్న వైద్యులే ప్రభుత్వ పోషణలేని ఆయుర్వేదాన్ని సంరక్షిస్తున్నారు. ఇట్టిప్రాణాచార్యుల అనుభవాలు చరిత్ర ప్రసిద్ధం చేయనిచో ఆయుర్వేదమే లేదని మీకు తెలుసా ?

## సలహా

ఎలాంటి దీర్ఘవ్యాధులకైన్నా, సాధ్యసాధ్యము, అసాధ్యము, అని చెబుతూ ఔషధ నిర్ణయము చేయవలసినచో చేయుచు స్పష్టమైన అభిప్రాయం వెల్లడించగల సంస్థ ఆంధ్రప్రదేశలో ఆయుర్వేద శాస్త్ర సమ్మతమైనది గలదని మీకు తెలియునా? తెలియనిచో వెంటనే ఈక్రింది విలాసమునకు వ్రాసి తెలిసికొండి. కోరినవారికి రోగ నిర్ణయపత్రము పంపబడుతుంది వివరములకు వ్రాయువారు 15 నయాపైసలు పోస్టుబిళ్ళలు పంపండి. కవిరాజమోహన్, ఆంధ్రప్రదేశ ఆయుర్వేద చికిత్సా సహకార సంఘం, గాంధీనగరం, విజయవాడ-2.



వైద్యరాజ
పరిటాల లక్ష్మీకాంతరావుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్.
( జగ్గయ్యపేట, కృష్ణాజిల్లా. )

శ్రీ లక్ష్మీకాంతరావుగారు మూలికావైద్య నిపుణులు. శస్త్రచికిత్స జరగందే ముక్తిలేదని వాదించే వ్యాధులను నివారించు ఆదర్శ వైద్యులు. ఎలాంటి గడ్డువ్రణములనైనా గ్రంథులనైనా మూలికలతో పసర్లతో కరిగించి, మాన్పించి, ఆశ్చర్యకరమైన చికిత్సలు జరుపువారు. అనుభవ వైద్యులలో అందివేసినవారు. వీరు కృష్ణాజిల్లా ఆయుర్వేద వైద్య మండలి కార్యవర్గ సభ్యులు. జగ్గయ్యపేట పట్టణ ఆయుర్వేద వైద్యమండలి కార్యదర్శి.

## అహంకారం

నేను గొప్పంటే నేను గొప్ప అనే అహంకారం ఆయుర్వేదాభివృద్ధినిగోరేవారు వదలండి. అదే మీ సేవకు ప్రథమ సోపానం.



వైద్యశ్రీ
కవిరాజ వై. వెంకటరెడ్డిగారు.
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్
( పెరుమాళ్ళపల్లె, చిత్తూరు జిల్లా )

శ్రీ వెంకటరెడ్డిగారు ప్రజారంజకమైన చికిత్సాపద్ధతుల ననుసరించి, ఆయుర్వేద ప్రభావము నిరూపించుచుందురు. భారత ప్రాచీనవైద్యమైన ఆయుర్వేదం స్వతంత్ర భారతంలో ప్రధానవైద్యంగా పరిగణింపబడాలని ఆకాంక్షించే వారిలో నొకరు.

## శీతాకాలంలో

ఒడలు పగులువారుట బిరబిరలాడుట అనగా మృదుత్వము లేకుండుట, పైత్యాది దోషముచే నోటిపూత, పగులుట శరీరములో అరచేతులలో పొరలు ఊడుట, ఇత్యాది అనేకములైన పైత్యరోగములకు "క్రియాకల్పం" అమృతతుల్యంగా పనిచేయగలదు. దేశంలో నూటికి నూరుపాళ్ళు విజయము పొందుచున్న క్రియాకల్పం సేవించండి. వయోభేదములు లేకుండా వాడదగును. వైద్యులకు 10 తులములు రు 5 లు. ముందుగాపంపాలి. వి. పి. పద్ధతి లేదు.

క్రియాకల్పం ఔషధశాల,
గాంధీనగరం :: విజయవాడ-2.



వైద్యరాజ
కారుమూరి కోటేశ్వరరావుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
(చాగల్లు, పశ్చిమ గోదావరి జిల్లా.)

శ్రీ కోటేశ్వరరావుగారు ఆయుర్వేద ఔషధములు స్వయముగా తయారుచేసికొనుటలో ప్రసిద్ధులు. స్వయంశక్తితో వారు పొందిన ప్రయోజనములు ఔషధ ప్రభావములు చాటి చెప్పుచు సాటి వైద్యలోకానికి ఔషధములు సరఫరాచేయు సంకల్పము గలవారు. చికిత్సా పద్ధతులు పూర్తిగా తెలిసియున్నవి. వీరు ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి స్టాండింగుకమిటి సభ్యులు, కొవ్వూరు తాలూకా ఆయుర్వేద వైద్యమండలి కార్యదర్శి.

## నేత్రదోషములు

కన్నులు మంట, పోటు, నీరుకారుట, పుసికట్టుట, వాపులు, తగ్గించుటకు క్రియాకల్పం - పటికబెల్లం, వెన్నలతో చేర్చి వాడించండి. సాధారణ దోషములన్నియు పోగొట్టును.



స్వామి యోగచిదానంద సరస్వతీజీ
(పెనుగొలను, తిరువూరు తాలూకా, కృష్ణాజిల్లా.)

వీరు భారతదేశమంతయు పర్యటించి వచ్చినవారు. ఆధ్యాత్మిక తత్వవేత్తలు. దేశంలో వైద్యసహాయంలేని ప్రాంతములలో నివసించుచు యే ధనాపేక్షలేని చికిత్సలు జరుపుచుందురు. వీరి ఆశయసిద్ధికి మూలికావైద్యము యెంతో ప్రతిభ కల్గించిందని మూలికా పరిశోధన బాగుగా జరుగాలని ప్రతిసభలో ప్రసంగించుతూ తమ అనుభవములు వివరించుచుందురు. వీరు ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి స్టాండింగుకమిటి సభ్యులు.

## చెవిపోటు

క్రియాకల్పం పేరిన నెయ్యితో వాడుతూ, నువ్వులనూనెలో క్రియాకల్పం కలిపి చెవి రంధ్రములో వేయండి. చెవిపోటు చీముకారుట ఒరుపు పోతుంది.

## గుండెలో మంట, త్రేపులు

పైత్యాజీర్ణమువల్ల క[illegible] గుండెమంట, పుల్లత్రేపులు నివారించుటకు క్రియాకల్పం [illegible] మందు. అందరు అన్ని వేళలలో వాడదగును. [illegible]ర్వేదం ప[illegible]జారంజక మనుట కీర్తి తారా[illegible]ణము.



వైద్యశ్రీ కవిరాజ

వైద్యం నారాయణస్వామి నాయుడుగారు

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

(కంబదూరు, కళ్యాణదుర్గ తాలూకా)

శ్రీ నాయుడుగారు అనుభవముతో ఆయుర్వేద చికిత్సా పద్ధతులు ప్రజారంజకముగా అమలు జరుపుదురు. అసాధ్యము లైన రోగములు నివారించుటలో సుప్రసిద్ధులు. ఆయుర్వేద శాస్త్రరీత్యా నేత్రవైద్యము చేయుటలో నిపుణులు. అనంత పురం జిల్లాలో ఉన్మాదరోగ చికిత్సలు వీరివద్దనే అధికముగా పొందుచుందురు.



వైద్యశ్రీ కవిరాజ

ఉద్దంటి సుదర్శనంగారు

సుదర్శన ఆయుర్వేద నిలయము

సత్తెనపల్లి, గుంటూరుజిల్లా.

శ్రీ సుదర్శనంగారు విద్వద్వైద్యులు, గొప్ప అనుభవము గలవారు. దేశవ్యాప్తంగా వారి ఆయుర్వేద చికిత్సలు అంద జేసి బహురూపములలో ప్రత్యేకత సంపాదించుకొన్నారు. వీరి అభిమాన వైద్యము అసాధ్యరోగములు. ఎవరికి కొలుకు వడని రోగాలు యేవైనా అనుభవముతో నివారింపచేయగల్గు తారు. వీరికి తెనాలిలో శ్రీ పంచముఖాంజనేయ వీధిలో కూడా ఒక వైద్యశాల వున్నది.

## నిద్రలో మూత్ర విసర్జన

బహుకాలంగా ప్రతిదినము రాత్రి నిద్రపోవు నప్పుడు మెలకువలేని స్థితిలో కలుగు మూత్ర విస ర్జనకు ఎన్నో చికిత్సలుపొంది, కుదరదని నిరాశచెం దిన రోగులు "క్రియాకల్పం" సేవనలో కృతకృత్యు లౌతారు. సర్వప్రజానీకానికి అందుబాటైన ఔష ధంలో యీ ప్రభావంకల్గి యుండుట ఆయుర్వే దానికి అలంకారం.

## రక్తమొలలు

—:(o):—

ఆపరేషనులేకుండా మూలరోగములలోజనించు రక్త మొలలబాధ విధిగా నివారింప చేయగలదు. "క్రియాకల్పం" పేదవారికికూడా అందుబాటైన ఔషధం వైద్యులు పరిశీలించండి.



వైద్య శ్రీ, కవిరాజ

**తాతపూడి సుబ్రహ్మణ్యంగారు, B. A. L. T.**

పెంటపాడు.

శ్రీ సుబ్రహ్మణ్యంగారు బహుశాస్త్రపరిశోధకులు. వైద్య శాస్త్రములు వారికభిమానము గలవి. దేశంలో అంటు వ్యాధుల ప్రాబల్యముజూచి విస్తుపోతారు. అట్టి ఆవేదనా ఫలితమే వారు "అంటువ్యాధులు" అనే గ్రంథం వ్రాయుటకు కారణం. ఆగ్రంథాన్ని భారతప్రభుత్వం గుర్తించి రు 500 లు బహూకరించింది.



ఆయుర్వేదప్రవీణ, ఆయుర్వేదభిషక్

**డా. టి. సత్యనారాయణమూర్తిగారు**

ఆలవలపాడు, వయా మేదరమెట్ల, ఒంగోలుతాలూక.

వీరు 1937 వ సం॥రం శ్రీ రామమోహన ఆయుర్వేద కళాశాలయందు ప్రవేశించి 4 సంవత్సరములు చదివి ఆయుర్వేద ప్రవీణ, ఆయుర్వేదభిషక్, వైద్యవిద్వాన్, విశేజీ వైద్య మొదలగు పరీక్షలయందు కృతార్థులైరి. అప్పటినుంచి ఆయుర్వేదాభివృద్ధికిగాను అద్దంకిలో ఫిర్కామండలి నేర్పరచి కొంతకాలము సెక్రటరీగా పనిచేసిరి. పిమ్మట మహామండలి ఆదేశానుసారము తాలూకామండలి నేర్పరచి, దానికి ప్రధాన కార్యదర్శిగా యెన్నుకోబడి ఆయుర్వేదాభివృద్ధికి పాటుపడుచున్నారు.



శ్రీమాన్ వైద్యశ్రీ

**రొంపిచర్ల హనుమాచార్యులుగారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు,

వల్లభి, ఖమ్మంజిల్లా.

శ్రీ హనుమాచార్యులుగారు విద్వైద్య కుటుంబమునకుచెందిన ప్రముఖ ఆయుర్వేద వైద్యులు. వీరిలోగల వినయ విధేయతలు ఆదర్శమైనవి. ప్రజాహృదయాన్ని గుర్తించి ఉదారబుద్ధితో చికిత్సలు జరుపుతున్నవారు ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి సభ్యులు. నిరంతర ఆయుర్వేద ప్రచారకులు.



విశాఖపట్నంజిల్లా ఆయుర్వేద మండలి ప్రముఖ కార్యకర్తలు శ్రీయుతులు పంతుల ఉమామహేశ్వరరావు, నాగం అప్పారావు, బి. బసవరాజు, బి. వేణుగోపాలరావు, జగన్నాధం, అప్పలస్వామిగార్లతో శ్రీ మోహన్ సమావేశము.





శ్రీ కవిరాజ స్వామి ప్రజ్ఞానానందజీ విజయవాడ విచ్చేసిన సందర్భములో స్వాగతమిచ్చినప్పటి చాయాచిత్రము.





ది 28-12-56 వ తేదీని వుభయరాష్ట్ర మండలిలు విలీకరణ మొనరించిన సందర్భములో హైదరాబాదు ప్రతినిధులతో మరికొందరు కార్యకర్తలతో తీయబడిన చాయాచిత్రము. పుష్పగుచ్ఛములు చేతబట్టియున్నవారు అధ్యక్షులు ఆయుర్వేదాచార్య పండిత శ్రీవి.టి.వి. రామానుజస్వామి, ప్రధానకార్యదర్శి శ్రీ కవిరాజ మోహన్.

## కవిరాజ్, వైద్యవిద్వాన్
# శ్రీ వెణుతురుపల్లి కాపరాజుగారు
### జీవిత సంగ్రహము



వీరు విశాఖపట్నంజిల్లా వార్లపూడిగ్రామ కాపురస్తులు. ఆర్వేలనియోగి కుటుంబమున 1914 సం॥ రం మార్చి 22వ తేదీని సావిత్రీ సత్యనారాయణ పుణ్యదంపతులకు ద్వితీయ పుత్రులుగా జన్మించిరి. వీరిది పెద్ద కుటుంబము. యీకుటుంబములో పెక్కుమంది ఆంగ్లవైద్య పట్టములుపొంది పేరు సాగించిన చికిత్సకులుగా నున్నారు.

వీరుమాత్రము అవకాశములేకనేమి అనువంశికమైన ఆయుర్వేదమునందలి గాఢాభిమానముచేనేమి స్వీయవృత్తికై ఆయుర్వేదమునే చేపట్టిరి. శాస్త్రమునకు అనుభవమును జోడించి ప్రజారంజకముగా చికిత్సచేయచూ "అమృతహస్తు"లనియు, "చేతి చలువకలవా"రనియు, «వీరికి సాధ్యముకాని రోగమైనచో విశాఖపట్నం కె. జి. ఆస్పత్రికి పోవలెనేకాని ఇతరులు చేయజాలర"ను ప్రజావిశ్వాసమును, అనురాగమును బడసియున్నారు. పేదసాదల కష్టసుఖములరసి చికిత్స చేయుటయేగాని ఆర్థిక లాభమునకై చూచువారుకాదు. ఈవైద్యము వీరికి వృత్తియనుటకంటె హాబీ (ఆయుర్వేదాభిమానము) అనుట చెల్లును. ఏమన ఇన్నాళ్లనుంచి వృత్తిచేయుచున్నను వైద్యము వలన సంపాదించినది ఇప్పటికిలేదు. వీరు కేవలము ప్రజావైద్యులు.

1945 జూన్‌లో బెంగాల్ రాష్ట్రమున కవిరాజ వైద్యులుగా రిజిష్టరు పట్టా పొందిరి. 1944 సం॥మున బీహారు గవర్నమెంటుచే రిజిష్టర్డు, రికగ్నైజ్‌డు అండ్ ఎయిడెడు హోమియో కళాశాల పరీక్షకు ప్రయివేటుగా పరీక్షనిచ్చి హెచ్. యం. డి. యస్. అను డిగ్రీని పొందియుండిరి. హోమియో ఆయుర్వేద వైద్యములు రెండింటియందు ప్రవేశమున్నందుననే ఎక్కువ పేదప్రజలకు ఉచితచికిత్సలు, స్వల్పవ్యయ చికిత్సలు యివ్వగలుగు చున్నారు. 1956 లో వైద్యవిద్వాన్ పట్టమును పొందియుండిరి.

ఆంధ్రప్రదేశ్ ఆయుర్వేద మహామండలియందు, కవిరాజ్ మాస పత్రికయందు అనుపమానమైన అనురాగము కలవారు. పత్రికాభివృద్ధికి ప్రారంభమునుంచీ యథాశక్తిని సహకరించుచున్నారు. ఆయుర్వేద మండలిలో 1955 అక్టోబరునుంచి నేటివరకు రాష్ట్రసంఘ కార్యనిర్వాహకవర్గ సభ్యులుగా వుంటూ, విశాఖజిల్లా, శ్రీకాకుళంజిల్లాలలో పలువిషముల ప్రచారమొనర్చి పెక్కుమంది వైద్యులను మండలిలో సభ్యులుగా చేర్పించుటయేగాక అధికవ్యయప్రయాసలకోర్చి తామె కన్వీనరుగానుండి 1957 జనవరి 6వ తేదీని అనకాపల్లిలో విశాఖపట్టణంజిల్లా ఆయుర్వేద మహాసభ జరిపించి జయప్రదముగా నిర్వహించి విశాఖజిల్లా ఆయుర్వేద మండలిని స్థాపించుటకై ఏర్పాటుచేసిరి. ప్రస్తుతం విశాఖజిల్లా ఆయుర్వేద మండలి ఉపాధ్యక్షులుగా వుంటూ కార్యకర్తలకు ఓపినంత సహకరించుచున్నారు.

వీరికున్న ఆయుర్వేదాభిమానమునకు, ఆయుర్వేద విజ్ఞానమునకు, ఆయుర్వేద మహామండలి, గ్రామప్రజలు ఇంకను ఎంతో ఉపకారములు పొందవలసి నప్పటికి విధివిలాసముచే వీరు పుట్టుకనుండియు కంటిజాడగుటవలన తగినంతసేవ చేయలేక పోవుచున్నారని వారెంతయో చింతించుచుందురు.

ఇట్టి పరిస్థితిలో నుండియు ఇంతటి అభిమాన గౌరవములు ఆయుర్వేదమునందు వీరికి కలిగినపుడు సంపూర్ణ దార్ఢ్యము కల్గినచో ఎంతటి ఆయుర్వేదసేవ చేసియుండెడ వారో!

ఈ పరిస్థితిలో నున్నప్పటికిని ప్రభుత్వము వీరి సేవను గుర్తించి అవసర సహాయ మొనర్చినచో అనగా తగిన ఔషధములు సంచారమున కనువైన వాహనము ఒక్క సహాయకుని ఒసగినచో నాల్గయిదు గ్రామములకు నిరాఘాటముగా ప్రజాసేవ యొనర్చు కుతూహలము శక్తి కలదని నుడువుచున్నారు. ఇట్టి స్వార్థరహితుల సేవను ప్రభుత్వము గుర్తించి సద్వినియోగ మొనర్చి ప్రజారోగ్యమునకు సాయపడుదురుగాక! వీరి సోదరు లొకరు "శాడర్లె" కంపెనీయందు, మరొకరు «మే అండ్ బేకర్» కంపెనీయందు తగిన హోదాలలో నున్నారు. శ్రీ ధన్వంతరి వీరిసేవ చిరకాలము ప్రజల కొసగుగాక!





ది 28-5-57వ తేదీని జరిగిన శ్రీకాకుళం జిల్లా ఆయుర్వేద వైద్యమండలి ప్రారంభోత్సవ సభా సందర్భములోని ఛాయా చిత్రము. ఆయుర్వేద మహోపాధ్యాయ పండిత శ్రీ తి. ప. రామానుజస్వామి, శ్రీ కవిరాజమోహన్, శ్రీ పంతులఉమామహేశ్వరరావు, శ్రీ నాగం అప్పారావు శ్రీ బి. బసవరాజు, శ్రీఈశ్వర వెం. సూర్యనారాయణమూర్తి, శ్రీ దార్లపూడి రామబ్రహ్మం మొదలైనవారితోగల ఛాయా చిత్రం.

*　　*



ది 30-5-57 న విజయవాడకు దయచేసిన కేంద్ర ఆరోగ్యశాఖ ఆయుర్వేద సలహాదారులు కవిరాజ ప్రతాపసింహాజీతో శ్రీ కవిరాజమోహన్, కవిరాజ యం. ఎ. సుభాన్, డా. నంబూరి హనుమంతరావు గార్లు.

*　　*



గుంటూరుతాలూకా ఆయుర్వేద మండలి ప్రధాన కార్యకర్తలు శ్రీయుతులు శిరిపురపు శేతుమాధవరావు, యం. ఎ. సుభాన్, తులం పానకాలరావు, యజ్జ వెంకటనరశింహారావు, శివరామ ప్రసాదు గార్లతో శ్రీ కవిరాజ మోహాన్.



వైద్యశ్రీ
గొట్టిపాటి వెంకటనరసయ్యగారు,
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్,
పెదకళ్లేపల్లి P. O. దివితాలూకా
కృష్ణాజిల్లా.

వీరు 20-9-1930 సం॥రంలో జననమైనారు. శ్రీ వెంకట నరసయ్యగారు ప్రజాసేవా తత్పరులు. 1949 సం॥రంలో "పశువైద్యాచార్య" కోర్సులో ఉత్తీర్ణులైనారు. రైతాంగ విద్యాలయంలో 1953 సం॥రంలో హోమ్‌నర్సింగులో, శిక్షణ పొందినవారు. శ్రీ రంభాపురీ శివరామ పశువైద్యశాలను స్థాపించినారు. H. M. P. C. & P. కోర్సులో ఉత్తీర్ణులై డిప్లొమా పొందుట, 1955 సం॥రంలో H. M. D. కోర్సులో ఉత్తీర్ణులై డిప్లొమా పొందుట 15వ ప్రకృతి వైద్య శిక్షాశిబిరములో శిక్షణయు పొందిరి. 1956 సం॥రంలో కృష్ణాజిల్లా కలక్టరుగారిచే హోమియోపతి మెడికల్ ప్రాక్టీషనరునిగా రిజిస్ట్రేషను పొందినారు. 1957 సం॥రంలో అఖిలాంధ్ర పశుధనరక్షణి పరిషత్ కమిటీ ప్రెసిడెంటుగా ఎన్నుకోబడిరి. శ్రీమంతు రాజా అంకినీడు ప్రసాద్ బహద్దర్ పుస్తకభాండాగారము కమిటీ ప్రెసిడెంటుగా ఎన్నుకొనబడిరి. తే 8-9-57 పెద కళ్లేపల్లి మణేగారుగా డిప్యూటీ కలక్టరుగారిచే నిర్ణయింపబడిరి.

ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి ప్రాథమిక సభ్యులుగా ఆమోదపత్రము పొందినారు. మరియు వీరు రైతులోక బాంధవులు. శ్రీ ఆచార్య రంగాగారి అధ్వర్యమున నడుపబడిన రైతాంగవిద్యాలయములో శిక్షణపొంది దివి తాలూకా కృషికార్ లోక్‌పార్టీ కమిటీసభ్యునిగా ఎన్నుకోబడినా[illegible] శితిసమునసే జప [illegible]గా విజ్ఞానం సముపార్జించి ప్ర[illegible]తిలను సంపాదించ[illegible]న్నారు.





కవిరాజ పత్రికా ముద్రాపకులు, కార్యాలయ గౌరవోద్యోగులు శ్రీయుతులు బి. వి. కృష్ణమాచార్యులు, ఎ. గోపాలరావు, ఆర్. మధుసూధనరావు, ఎ. శోభనాద్రి మొదలైనవారు.

## తలపోటు

—:o:—

పైత్య ఉడుకుచే యేర్పడిన ఎటువంటి తలపోట్లకైనా క్రియాకల్పం గొప్పగా పనిచేస్తుంది. వాడి సంతృప్తి పొందండి.

# ఆయుర్వేద పురోభివృద్ధి

( 76వ పేజీ తరువాయి )

అందు ఆయుర్వేదాభివృద్ధి కొఱకు 2 - 3% మాత్రమే. ఈవిధముగా మునుపటి పంచవర్ష ప్రణాళిక మనలను నిరాశ చేసింది. ఇక రెండవ ప్రణాళిక నడుస్తోంది. అందు ఆరోగ్యశాఖకు 262 కోట్ల రూపాయలు నిర్ణయించ బడ్డాయి. ఇది ముఖ్యముగా లాభదాయకము అల్లోపతి వైద్యులకు, పట్టణ ప్రజలకు, ధనవంతులకు మాత్రమే అగుచున్నది. నా అభిప్రాయం ప్రకారం ఆసొమ్ములో అధమము నాల్గవవంతైన వినియోగించినచో తప్పక ఆయుర్వేదము ఉన్నతస్థాన మలంకరించి అల్లోపతితో సరితూగగలదు. నా యీ మాటలు అతిశయోక్తి కావు, ఆధారరహితములు కావు. శ్రీ మొరార్జి దేశాయిగారు బొంబాయి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు చెప్పిన విషయం. "అల్లోపతికై గవర్నమెంటు వెచ్చించు సొమ్ములో 1/4 వంతు, వారు దానియెడల చూపుతున్న శ్రద్ధలో 1/10 వంతు చూపితే కొద్దిసంవత్సరములలో ఆయుర్వేదము ఉన్నతస్థితికి రాగలదన్నారు.

ఆయుర్వేదము ఎక్కువ ప్రజల నాకర్షించి యున్నదని ఇదివరకే చెప్పివున్నాను. ఆయుర్వేద వైద్యము యెంత చవుకగా లభించుచున్నదో, ఎట్లు బీదప్రజానీకమునకు అందు బాటులో నున్నదో ప్రభుత్వము గుర్తింపలేకున్నది. గవర్నమెంటు హెల్తుసర్వే శక్రటరీ - డాక్టర్ క. యిరజాగారు చెప్పినట్లుగా అల్లోపతి వైద్యులు ఒకరోగిని పరీక్షించుటకు, వాని రోగనిర్ణయము చేయుటకు, మలపరీక్షఅని, మూత్ర పరీక్షఅని, రక్తపరీక్ష, X-ray మున్నగు పరీక్షలు చేయవల యునని ఎంత సొమ్ము దుర్వ్యయము చేయుచున్నారో కదా! వారు నియమించు ఔషధములకు ఎంతసొమ్ము అగుచున్నదో? ఇది ఒక ధనికవర్గమునకు మాత్రమే అందుబాటు అగుచున్నది. కనుక ప్రభుత్వము ఇది గమనించి రెండవ పంచవర్ష ప్రణాళికలో నియమింపబడ్డ 262 కోట్లకు అధమము ⅛ వంతైన ఆయుర్వేదమునకు ఖర్చుపెట్ట గోర్తాము. అందుకు సంబంధించిన స్కీములు ఇదివరకే ఇవ్వబడ్డాయి. అవుసరమైతే మరల మా అఖిలభారత కాంగ్రెసువారు అందజేయగలరు.

## పరిపాలనావిధానము

ఆయుర్వేదాభివృద్ధికై రాష్ట్రప్రభుత్వములవారు 1921లో పాల్గొన్నారు. అప్పటినుండి వారు ఆయుర్వేద పాఠశాలలు, ఆసుపత్రులు, ఫార్మశీలు నెలకొల్పుతూ నేఉన్నారు. కాని అవి అల్లోపతి అభిమానుల చేతులలో ఉంచుటచే వారు వానిని సవతితల్లి ప్రేమతో లాలించుచున్నట్లు నటించి వారి విధానములకే దోహద మిచ్చుకొనుచున్నారు. అందుచే ఈ పరిపాలక వర్గమునకు ప్రత్యేక డైరెక్టరులను ఏర్పరచుటకు మా కాంగ్రెసువారు, తదితరసంస్థలు పాటుపడ్డాయి. చివరకు ప్రత్యేక శాఖలతో కేరళ, మద్రాసు, యు. పి. పంజాబ్, ఆంధ్రలలో ఏర్పరుపకల్గాయి. బొంబాయి, రాజస్థానము, మధ్యప్రదేశ్‌లలోకూడ నిర్ణయమయాయి; ఇక బెంగాలు, ఒరిస్సా, బీహారు మైసూరు, జమ్ము, కాశ్మీరు, నేపాలు ఇత్యాది ప్రాంతములలో నెలకొల్పబడాలి. ఆయుర్వేదమును భారత ప్రభుత్వములో ఒకప్రత్యేకశాఖ చేస్తేనే కాని దీనికి అభివృద్ధి కలుగదు. కనుక ఆయా ముఖ్యమంత్రులను, పరిపాలకులను, మరియు భారతప్రభుత్వము వారినికూడ మా శాఖకు ప్రత్యేకముగా డైరక్టరుల నియమింప వలసినదిగా కోరుచున్నాను.

## ఆయుర్వేదశిక్షణ

మొదట ఆయుర్వేదాభివృద్ధికి, దాని పూర్వపు ఔన్నత్యమును చెందవలెనంటే ఆయుర్వేదముబాగుగా నేర్చినవారు అవసరము. ప్రస్తుతములో ఆయుర్వేద శాస్త్రమునకు ఒక ప్రత్యేకమైన పాఠ్యక్రమము, ఒక ప్రణాళిక తయారు కాబడి యుండలేదు. 1951వ సంవత్సరము తరువాత అవితయారుచేయుటకు ఒకకమెటీని నియమింపగా వారు ఒక త్రోవ, తెన్ను లేనివి, ఒకదానికొకటి పరస్పర సంబంధములేని సూచనలనిచ్చి యున్నారు. ఎక్కువగా ఆ కమెటీలో అల్లోపతి



ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి ది 28-12-56న విజయవాడలో మద్యపానశాఖామాత్యులు గౌ॥ శ్రీ మందుముల నరశింగరావుగారిని సన్మానించిన సందర్భములో శ్రీ మోహన్ సన్మానపత్రము సమర్పించుట.

వైద్యులనే, అల్లోపతి వైద్యుని ఛైర్ మెన్ గానే ఏర్పరచారు. అట్టివారికి ఆయుర్వేదముపైకంటే అల్లోపతియందు ఎక్కువ అభిమానముకలదని చెప్పుటలో అతిశయోక్తి ఇంచుకయులేదు. కీరి ప్రణాళికల ననుసరించి విద్యార్థులను తయారుచేయవలెనన్నచో ఒక క్రమపద్ధతిలో పాఠ్యక్రమ విషయములు మన్నగునవి ఏర్పరచి యుండలేదు. వారికి కావలసిన ప్రవేశ విద్యార్హతలో కూడ ఒక రాష్ట్రమునకు, మరియొక రాష్ట్రమునకు సంబంధములేదు. మెట్రిక్యులేషన్, ఐ. యస్. సి, సంస్కృతములో మాధ్యమికపరీక్ష, ప్యాసయి ఇంగ్లీషు భాషానుభవము కలవారిని, సంస్కృతములో ప్రవేశపరీక్ష ప్యాసయినవారికి ప్రవేశార్హత కలిగియున్నట్లుగా నిర్ణయింప బడినవి.

ఒరిస్సా, బెంగాలు, బీహారు, ఆంధ్ర, మద్రాసు యుపి రాష్ట్రములలో క్రొత్తవిధానములలోను, పాతవిధానముల లోనుకూడ పరీక్షలు జరుపబడు చున్నవి. కాని అన్ని ప్రాంతములవారికి యూనివర్సిటీవారే పరీక్షాపాఠ్యక్రమములను ఏర్పరచు చున్నారు. ముఖ్యముగా హిందూయూనివర్సిటీ, బొంబాయి యూనివర్సిటీ, పంజాబు, నాగపూరు, మద్రాసు యూనివర్సిటీలవారే ఈపరీక్షలను జరపుచున్నారు. ఈ యూనివర్సిటీలవారు ఈ పరీక్షలు జరుపుచున్నప్పటికిని వారిలో కూడ ఒక పాఠ్యక్రమమును నిర్ణయింపబడి యుండలేదు. ఇవిగాక కొన్ని ప్రత్యేక సంస్థలు వారివారి యిష్టముల ప్రకారం పరీక్షలు జరుపుచున్నారు. అందు మన అఖిలభారత ఆయుర్వేద కాంగ్రెసువారుకూడ యిట్టిపరీక్షలు జరుపుచున్నారు. ఇవిగాక కొన్నిసంస్థలు కొన్ని అబద్ధపు పరీక్షలు జరుపుచు ధనము నార్జించుచున్నారు. వారే ధనము నపహరించి డిప్లమోలు, డిగ్రీసర్టిఫికెట్టుల నిచ్చుచున్నారు. బోర్డువారు నడపు పరీక్షలు సంస్కృతములోనో, ఇంగ్లీషులోనో లేక వారి ప్రాంతీయ భాషలలోనో జరుపుచున్నారు. వీని నన్నింటిలోను ఏవో కొన్నిమాత్రమే రాష్ట్రప్రభుత్వము వారిచే రికగ్నైజు చేయబడినవి. రాష్ట్ర రాష్ట్రమునకుకూడ ఈ పరీక్షా ప్రణాళికలు మారుచున్నవి. బెంగాలు వారు "తీర్థ" పరీక్షలను, ఒరిస్సా, బీహారులలో "ఆచార్య" పరీక్షలు, మద్రాసులో "శిరోమణి" పరీక్షలు, బొంబాయిలో "శుద్ధఆయుర్వేద" పరీక్షలను నడపుచు ఒక్క ఆయుర్వేదములోనే శిక్షణ గరుపబడుచున్నవి.



కవిరాజపత్రిక చతుర్థ జన్మదినోత్సవ సమయమున, కృష్ణాజిల్లా ఆయుర్వేద వైద్యమండలి యాజమాన్యమునజరిగిన సన్మానసభలో శ్రీ కవిరాజ మోహన్ గారికి మంత్రతీర్థ వైద్యప్రవీణ శ్రీ ఇలిపిర్ల అప్పారావుపాత్రుడుగారు రు 116లు నూతనవస్త్రములు బహూకరించుట.

కాని రాష్ట్ర ప్రభుత్వములచే నడుపబడుచున్న ఇనిస్టిట్యూషనులలో ఆయుర్వేదము, పాశ్చాత్య వైద్యములలో కూడ శిక్షణ యిచ్చుచున్నారు. పరీక్షాకాలము ఆయా పరీక్షల ననుసరించి, ఆయా రాష్ట్రములలో నాలుగు మొదలు పదిసంవత్సరముల గడపులో జరుగుచున్నది. వారు వారు ఇచ్చుచున్న బిరుదులకు ఎట్టి సంబంధములు నిర్ణయింపబడి యుండదు. వాని వాని ప్రత్యేకతలు వేరు వేరుగానే యుండును. వాని వాని ప్రవేశార్హతలు, వయోపరిమితి, పరీక్షాకాలములలో ఒకదానికొకటి సౌష్టవములో నిర్ణయింపకుండుటచే వారిలో వారికి వారి వారి ఆధిక్యతలను చాటుకొనుటకు, పోరాటములు సలుపుకొనుటకు అవకాశములు కల్గియున్నవి. ప్రాచీన పద్ధతులలో తయారయిన వైద్యులు వారి ఆధికత్యతను చూపుచున్నారు. మరియు ప్రస్తుత ప్రణాళికల ననుసరించి ఆయుర్వేద శాస్త్రమును, పాశ్చాత్య వైద్యశాస్త్రములుంకూడ నభ్యసించినవారు వారి వారి ఘనతలను వెల్లడి చేసుకొనుచున్నారు. ఇట్లు ఒకవిధమైన పునాది కట్టుబాటు లేక వారిలోవారికి భిన్న భిన్నాభిప్రాయములకు అవకాశము కల్గుచున్నది.

ఇట్లు ఒక నిర్ణీత ప్రణాళికలు లేకపోవుటచే ఎవరు అండరు గ్రాడ్యుయేటు తరగతికి చెందినవారో, ఎవరు పోస్టు గ్రాడ్యుయేటు తరగతికి చెందినవారో నిర్ణయించ సావకాశము లేకున్నది. మరియు వారి వారి అర్హతల ననుసరించి ఇతర రాష్ట్రములకు విద్యోన్నతికై పంపశక్యము లేకున్నది. ఆసుపత్రులలో ఒక నిర్ణీతములైన శాస్త్రరీతులలో తయారుకాబడిన ఔషధములు లభ్యముగుట లేదు. అందుచే ఒక నిర్ణీతములైన ప్రణాళికల ననుసరించి వైద్యులు తయారగునట్లు ప్రణాళికలు తయారు

చేయవలయును. ఒక ఇండియన్ మెడిసిన్ కౌన్సిలు ఏర్పడినకాని అట్టి నిర్ణీత ప్రణాళికలు తయారగుట కష్టము. అట్టిది ఏర్పడినకాని ఆయుర్వేదాభివృద్ధి కాదు. అట్టి మెడిసన్ కౌన్సిలు భారత ప్రభుత్వమువారు కనుక పాశ్చాత్యులై వైద్యులను మెంబర్లుగాను, పాశ్చాత్య వైద్యునే ఛైరుమెన్‌గాను నిర్ణయించిన ఇక ఆయుర్వేదాభివృద్ధికి మార్గము శూన్యము. అందుచే ఏర్పడనున్న ఇండియన్ మెడిసన్ కౌన్సిలున్ ఆయుర్వేద పండితులతోనే నియమించుచు, ఆయుర్వేదాభివృద్ధికి వలయు విషయములపై వారికే బాధ్యత ఇవ్వవలసినదిగా భారత ప్రభుత్వమువారిని కోరుచున్నాను. ఈ విషయములో ఆయుర్వేద పండితులు అనగానే శుద్ధఆయుర్వేద పండితులు, మిశ్రమ ఆయుర్వేద పండితులు అను భేదము తప్పక జనించకలదు. కాని నా దృష్టిలో ఒకరిది శుద్ధాయుర్వేదమనియు, మరి ఇంకొకరి ఆయుర్వేదము అపరిశుద్ధమైనదనియు లేదు. ఈ భేదము బొంబాయి స్టేటులో ఉద్భవించినది మాత్రమే. అనగా కొన్ని అల్లోపతి వైద్యవిధానములను ఆయుర్వేద శాస్త్ర విషయములలో మిళితము చేసి ఈ భేదమును మొదట బొంబాయి రాష్ట్రములో తీసికొనివచ్చారు.

అది క్రమక్రమముగా ఇతర రాష్ట్రములకూడ ఎగబాకినది. ఇట్టి శాస్త్రములపై తయారుకాబడిన వైద్యులు అటు ఆయుర్వేదశాఖకు, మరి ఇటు అల్లోపతిశాఖకుకూడ చెందినవారు కాకుండా మెలగుచున్నారు. మొరార్జీదేశాయిగారు ఈవిషయముపైనే కొంత ఆక్షేపణ చేయుట జరిగింది. వారిని అల్లోపతి వైద్యులుగనే పరిగణించవలెనన్న అందు వారికి విశిష్ట జ్ఞానము మృగ్యము. అందు వారికి ఒక ప్రధాన విషయములలో మాత్రమే ప్రవేశ మివ్వబడును. కనుక ఎట్టి ఇన్స్టిట్యూషనులోనైనను ఆయుర్వేదమునకే ప్రాముఖ్యత ఇవ్వవలసియున్నది. అల్లోపతికి కావలసిన వివరములన్నియు ఆయుర్వేద శాస్త్రములోనే ఇమిడి వున్నవి. ఈ సమయములో డాక్టరు బెనర్జీగారు చెప్పిన విషయము ఆయుర్వేద శాస్త్రములో ఒక ప్రత్యేకమైన బాలవ్యాధిచికిత్స, ప్రసూతిచికిత్స, నేత్రచికిత్స, శస్త్రచికిత్సలు అను విభిన్నశాఖలుగా లేవనియు కాని అందుకు తగిన పరికరములు, శాస్త్ర విషయములు మాత్రము కలవని చెప్పారు. ఆయుర్వేద శాస్త్రములో ప్రతివిషయము ఇమిడివున్నది కాని దానిని ఉపయోగించుకొను విధానమే అవసరమై యున్నది. ఎక్కడైన కొద్ది లోపము లున్నచో తప్పక వానిని ఇతర శాస్త్రములనుండి కలుపుచేసికొనుటకు శాస్త్రజ్ఞులున్నారు. కాని అల్లోపతియే ఒక పూర్తిశాస్త్రము అని ఆయుర్వేదము కాదని వాదించుట తప్పు. రాష్ట్ర ప్రభుత్వములచే నియమింపబడిన కమిటీలవారు ఆయుర్వేదము ఒక సంపూర్ణ శాస్త్రమని మాత్రము నిర్ధారణ చేయగల్గారు. మనము దానికి ఒక విధానములో పాఠ్యక్రమము నిర్ణయించి, అవసరమైతే కొన్ని విషయములు ఇతర శాస్త్రములనుండి కలుపుకొందము. నే చెప్పబోవు విషయము "శుద్ధఆయుర్వేద" వాదుల అభిప్రాయముకూడ అయియున్నది. ఈ ప్రణాళికా నిర్ణయము మాత్రము ప్రభుత్వమువారు ఆయుర్వేద నిపుణులతో ఏర్పరచనున్న ఇండియన్ మెడిసన్ కౌన్సిలునకే బాధ్యతాయుక్తముగా ఇవ్వవలయును. పరీక్షావధి, పరీక్షాకాలము మున్నగు విషయములపై చోప్రాకమిటీవారు ఇవ్వబడిన ప్రోత్సాహములు బాగుగనే కనపడునుగాని అవి పూర్తిగా ఆయుర్వేద అభివృద్ధికి నష్టదాయకములు.

## ఆయుర్వేద పరిశోధనలు

భారత ప్రభుత్వమువారు ఆయుర్వేద పరిశోధనలను జరుపుటకు చాలా ఆతురతగా నున్నారు. చోప్రాకమిటీ వారు చెప్పిన పరిశోధనా విషయములపై విమర్శలకుగాను పండిట్ కమిటీని గవర్నమెంటు నియమించింది. అటుపై పండిట్ కమిటీ నిర్ణయముపైనే జామ్‌నగరులో ఒక పరిశోధనా కేంద్రము స్థాపింపబడింది. కాని ఈ కేంద్రము ఆ పరిశోధనాంశములను సాధించకలదా అనునది సందేహాస్పదము. కాని పండిట్ కమిటీ వారు చెప్పిన ప్రకారము ఎప్పుడు పరిశోధనములు సఫలము కానేరవని నేను మీకు చెప్పియేయున్నాను. ఆపద్ధతి ప్రకారం పరిశోధనలు చేయుట ఆచారము కాదు. పరిశోధనావిషయములు ఆధునికముగా నుండవలెను. కాని ఈ పరిశోధనాంశములలో ఆధునిక వైద్యవిధానములు తెచ్చుట యుక్తమా అనునది సందేహాస్పదము. అట్లు ప్రవేశపెట్టినచో తప్పక ఆయుర్వేద పునోభివృద్ధికి దెబ్బతగులక మానదు.

ఆయుర్వేద శాస్త్రములలోనున్న శాస్త్ర విషయములు, వాని ప్రధాన సూత్రములు, చికిత్సలు, పథ్యాపథ్యములు, రోగ నిర్ణయములపైనే పరిశోధనలు జరుగవలయునని చోప్రా కమిటీవారు దోహదమిచ్చి యున్నారు. నా అభిప్రాయము బట్టి కూడ ఈ పరిశోధనములు ఒక్క ఆయుర్వేద శాస్త్రము ననుసరించియే ఉండవలయును.

ఆయుర్వేదశాస్త్రము హిందూశాశ్వతములను, వేదాంతములతోనుకలిసి పని చేయుచున్నది. పాశ్చాత్య వైద్యశాస్త్రము మాత్రము అట్లుగాక భౌతిక రూపముపైనే ఆధారపడిఉన్నది. అందుచే ఈరెండు శాస్త్రములను కలుపుకొనుట అసాధ్యమైనది. ఆయుర్వేదౌషధములయొక్క గుణములను రస, వీర్య, విపాక, పరిణామ, ప్రభావ రూపములలో పోల్చబడుచున్నది. ఈ గుణనామములు పాశ్చాత్య శాస్త్రపు ఔషధములకు ఎంతమాత్రము సరిపడవు. ఆయుర్వేదశాస్త్ర

(Imbalance) తప్పదని అర్థము. త్రిదోషములు అనగా వాతపిత్త కఫములు క్రమస్థితిలో శరీరములో నుండుటయే సరియగు ఆరోగ్యమును కలిగియుండుటయొక్క చిహ్నము. ఈ త్రిదోషముల క్రమము శరీరములో 63 రకములుగా మారవచ్చును. ఇట్లు తప్పిన క్రమపద్ధతిని మరల త్రిదోషములలో ఏదోషభాగము సరిగా లేదో తెలుసుకొని దానిని క్రమపరచుట వైద్యుని కర్తవ్యము. ఈ విధముగా వైద్యుడు దోషము ప్రకోపస్థానములో నున్నప్పుడు తగ్గించుటయు, సక్రమముగా నున్నప్పుడు దోషమును క్రమపరచుటయు వైద్యుని విధి. ఈ విధుల చికిత్సించుటకు, అసలు దోషము ఎట్టి స్థాయిలో తమ క్రమపద్ధతినుండి తప్పునో శాస్త్రములు విపులముగా విమర్శించుచున్నవి. ఈ విధానములు పూర్తిగా తెలిసిన వైద్యుడు వ్యాధి క్రొత్తదైనను, పాతదైననుసరే కుదర్చగలడు. అందుచే ఆయుర్వేద శాస్త్రజ్ఞులు వ్యాధి పేరు వినగానే ఎట్టివారు భయపడ నగసరము లేదనియు, ఆ త్రిదోషములపై ఆధారపడని రోగము శరీరములో వ్యాపించనే వ్యాపించదని చెప్పుచున్నారు. అందుచే ఎట్టి క్రొత్త వ్యాధులకైనా ఆయుర్వేదము చికిత్సలలో కొఱవడి యుండ లేదు.

## ఆయుర్వేద కాంగ్రెసు – వైద్యులు

ఇప్పుడు మనకు సరియగు అవకాశము మన స్వతంత భారత దేశము వచ్చినతరువాత లభించింది. ఇప్పుడు మనలో కావలసినది సంఘీభావము – ఐక్యము. ఈ సమయములో మనము ఆయుర్వేదమునకు పాటుపడకిచో నష్టపడతాము. శాస్త్రం అంతరించిపోతుంది. మనలో ఎవరైనా శతృత్వము వహించి కలసిరాకుండినా తలవంచి ఐక్యత సాధించవలెను. ఈవిషయము గ్రహింపగలందులకు మీకు మహాభారతమునందలి ఒకచిన్నఅంశము జ్ఞప్తికి తెచ్చుచున్నాను "ఒకసమయములో పాండవులు ద్వైతవనములో పడరానిఇడుములు పడుచున్నారు. ఆ సమయములో కౌరవులు ధనమదము చూపుటకు పాండవుల ప్రక్కనే దుర్యోధనుడు మకాం ఏర్పరచినాడు. అట్టి సమయములో అతడు గంధర్వరాజగు చిత్రకేతునకు పట్టుపడ్డాడు. చిత్రకేతుడు వానిని ఆకాశ మార్గమున పట్టుకొని తీసికొనుపోవు సమయములో దుర్యోధనుడు యుధిష్ఠురుని శరణువేడినాడు. అపుడు పాండవులు మంచి తరుణమని యుధిష్ఠురుని శరణను ఆటంకపరచగా యుధిష్ఠురుడు ఈక్రింది ఉపదేశము చేశాడు.

"మనము కౌరవులతో యుద్ధము చేయునపుడు మనము అయిదుగురం, వారు వందమంది. కాని కౌరవులు, మనం కలసి మరియొకరితో పోగాడునపుడు 105గురమగుదుము. కనుక ఐకమత్యము ప్రధానమనియు వాని శరణుజొచ్చుట మంచిదని చెప్పగా అర్జునాదులు అంగీకరించి చిత్రకేతుని బారినుండి దుర్యోధనుని రక్షించిరి."

కనుక ఈ అంశమునే ఆయుర్వేదాభివృద్ధికై కాంక్షించు ప్రతివారు అనుసరింపగోర్తాను. గత యాబది సంవత్సరముల నుండి మన ఆయుర్వేద కాంగ్రెసు ఆయుర్వేదాభివృద్ధికే పాటుపడుచున్నది. అనేకమంది ఆయుర్వేద ప్రవీణుల అధ్యక్షత క్రింద మన కాంగ్రెసు యిప్పటికి 41 మహాసభలు చేసుకొనగల్గింది. మరియు దాని గౌరవమును పెంపొందింప కల్గుతోంది. దీనికి 4 – 5 సంవత్సరముల అధ్యక్షులుగా నున్న పండిట్ శివశర్మగారు ఆయుర్వేదోన్నతికై అనేకవిధముల కృషిచేయుచున్నారు. వీరి కృషిచేతను, పేరుచేతనే బొంబాయి రాష్ట్రములో ఆయుర్వేదము తన నిజస్వరూపముతో నిలబడకల్గింది. వారు తనరాష్ట్రములోనేకాక యితర రాష్ట్రములో కూడ ఆయుర్వేద వ్యాప్తికై కృషి చేయుచున్నారు.

గత రెండు సంవత్సరములలోను కాంగ్రెసు అధ్యక్షులుగా నున్న శ్రీ పార్థనారాయణ పండిట్ జీకూడ ఆయుర్వేద వ్యాప్తికై ఎట్లు పాటుపడుచున్నారో తమకు విదితమే. ఇప్పుడు ఆయుర్వేదాభివృద్ధికొఱకు మన మాజీ అధ్యక్షులందరిని సహకరించ వలసినదిగా కోరుచున్నాను. మన కాంగ్రెసు 1907 వ సంవత్సరములో స్థాపింపబడి అనేక విధముల ఆయుర్వేదకృషి సలుపుచున్నది. ఈ కాంగ్రెసుతో పోల్చతగ్గది మరియే యితర ఆయుర్వేదసంస్థ లేదు. దీనికి అనుబంధంగా స్థాపింపబడిన ఆయుర్వేద విద్యాపీఠమువారు ఆరుతెగల ఆయుర్వేద పరీక్షలు నడపుచున్నారు. ఈ విద్యాపీఠమునకు అనుబంధము చేయబడినది దేశములో ముప్పది చిన్నవిద్యాసంస్థలు కలవు. మరియు ఈ విద్యాపీఠమువారి పరీక్షలకు తయారు జేయుటకు దేశములో విద్యాపీఠమువారిచే అంగీకరించబడినవి ముప్పదిఆరు విద్యాలయములు కలవు. అవేవో గురుపరంగా ఈ పరీక్షలకు తర్ఫీదుచేసి విద్యార్థులను పంపుటకు 900 మంది ఆయుర్వేద ఉపాధ్యాయులు నియమింపబడ్డారు. హిందూదేశములోను, నేపాలు దేశములోనుకూడా డెబ్బది ప్రదేశములలో వీరి పరీక్షలు జరుపుచున్నారు ఈ విద్యాపీఠముల పరీక్షలకు హాజరయి సర్టిఫికెట్టులు పొందినవారు మొత్తం 15,000 మంది కలరు.

ఈ 15 000 మందికూడ వైద్యవృత్తి నవలంబించి ఆయుర్వేద సేవకులై ప్రజాభిమానమును పొందుటకు కృషిచేయుచున్నారు. ఇంతవరకు వారి వంశపారంపర్యపు హక్కును

తరువాయి 95 వ పేజీలో )

# ★ నవీనాయుర్వేదము ★


వైద్యవిద్వాన్ యస్. బ్రహ్మానందాచార్యులుగారు

శ్రీ బ్రహ్మానంద ఆయుర్వేద నిలయము, మురుగుళ్ళ.






వ్యాధిపీడితులగు మానవులను రక్షించు కొరకు పరమత పోషకులగు మహర్షులు హిమాచలమున పరిషత్సభను గావించి దేవలోకమునగల ఆయుర్వేదమును భరద్వాజ మహర్షి ద్వారా భూలోకమునకు కొనిరాబడినట్లు "ఆయుర్వేద యావిర్భావము" చరకాది గ్రంథములయందుగలదు. అట్టి యాయుర్వేదమును మహర్షులు 8 విభాగములుగ విభజించి ఈ క్రింది విధముగ చికిత్సా భాగములను నిర్ణయించిరి.

శ్లో॥ కాయ బాల గ్రహోర్ధ్వాంగ
శల్య దంష్ట్రజరా వృషాన్
అష్టావంగాని తస్యాహు చికి
త్సా ఏవసంశ్రితః॥

(1) కాయచికిత్స - Ptactice of medicine.
(2) బాలచికిత్స - works on diseases of children.
(3) గ్రహచికిత్స - works on mental diseases (demonolagy)
(4) ఊర్ధ్వాంగచికిత్స - works on diseases of eye, ear and throat.
(5) శల్యచికిత్స - Surgery.
(6) అగదతంత్రము (విషచికిత్స) Toxicology.
(7) రసాయనచికిత్స - Mathods of goining health and langevity.
(8) వాజీకరణచికిత్స - Sexieology (worke on Sexieology)

ఈవిధముగ చికిత్సా సౌలభ్యముకొరకు ఆయుర్వేదమును 8 భాగములుగ విభజించుటవలన అష్టాంగాయుర్వేద మనబడుచున్నది.

ఇట్టి అష్టాంగయుతమైన ఆయుర్వేదము వేదకాలమున మహోన్నతదశలో వెలుగొందియున్నట్లు అనేక తార్కాణములు గలవు. కాని కాలక్రమమున దేశమునందు జరిగిన కల్లోలముల వలన ఆయుర్వేదచికిత్స వంశపారంపర్యముగ క్రమబద్ధముగ, ఉపదేశ పూర్వకముగ నడుటకు వీలులేక కేవలము గ్రంథపఠనమునసే గ్రహింపవలసి వచ్చినది. అందువలన శల్యతంత్రము, శాలాక్య చికిత్సలయందు ఆచరణ పూర్వకమైన విజ్ఞానము ఆయుర్వేద వైద్యులకు లభింపకపోవుటవలన నేటిఆయుర్వేదవైద్యులు కేవలము కాయచికిత్స, బాలచికిత్సయందే అనుభవమును సంపాదింప గలుగుచున్నారు. నేటి ఆధునిక వైద్యయుగములో మనము ప్రత్యేకాయుర్వేదమునే కోరుటవలన మనకు కొన్ని యిబ్బందులు గలుగవచ్చు ననెడి యూహ వైద్యలోకమున గలదు.

కావున ఈ ఆధునిక కాలములో ఏవిధముగ ఆయుర్వేదమును చట్టబద్ధముగ అధ్యయన మొనర్చి చికిత్సల నాచరింపవలయుననెడి యూహకు, కొందరు ప్రాచీనాయుర్వేద గ్రంథములయందలి పద్ధతిచే చికిత్సల చేయవలయుననెడి పండితుల యభిప్రాయమున్నా, ప్రాచీనాయుర్వేదమును నవీన గ్రంథములతో సమ్మేళనము గావించి సమన్వయ పూర్వకమయిన శిక్షగరపి చికిత్సల నాచరించవలయుననెడి కొందరి పండితుల యభిప్రాయమును కన్పించుచున్నది. ఇట్టియెడ పాశ్చాత్య నాగరికతా వలంబకులును, పాశ్చాత్య వైద్యకాములును నగు నేటి ప్రజాసమూహమునకు ఆయుర్వేద చికిత్సల వలన సంతృప్తిని, రోగనివారణ గావించుటకు ప్రయత్నించు మనము ముఖ్యముగా పాటింపవలసిన నియమము లెన్నియో గలవు అందు ముఖ్యముగా ప్రస్తుతము.

(1) ఆయుర్వేదవైద్యులకు ఆచరణలోని ఊర్ధ్వాంగచికిత్స శల్యతంత్రము, కౌమారభృత్యములయందు ఆచరణపూర్వకమయిన శిక్షణ నిచ్చి వారికి ఆ శాస్త్రములయందు పరిచయము గలిగించుట.

(2) ఆయుర్వేదమునందు యింజక్షను విధానమును ప్రవేశపెట్టి ఆయుర్వేద యింజక్షనుల నాచరణలో పెట్టుట, శిక్షణ



శ్రీ కవిరాజ ప్రతాపసింహజీ గౌరవార్థం విజయవాడలో ఆంధ్ర ప్రదేశ ఆయుర్వేద మహామండలి జరిపిన సన్మాన సభలో స్వాగత పత్రము సమర్పిస్తున్న నాటి చాయాచిత్రము.

గరపుట, పరిశోధనలు చేయుట ఇందులకు కొందరు ఇంజక్షనులకంటె వీర్యవంతములయిన ఔషధములను కడుపులోనికిచ్చి వ్యాధిని శమింపచేయగలముగదా! ఇంజక్షనులు అవసరము మనకేలయని ప్రశ్నింపవచ్చును. కాని నేటిరోగి 5 పూటలు మందు వాడుకొన్నతర్వాత అప్పటికే యాతనిరోగము నివారణకాలేదను భావమును సూచించుచు అతడే యింజక్షను చేయమని వైద్యుని కోరుచున్నాడు అట్టిఎడ వైద్యుడు యింజక్షను చేయనిఎడల అసమర్థుడుగ రోగిభావించుచున్నాడు. అదియునుగాక ఆయుర్వేద యింజక్షనులయొక్క పరిచయము వైద్యునికి కలుగుటయేగాక ఆయుర్వేద శాస్త్రమునందు నూతన పరిశోధన అభివృద్ధి యగుటయు తద్వారా విజ్ఞానార్జనకు చాలా అవకాశములు గల్గుచున్నది. కాన యింజక్షను విధానమును ఆయుర్వేద శాస్త్రమునందు చేర్చుట.

(3) ప్రతి ఆయుర్వేదౌషధమును తయారు చేయుటకు నూతన మూలికలు తెప్పించి ఆ మూలికలను పరిశీలించి వాని యొక్క ఉత్కృష్టతనుగమనించి ఔషధములయందు చేర్చుట ఉదా:- మనము మామూలు కిరాణావస్తువులు అమ్ము అంగడికి పోయి త్రికటుకములు కొనదలచినా అవి కనీసము 4, 5 సంవత్సరములనాటివో అంతకుముందు సేకరింపబడినవో మనకు దొరకుచున్నవి. అవి తీసికొనివచ్చి తయారుచేయబడిన ఔషధము గ్రంథములో చెప్పియున్నట్లు వీర్యవంతముగ ఎట్లుండగలదు? కాని మూలికలు సుప్రసిద్ధములుగ సేకరించి 1 సంవత్సరమువరకు నిలువయుండునట్లును ఆ తర్వాత మరలకొత్తవి సేకరించునట్లును సంవత్సరాంతమున మిగిలియున్న మూలికలను ఔషధములను తయారుచేయువారు (ఔషధాలయములు) అవసరమయిన మూలికలను నిర్దిష్టమయిన కాలములో నిర్దిష్టమైన ప్రదేశమునుండి తెప్పించుకొనుట 1 సంవత్సర కాలమునకు పైగా నిలువయుంచక 1 సంవత్సర కాలమునకు కావలసినవరకే తెప్పించుకొనుట - అట్లుగానియెడల వివిధ ప్రాంతములనుండి పచ్చిమూలికలు తెప్పించి తోటలలో నాటి పోషించి, ఆ తోటలనుండి సేకరించుట. ఇట్టిపనికి ముఖ్యముగా ప్రభుత్వ సహాయమవసరము. ప్రభుత్వ సహాయమున మూలికల సరఫరా కేంద్రమును స్థాపించి తద్వారా తెప్పించుకొనుట, తయారుచేసికొనుట.

(4) ఆయుర్వేదౌషధములను శాస్త్రమునందు చెప్పిన ప్రకారము తయారుచేయుట, నిలువయుంచుట, వాడుకొనుట ఆయుర్వేదౌషధములకు కాలనియమము ఈ క్రింది విధముగ చెప్పబడి యున్నది.

శ్లో॥ గుణహీనం భవేద్వర్షా । దూర్ధ్వం త ద్రూప వనౌషధం
మాసద్వయా త్తదా చూర్ణం । హీనవీర్యత్వ మాప్నుయాత్

(తరువాయి 96 వ పేజీలో)

## ఆయుర్వేద పురోభివృద్ధి

( 93వ పేజీ తరువాయి )

కూడ నిలుపుకొన జూచుచున్నారు. ఇట్టివిద్యాసంస్థ శ్రీ పండిత దిగ్వేకర్ గారి నాయకత్వాన్న మంచికీర్తి ఆర్జింపకల్గినది.

మన ఈ కాంగ్రెసులో అనేకమంది వైద్యశాస్త్రజ్ఞులు మెంబర్లుగా నున్నారు. హిందూదేశములో మంచి కృషి ఆయుర్వేదమునకు చేయకల్గుచున్నది ఈ సంస్థ ఒక్కటి మాత్రమే. అందుచే మీఅందరి సహకారమును ఈసంస్థకు తోడ్పాటు చేయగోరినాను. కొందరు వ్యక్తులు వేరు వేరు సంఘములుగా దీనిని వ్యతిరేకించి పనులు చేయుచున్నారు. వారు తప్పులను వారు గమనింపలేకున్నారు. కనుక వారు ఇప్పటికైనను తమ తప్పుడు ప్రచారములను విరమించి మాతో కలియగోరతాము. మరొక పర్యాయము ఇవే నా ధన్యవాదములు.

మనకందరకు భగవంతుడు రోగ నిరోధకశక్తుల నేర్పరచి, సుఖించగలందులకు మార్గములు ఇచ్చుగాక!

(బెంగుళూరులో జరిగిన 42 వ అఖిలభారత ఆయుర్వేద సమ్మేళన మహాసభయందు చేసిన ఉపన్యాస సంగ్రహము)

హీనత్వం ఘుటికా క్షపహా । లభతే వత్సరాత్పరం
హీనాస్స్యుః ఘృతతైలాద్యా । శ్చతుర్మాసాధిక స్తథా
ఔషధ్యో లఘుపాకాస్స్యుః నిర్వీర్యావత్సరాత్పరం
పురాణాస్స్యుర్గుణైర్యుక్తా, ఆసవా ధాతవో రసాః॥

అను శాస్త్ర నియమము ప్రకారము చూర్ణములు 2 మాసములకు పైనను, ఘుటిక లేహ్య, లఘుపాకములగు ఔషధములకు సంవత్సరము పైనను, ఘృత, తైలములు నాల్గుమాసములకు పైనను నిర్వీర్యములగుటంజేసియు, ఆసవములు, అరిష్టములు, స్వర్ణాది ధాతు భస్మములు, రసాయనములు, రసౌషధములు పాతవి యగు కొలది వీర్యాధిక్యతను బొందుచున్నవను వచన ప్రకారము ఆయుర్వేదౌషధములకు తయారు చేయబడిన కాలమును (Manufacture date) నూ, విసర్జనచేయవలసిన కాలమును (Expiry date) నిర్ణయించి నియమ బద్ధముగ తయారుచేసి వాడుకొనుటయు.

ఈవిధముగ మందులను తయారు చేయబడిన తారీఖునూ, విసర్జింపవలసిన కాలమును శాస్త్రాభిప్రాయ ప్రకారము నిర్ణయించి ఆచరించినయెడల ఆ మందులు సంపూర్ణమైన గుణము నివ్వగలవు. ఈ విషయమును ఔషధాలయములు ముఖ్యముగా గమనించి ఆచరింపవలయును. ఔషధము ఎన్నిమాసములు నిల్వ యుంచవలెను. ఎంతమందు ఆ కాలములో విక్రయింపబడునో అంతే పరిమాణమును తయారుచేయుట Expiry అయిన ఔషధములను విసర్జించుటయు.



శ్రీ కవిరాజమోహన్ సన్మానసభ (విజయవాడ) లో గుంటూరు ప్రతినిధులు ప్రత్యేకముగా శుభాకాంక్షలు సమర్పించిన సందర్భములోని ఛాయాచిత్రము.
శ్రీ మరుపిళ్ళ చిట్టి M. L. A., శ్రీ మోహన్, శ్రీ సుభాన్, శ్రీ మాధవరావు, శ్రీ ఎ. గోపాలరావుగార్లు.

(5) శాస్త్రమందు చెప్పబడిన ప్రకారము రోగపరీక్షా కాలములను నిర్ణయించుట "వసంత ఋతువునందు పూర్వాహ్ణమునందునూ, గ్రీష్మ ఋతువునందు మధ్యాహ్నమునూ, ప్రావృట్కాలంబున అపరాహ్ణమునందును, వర్షాకాలంబున ప్రదోషకాలంబుననూ, శరదృతువునందు నర్ధరాత్రమునందునూ హేమంతఋతువునందు ఉషఃకాలమునందును రోగనిర్ణయము చేయుట. అట్లు రోగ నిర్ణయము చేయుటలో అష్టస్థాన పరీక్షలనేగాక పూర్వగ్రంథములయందున్నట్లు నిదాన, పూర్వ, రూప, ఉపశయ, సంప్రాప్తియనెడి పంచలక్షణములతో గూడ రోగిని పరీక్షించుట.

(6) ఓషధులయొక్కయు రసాది ధాతువుల యొక్కయు శుద్ధులు, సంస్కారములు శాస్త్రమునందు చెప్పిన ప్రకారము చేయుట రసమునకు అష్టాదశ సంస్కారములు ధాతువుల యొక్క శుద్ధులు మొదలగునవి అమోఘములో చెప్పినట్లే చేయుచు అభావ ప్రతినిధులు చేర్చకుండుట. అట్లే మూలికలయొక్క స్వరసము చెప్పినచోట అభావప్రతినిధిగ క్వాథమును చేర్చుకొనక స్వరములనే వాడుకొనుట.

(7) నిర్దిష్టమూలికలు నిలువచేయుటకు ప్రభుత్వ సహాయము యెట్లు అవసరమో ఆవిధముగనే గ్రామవైద్యులకు గూడ పంచాయతీబోర్డువారి సహకారము కొంత కావలసి యున్నది. వారి ఆధిపత్యమున పర్యవేక్షణలో ప్రజలకు అందుబాటులో నుండునట్లునూ ముఖ్యావసరమయిన మంచి తులసి, కర్పూరవల్లి (కప్పరెల్లి), సన్నజెముడు, ఆకు జెముడు మొదలగు స్వరస ప్రధానౌషధులను పెంచి ప్రజాసామాన్య అవసరములకు అందుబాటులో నుండునట్లు చేయుట.

ఈవిధములగు ప్రాచీన, నవీన ఆయుర్వేద విషయములను ఒక్కచోట చేర్చి సమన్వయపరచి నవీనాయుర్వేదముగ రూపొందించి ఆ శాస్త్రప్రకారము ఆయుర్వేద వైద్యులకు లక్ష్యలక్షణ సమన్వితమగు శిక్షణగరిపి చికిత్సలు జరిపినందువలన ఆయుర్వేదము ప్రజారంజకముగ వీర్యవంతముగ రోగనివారణము గావించి ఆరోగ్యరక్షణ చేయగలదనియు ఆయుర్వేదము అష్టాంగయుతమై శోభిల్లగలదనియు పండిత లోకమునకు మనవి చేయుచున్నాను. "ఆయుర్వేదము గొప్పదనే నినాదములుగాని కార్యరూపములో దాని గొప్పతనము చూపింపవలె" నన్న మన మంత్రిపుంగవుల ఆనతి ప్రకారము ఆయుర్వేదమునందు నూతన పరిశోధనాయుగము ప్రారంభము గావలయుననియు తద్వారా ఆయుర్వేద మహాత్మ్యము ప్రజలకు చక్కగా బోధపడగలదనియు తలచుచున్నాను. ప్రాచీనాయుర్వేదాభిలాషులు ఇందుకు నన్ను మన్నింతురుగాక!!



శ్రీ చిర్ల జగ్గిరెడ్డిగారు,
రెడ్డి అండ్ కంపెనీ ప్రొప్రయిటరు,
గోపాలపురం, తూ॥ గోదావరిజిల్లా

వీరు 1914 సం॥ రం॥ మున పశ్చిమగోదావరిజిల్లా మార్టేరు గ్రామంలో జన్మించిరి. మార్టేరు ఉన్నత పాఠశాలయందు స్కూలుఫైనలు వరకు విద్య నభ్యసించి తర్వాత పిఠపూర్ మహరాజా కళాశాలయందు బి. ఎ. డిగ్రి పొంది యున్నారు.

వీరు గత 25 సంవత్సరములనుండి రెడ్డి అండ్ కంపెనీ యను రోగచికిత్సాలయమును కడుసమర్థతతో నిర్వహించుచు బీదవయ రోగులకు ఉచితముగకూడా ఔషధములనిచ్చుచు, ఆ సంస్థను కడు సమర్థతతో నిర్వహించుచున్నారు.

వీరు గత 2 దఫాలుగా గోపాలపురం మేజరు పంచాయతీకి ఏకైక అధ్యక్షులుగ ఎన్నుకొనబడి, ఆ నగరమునకు డ్రైనేజి, పాఠశాల, రోడ్లుమొదలగు అధునాతన సౌకర్యములను కల్పించిరి. గత గోదావరి వరదసమయంలో బీద సాదలకు ఉచిత అన్నవస్త్రముల నేర్పాటుచేసి వరద పీడితుల కెంతయో సహాయపడి స్వామీజీ మన్ననలనుకూడా పొందియున్నారు.



వైద్యశ్రీ రాజవైద్యాచార్య
పమ్మి చినవెంకయ్యగారు
పిప్పర, తాడేపల్లిగూడెం తాలూకా
పశ్చిమ గోదావరి జిల్లా.

వీరు 1915 నుండి వైద్యవృత్తిలోనున్న విద్వద్వైద్యులు. గొప్ప అనుభవముతో బహు నిరాడంబరముగా ఆయుర్వేదము ప్రజారంజకమైన వైద్యమని చాటుతూ అనుగుణ్యముగా చికిత్సలు జరిపి ఆయుర్వేదాభి వృద్ధికి తోడ్పడుతున్నారు. వీరికి మండలియందు గొప్ప విశ్వాసము, గౌరవ ప్రతిపత్తులు గలవు. తాడేపల్లిగూడెం తాలూకా ఆయుర్వేద మండలికి అధ్యక్షులుగా వున్నారు, నేడు ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలికి స్థాయిసమితి సభ్యులైయున్నారు
వీరు చంటి బిడ్డలకు ప్రత్యేక చికిత్సలు చేస్తారు. ఆముదం అవసరం లేకుండా ఔషధాలు నిర్మించారు. కుక్క నక్క, ఎలుక, పిల్లి మొదలైన విషకాట్లకు నైపుణితో చికిత్సలు చేయు ప్రముఖ ప్రజా వైద్యులు.

## పేదలపాలిట పెన్నిధి

"క్రియాకల్పం" అనేకమందిపై వాడాను. ఎంత ప్రయోజనకరమైన ఔషధమో వర్ణించలేను. నిజముగా "పేదలపాలిట పెన్నిధి" క్రియాకల్పమని అద్దంకినుండి డా॥ వి. గోపాలరావుగారు వ్రాయుచున్నారు.



## వైద్యశ్రీ తానింకి వెంకటరత్నంగారు

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్.

చిట్యాలపోస్టు, కొవ్వూరు తాలూకా, ప॥ గో॥ జిల్లా.

శ్రీ తానింకి వెంకటరత్నంగారు తాడేపల్లిగూడెంతాలూక జగన్నాథపురం గ్రామములో యాదవవంశములో జన్మించిరి. వీరి కుటుంబము బీద కుటుంబము. తండ్రి వెంకయ్యగారు, తల్లి దుర్గమ్మ వీరి చిన్నవయస్సులోనే పరమపదించిరి. స్వగ్రామములో ప్రాథమికవిద్య పూర్తిచేసి ఉన్నతవిద్య పెంటపాడులో స్కూలుఫైనలువరకు చదివారు. పెంటపాడు గవర్నమెంటు ట్రయినింగు స్కూలులో ఉపాధ్యాయ ట్రయినింగు ప్యాసు అయినారు. నాటినుండి అనేక గ్రామములలో ఉపాధ్యాయవృత్తి చేస్తూ వైద్యవృత్తి అలవరచుకొన్నారు. వీరి స్వగ్రామములో చిన్నతనములోనే అనేక వైద్యకార్యములు చేసిరి. విద్యార్థి దశలోనే పశ్చిమ గోదావరిజిల్లా వెనుకబడిన జాతుల సంఘమునకు సహాయ కార్యదర్శిగాను, యాదవ సంఘం కార్యదర్శిగాకూడా మంచిసేవ జేసిరి. ప్రస్తుతం చిట్యాలలో బోర్డుపాఠశాలలో హెడ్మాష్టరుగా పని చేయుచున్నారు. వీరు సదరు గ్రామములో ప్రజా సహకారముతో ఒక లైబ్రిరీ మరియు పోష్టాఫీసు స్థాపించినారు. కొన్నిసంవత్సరములుగా చిట్యాల చుట్టుపట్ల గ్రామములలో తమ వైద్యసేవ బీదల కందచేయుచున్నారు. వీరు కొవ్వూరు, పోలవరం తాలూకాల బీదవిద్యార్థుల సహాయ సంఘం (రిజిష్టర్డు) స్థాపించి కార్యదర్శిగావుండి, ప్రజా సహకారముతో తెలివిగల బీద బాలబాలికలకు కులమత వివక్షత లేకుండా విద్యావేతనములు ఇచ్చుట, లైబ్రరీలు, వైద్యసేవ సదరు సంఘంద్వారా సేవచేయుచున్నారు. ప్రస్తుతం వీరు ఏలూరు గవర్నమెంటు హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో విశేష వైద్య ట్రయినింగు పొందుచున్నారు. కొవ్వూరు తాలూకా ఆయుర్వేద మండలికి సహాయ కార్యదర్శి. ★



## డా॥ టి. శ్రీరాములురెడ్డి,

ట్రంకురోడ్డు : : ఒంగోలు

గుంటూరుజిల్లా.

### సిద్ధకల్ప (నవరత్న మిశ్రితం)

ప్రత్యేకక్షయ, ఉబ్బసము, గుండెనొప్పి మున్నగు దీర్ఘ వ్యాధులకు గ్యారంటీగా తయారుచేసి కొన్ని కేసులమీద ప్రయోగించి తగిన ఫలమును పొంది పలువురచే ప్రశంసలనందిన రాజౌషధము.

### అమృతకల్ప (సువర్ణ మిశ్రితం)

దీనికి సాటిఔషధము ఆయుర్వేదౌషధములలో మరొకటి లేదని చెప్పుటకు సాహసిస్తున్నాము.

పదుగురు వైద్యులచే త్రిప్పివేయబడిన, అసాధ్యమైన రోగములందు సోధించి, సెహభాస్! ఆంధ్రకల్పతరువనిపించుకొన్న రాజఔషధము.

### సంజీవని రసాయనం

ఈ ఔషధమును ప్రత్యేకముగా శ్రీమంతులు, సంతానము కోరువారు, అనేక కారణములచే వంధత్వమునకు లోనైన వారు దీని సేవనవలన భోగభాగ్యములతోపాటు సత్సంతానము పొందగలరనుటకు సందియములేదు.



వైద్యశ్రీ, కవిరాజ

ఆర్. సోమయ్యగారు

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్ (రిజి. బెంగాల్)

పత్తికొండ, కర్నూలుజిల్లా.

వీరు పత్తికొండలో 50 యేండ్లుగా వైద్యసేవ చేయుచున్న శ్రీ జంబులయ్యగారి కుమారులు. వీరి వయస్సు 42 యేండ్లు. తండ్రిగారి శిక్షణలో తయారైన వంశపరంపరా వైద్యులు, ఆధునికంగా పరిశోధనాదృష్టితో చికిత్సా పద్ధతులు నడుపుతున్న ప్రముఖులు శ్రీ సోమయ్యగారు. వీరివద్ద శిక్షణ పొందిన వైద్యులెందరో గలరు. వీరు కర్నూలుజిల్లా ఆయుర్వేద మండలికి సహాయ కార్యదర్శి, తాలూకా మండలి ప్రధాన కార్యదర్శి - సంఘసేవాసక్తి - ఆదర్శ వైద్యసేవ వీరి అభిమాన విద్య.



వైద్యశ్రీ

బి. కె. రంగయ్యగారు

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

గుత్తియర్రగుడి పోస్టు, పత్తికొండతాలూకా, కర్నూలుజిల్లా.

1926 సం॥న గుత్తియర్రగుడిలో మధ్యతరగతి కుటుంబంలో జన్మించినారు. కులం కుమ్మర. 1945 నుంచి ఆయుర్వేదంలో అభిరుచికలిగి ఆయుర్వేదవైద్యాభివృద్ధికై పాటుపడుచున్నారు. 1949 నుంచి 53 వరకు పత్తికొండతాలూకా యువజన సంఘ కార్యదర్శిగను, తాలూకా రైతుసంఘ కార్యదర్శిగాను, తాలూకా వైజ్ఞానికసమితిలోను ఉండి అనేక విధాల ప్రజా సేవ చేశారు.

1953 సం॥ నుంచి మూడు సంవత్సరములు గుత్తియర్రగుడి గ్రామ పంచాయతీబోర్డు వైస్‌ప్రశిడెంటుగా ఉండి ప్రజాసేవ చేశారు. 1952 నుంచి రెండు సంవత్సరములు బ్రాంచి పోస్టుమాష్టరుగా ఉన్నారు. ఇప్పటివరకు తాలూకాలో ఆదర్శ ఆయుర్వేద వైద్యులుగా పేరుగాంచినారు.

ప్రస్తుతం గుత్తియర్రగుడిలో ప్రధానవైద్యశాల యున్నది. దానిశాఖ గుత్తితాలూకా యర్రతిమ్మరాజుచెర్వు గ్రామంలో ప్రారంభించారు.



వైద్యశ్రీ జి. యన్. శర్మగారు,
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు (రిజిష్టర్డు)
కళ్యాణదుర్గం, అనంతపురంజిల్లా.

అనంతపురంజిల్లా, కల్యాణదుర్గం గ్రామమున దు వీరు 25-7-1923 తేది జన్మించిరి స్థానిక ఉన్నత పాఠశాలయందు విద్యాభ్యాస మొనర్చి 1944 సం॥ మార్చి నెలలో S.S.L.C. పరీక్ష యందు త్తీర్ణులైరి. వీరికి చిన్ననాటి నుండియు వైద్య విద్య యందాసక్తి మెండు. వీరు జన్మించినదియు వైద్య వంశమే. తాత ముత్తాతల నాటినుండియు వైద్యమే వీరి వృత్తియై యుండెడిది. ఆకారణమున వీరు తమ 16వ ఏటనే వైద్యమునందు సముచిత జ్ఞానము నార్జించి క్రమక్రమముగ అభివృద్ధి నొందించుకొనిరి.

ఆయుర్వేదమునందు మిక్కిలి కృషిచేసి అనేక గ్రంథముల పఠించిరి. తమ వంశానుగతిమగు ప్రజారంజకముగా చికిత్సలు జరుపుచున్నారు.



శ్రీమాన్ వైద్యశ్రీ
పరాంకుశం శ్రీరామాచార్యులుగారు
పెదకాకాని, గుంటూరుతాలూకా.

శ్రీ రామాచార్యులుగారు శ్రీ రామమోహన ఆయుర్వేద కళాశాలలో ఆయుర్వేద ప్రవీణ పరీక్షలో కృతార్థులైనారు. తండ్రిగారు అనుభవ వైద్యవిధులలో, అన్నగారి చికిత్సా నైపుణ్యములో ఆరితేరినవారై ప్రజాగౌరవముతో ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరుగా ప్రజారోగ్యమును సంరక్షించుచున్నారు. ఉదార స్వభావముగల్గి, ధార్మిక హృదయంగల్గి తరతమ భేదములు లేకుండా సంఘసేవాసక్తి గల్గినవారు.

## శీతజ్వరములకు

మా అనుభవముతోపాటు, శీతజ్వరాల నివారణకు క్రియాకల్పం యెంతో ఉపకరించిందని విద్వాన్ వైద్యులు శ్రీకవిరాజ వి. కామరాజుగారు అభినందిస్తూ జాబులు వ్రాశారు.

## ప్రజారంజకమైనది

ఇంత స్వల్ప ఖరీదులో ప్రజారంజకమైన ఔషధము మాకు లభింపజేసిన మీ ఘనత ప్రశంసనీయమైనదని డా॥ జె. సి. హెచ్. పాల్‌గారు వ్రాయుచున్నారు.



వైద్యశ్రీ కవిరాజ
చిత్రావూరి బ్రహ్మానందాచారి,
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్, (రిజిష్టర్డు బెంగాల్)
మునుగోడు, సత్తెనపల్లి తాలూకా.

శ్రీ బ్రహ్మానందాచారిగారి కుటుంబము కొన్నితరములుగా వైద్యులు. వంశపారంపర్యా వచ్చుచున్న వైద్యవృత్తిలో శ్రీ బ్రహ్మానందాచారి ఎంతో శ్రద్ధాభక్తులతో చికిత్సా పద్ధతుల నిర్వహించి గౌరవ మర్యాదలతో జీవించుచున్నారు. వీరి ప్రత్యేక వైద్యము బాలగ్రహ చికిత్సలు, ఋతు దోష నివారణ గ్రామప్రజల ఆదరాభిమానములు పొందుతున్న ప్రముఖ అనువంశిక వైద్యులు.



వైద్యశ్రీ
రేకాడి సూర్యనారాయణగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్
ఓడలరేవు, అమలాపురం తాలూకా.

శ్రీ సూర్యనారాయణగారు శ్రీ సరస్వతి రామన్నగారి ద్వితీయ పుత్రుడు. రాజవైద్యాచార్యులు శ్రీ పెమ్మాడి నరశింహంగారివద్ద 5 యేండ్లు ఆయుర్వేద శాస్త్రము నభ్యసించినవారు. ఆయుర్వేద వైద్యవిధానములో ప్రజాభిమానం చూరగొంటు 12 సంవత్సరములునుండి వైద్య వృత్తిలో నున్నారు.



వైద్యశ్రీ
యం. సుబ్బయ్యా గారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

"నేను 1915 సం॥ ఫిబ్రవరి 16 న జన్మించి, కడప హైస్కూలు నందు 4 వ ఫారము చదువుతూ ఉపాధ్యాయ ట్రెయినింగులో 1933 న కృతార్థుడనై, సదరు పదవిలో ప్రవేశించినది మొదలు కడపజిల్లా బోర్డు ఆసుపత్రియందు పనిచేయుచున్న శ్రీ టి. రామకృష్ణ శాస్త్రిగారివలన వైద్యమునందు తర్ఫీదునంది 1935 మొదలు యిప్పటివరకు మానవసేవయే మాధవసేవయను నార్యోక్తిని పరమావధిగా నెంచుకొని, ఆయుర్వేదము నందు మిక్కిలి ప్రయాసజెంది డబ్బు వ్యయపరచి, చేయుటమాని కంపెనీ ఔషధములపై ఆధారపడి సేవచేయుచున్నాడను" అని వ్రాయుచున్నారు.



ఆయుర్వేద ప్రవీణ, ఆయుర్వేద భిషక్
**పరాంకుశం చక్రాచార్యులు, ఎ.ఆర్.ఎ.సి;**
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
పొందూరుగ్రామం, ఒంగోలుతాలూకా, గుంటూరుజిల్లా.

వీరు గుంటూరు శ్రీ రామమోహనఆయుర్వేద కళాశాలలో వైద్యవిద్య నభ్యసించి ది 30-6-1949 న ఆయుర్వేద ప్రవీణ పట్టమును బడసిరి. అఖిలభారత వర్షయ ఆయుర్వేద విద్యాపీఠమువారి భిషక్ పరీక్ష 1939 సం॥రములో ఉత్తీర్ణులైరి. మద్రాస్‌నందు ఇండిజినస్ మెడిసన్ కాలేజీలో విలేజివైద్య పరీక్షకుగాను చదివి 1952 సం॥ర ములో అందు ఉత్తీర్ణులైరి. మద్రాసు సెంట్రల్ బోర్డు ఆఫ్ ఇండిజినస్ మెడిసన్ వారిచే 20-9-50 తేదీన రిజిష్టరుచేయబడి ప్రస్తుతం పొందూరు గ్రామంలో శేషూ మెమోరియల్ డిస్పెన్సరీలో ప్రధాన వైద్యులుగా పనిచేయుచు బీదరోగులకు ఉచిత చికిత్స నొసర్చుచు సేవచేయుచున్నారు. వీరి తండ్రి రాఘవాచార్యులుగారు స్థాపించిన వీరరాఘవ ఆయుర్వేద ఫార్మశిలో ప్రొప్రయిటరుగా పనిచేయుచున్నారు. వీరు 'ఆసవదీపిక' అను వైద్య గ్రంధమును రచించిరి. వీరు పై కళాశాలలో చదువునపుడు విద్యార్థి సమితికి సెక్రటరీగా పనిచేసియున్నారు.





వైద్యశ్రీ
**కదూరు వరదరాజు గారు**
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
నిట్టూరుకొత్తపల్లి, తాడిపత్రితాలూకా, అనంతపురంజిల్లా.

శ్రీ వరదరాజుగారు అనువంశిక వైద్యకుటుంబములో పుట్టి పెరిగినవారు. వీరి కుటుంబములోని పెద్దలందరు అసాధ్యములైన వ్యాధులు నివారించగల సమర్థులని ప్రఖ్యాతిగన్నవారు. వారి పదచ్ఛాయల్లోనే శ్రీ వరదరాజుగారు వైద్యసేవ చేయగల్గుతున్నారు. వీరి చికిత్స పద్ధతులు తాళపత్ర గ్రంథముల నుండి సేకరింపబడుచున్నవి.

## మానని పుండు

ఎలాంటి బండబారిన పుండ్లయినా మానక, రసి, నీరుకారేపుండ్లకు "క్రియాకల్పం" పుండుపైని చల్లండి. దూదివేసి కట్టుకట్టండి. మూడురోజుల ఆదుదల కావించి మానిపోతుంది.

## ప్రోత్సాహం

మా వైద్యశాల ప్రజాగౌరవము పొందుటకు మా క్రియాకల్పము ఎంతో సహాయపడుతున్నదని వుండి నుండి శ్రీ కవిరాజ బుద్ధరాజు నరసింహరాజుగారు వ్రాయుచున్నారు.







వైద్యశ్రీ
యం. గురుమూర్తి రెడ్డిగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
ఎర్రెపల్లె, పుల్లూరు పోస్టు, చిత్తూరు జిల్లా.

శ్రీ గురుమూర్తి రెడ్డిగారు అనుభవముతో ఆయుర్వేద చికిత్సలు ప్రజానీకమునకు అందచేయుచున్నారు. తాత గారైన మునివపురెడ్డి, తండ్రిగారైన కొండారెడ్డిగారి అనుభవములను మిళితపరచుకొని ఆదర్శంగా పేదవారి రక్షణకు చేయూత నొసగుచు గౌరవప్రతిపత్తులు పొందుచున్నారు.

శ్రీ కేజేటు పార్వతీశంగారు,
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
నగరికటకం.

వీరు శ్రీకాకుళంజిల్లా శ్రీకాకుళం తాలూకా, నగరికటకం గ్రామములో ప్రమాదీచ నామసంవత్సర కార్తీక బ 3 (1913-11-15) శనివారమున సుప్రసిద్ధ బ్రాహ్మణ కులమున జన్మించినారు. ఆయుర్వేదవైద్య కుటుంబీకులు, గర్భకోశ వైద్యమునందు ప్రవీణులు. వైద్యమునందు మిగుల అనుభవనీయులు.



వైద్యశ్రీ మద్దిరాల రాధాకృష్ణమూర్తి
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
ప్రభాకర ఆయుర్వేద నిలయము, చమళ్లమూడి
(వయా) గుంటూరు.

వీరు బాల్యంనుంచి ఆయుర్వేద వైద్యవిద్యాభిమానం కలవారు. మాతృపితృ వంశాలు రెండూ ఆయుర్వేద వైద్య సంప్రదాయంలో అఖండమైన వైదుష్యం గడించినవి. వంశపరంపరాగతంగావస్తున్న ఆ వైద్య సంప్రదాయాన్నే వీరూ అనుసరించి అసమానమైన బహు కాలానుభవంతో ప్రజాసేవ చేస్తున్నారు. భారతీయవైద్య సిద్ధాంతానుసారంగా శాస్త్రోక్త విధానంతో అనేకమూలైన ఔషధ రాజములు తయారుచేస్తున్న భిషగ్వరేణ్యులు వీరు. ప్రతిఫల రాహిత్యబుద్ధితో మానవ సేవాసక్తితో ప్రజారిణపొందిన వైద్యవిద్యా ప్రవీణులు. వీరి జనకులు శ్రీ వెంకటరత్నం గారు. జనని శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు.



**వైద్యశ్రీ చిలుకూరి అమరయ్యగారు**
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
ఆకుపాముల, జగ్గయ్యపేట తాలూకా.

వీరి జన్మస్థలం కృష్ణాజిల్లా జగ్గయ్యపేట తాలూకా మునగాల పరగణా ఆకుపాముల గ్రామము. వీరి వయస్సు 30 సంవత్సరములు. విశ్వబ్రాహ్మణ కుటుంబములో జన్మించారు. వీరి కుటుంబములో అనువంశికముగా ఆయుర్వేద వైద్యము యున్నది.

వీరు గత 10 సంత్సరములుగా ఆయుర్వేద, హోమియో వైద్యులుగా కృషిచేయు చున్నారు. వీరికి ఆయుర్వేద హోమియో ఔషధములన్న అమితాభిమానము.

వీరు 1955 వ సంవత్సరములో ప్రభుత్వము వారిచే హోమియో వైద్యులుగా రిజిష్ట్రేషను పొందారు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ఆయుర్వేద మహామండలి సభ్యులుగాచేరి ఆయుర్వేద వైద్యసేవ చేయుచున్నారు

వీరు సారస్వత ప్రియులు. సంస్కృతాంధ్ర భాషలలో ప్రవేశమున్నది. ఆంధ్ర సారస్వత పరిషత్ విశారద పరీక్ష పూర్వభాగంలో ఉత్తీర్ణులయినారు. బాల్యమునుండి అనేక అభివృద్ధికర రాజకీయ ఉద్యమాలలో పాల్గొన్నారు. చిరకాలమునుండి ఆకుపాముల సకలార్థ సహకార పరపతి సంఘమునకు కార్యదర్శిగాను, మునగాల లోకలు కో-ఆపరేటివు యూనియన్ డైరక్టరుగాను యున్నారు వీరు మునగాల పరగణాలో సహకారోద్యమంలోనూ వైద్యసేవకులలోనూ ప్రముఖులు.



**వైద్యశ్రీ కవిరాజ నారాయణం కృష్ణమూర్తిగారు.**
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
రెంటచింతల, పల్నాడు తాలూకా.

వీరి స్వస్థలము గుంటూరు జిల్లాలోని రెంటచింతల గ్రామం. బెంగాలు గవర్నమెంటు వారిచే రిజిష్టరు కాబడిన సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు. వీరు యిదివరలో నైజాములోని గోపాలపేట సంస్థానములో ఆయుర్వేదాభిమానులగు శ్రీ శ్రీ శ్రీ రాణీ జె. లలితాదేవిగారి ఆధిపత్యములో నడచుచున్న గ్రామోద్ధరణ సంఘములో వేతనముపై టూరింగు డాక్టరుగా పనిచేసిరి. సంస్థానం మెడికల్ ఆఫీసరు, తాలూకాదారు మొదలగు ఉన్నతోద్యోగులు వీరు చేసిన సేవను గురించి యోగ్యతాపత్రముల నొసంగిరి. స్వాతంత్ర్యము సిద్ధించిన పిమ్మట సంస్థానమునువదలి తన స్వస్థలమైన రెంటచింతలలో ప్రాక్టీసుచేయ నారంభించిరి. ప్రజలకు వైద్యసేవ చేయుచు వృత్తియందు చక్కని పరిజ్ఞానమును, అనుభవమును గడించిరి. పరిసర గ్రామములనుండి వీరి వైద్యప్రవీణతకు కోరికపడి పిలిపించుకొందురు. వీరిపై ప్రజలకు ఎంతేని ఆదరాభిమానములు గలవు. వీరు ప్రజాసేవాసక్తులై బీదలకు వైద్యచికిత్స నుచితముగ నొనరించుచుందురు. వీరు పల్నాడు తాలూకా ఆయుర్వేద వైద్యమండలి కార్యవర్గ సభ్యులు. కలకత్తా రీసెర్చి అసోసియేషన్ ఆఫ్ మెడిసన్ సభ్యులు. పట్టణ ఆయుర్వేద వైద్య సంఘాధ్యక్షులు. వీరివలెనే వీరి సోదరుడు కూడా సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులే.

### వైద్యవిద్వాన్
### అయిలావఝ్ఝుల రామకృష్ణశాస్త్రి
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
భాస్కరాపేట, బద్వేలు తాలూకా, కడపజిల్లా.

వీరు "సాహిత్య విద్యానిధి" "రఘువీరచరిత్ర" గ్రంథ కర్తలు. శ్రీ జంగా నరసింహశాస్త్రిగారివద్ద నాటకాంత సాహిత్యమును శ్రీ "అవధాని పంచానన" అవధానం చెంచు సుబ్బావధానులుగారివద్ద వేదాభ్యాస మొనరించిరి.

ఆయుర్వేదాచార్య కీ. శే. శ్రీ పులుగుండ్ల నరసింహశాస్త్రి గారి భారద్వాజాయుర్వేదాశ్రమము, నెల్లూరు, గురుకులము నందు లక్ష్యలక్షణ సమన్వితముగ ఆయుర్వేదాభ్యాస మొనరించి వైద్యవిద్వాన్ పరీక్ష యందుత్తీర్ణులైరి.

స్వగ్రామమునందు శ్రీ గౌతమ పాదాయుర్వేదాశ్రమమును స్థాపించి, ప్రజాసేవ చేయుచున్నారు. శ్రీ కడప జిల్లా ఆయుర్వేద వైద్యమండలి సహాయ కార్యదర్శిగానుండి ఆయుర్వేదాభ్యున్నతికితోడ్పడుచు, అనువంశిక వైద్యవృత్తిచే జీవించుచు, ప్రస్తుతము ఆయుర్వేదిక్ డిస్పెన్సరియందు పని చేయుచున్నారు.

విద్యార్థులకు ఆయుర్వేదమును బోధించుచు చికిత్సా విధి యందు క్రమశిక్షణ నొసంగి ఆయుర్వేద పరీక్షలకు పంపుచుందురు.

## ప్రత్యేక సంచిక

మొదటి సంపుటిలో ప్రచురించుటకు పంపిన అనేకమంది చిత్రపటములకు పోలిక లభించలేదు. జీవిత సంగ్రహములు రాలేదు. ఎది యెట్లు ప్రకటించుటకు అవకాశంలేక అవి ప్రచురించలేదు. విచారించి ద్వితీయ సంపుటిలో ప్రచురించెదము.

—సంపాదకులు.



### వైద్యశ్రీ, భిషగ్రత్న
### యర్రా శివలింగంగారు
శ్రీ సాయిబాబా ఆయుర్వేద ఔషధాలయం
ఇచ్ఛాపురం, శ్రీకాకుళంజిల్లా.

వీరు రాజవైద్యులవద్ద కటకంలో శిక్షణ పొంది యున్నారు. అనుభవముతో శస్త్రచికిత్స లేకుండా అనేక క్రూరవ్యాధులు నివారించిన అగ్రగణ్యులు. మహామూలిక, రస, విష, పాషాణ, స్వర్ణాది సర్వ లోహములు పరిశోధించినవారు. బాల్యమునుండి సాధు, సిద్ధపురుషుల సాంగత్యములో అనేక మూలికల, సిద్ధప్రక్రియలు సంగ్రహించి ప్రయోగించుటలో నిపుణతగలవారు. అనేక బంగారు, పతకములు, యోగ్యతాపత్రములు బహుమతులు అందుకొని ప్రాణదాతలని పేరు పొంది యున్నారు. 18 సం॥ల నుండి అనేక యోగములు కల్పించిరి. అనేక సిద్ధ ఔషధములు వీరివద్ద దొరకును. వీరికి సిద్ధవైద్యులని, ఆయుర్వేద మహా సిద్ధులని పేరుపొందిరి. ఆస్తమ, మేహ, కుష్టు, సన్నిపాత, అసాధ్యరోగములు శాంతింప చేయగలరు.



ఆయుర్వేద ప్రవీణ, భిషక్, వైద్యవిద్వాన్
వైద్యశ్రీ వినుకొండ హయగ్రీవాచార్యగారు,
ఎ. ఆర్ ఎ. సి.,
నర్సరావుపేట, గుంటూరుజిల్లా.

జననం 1919వ సం॥లో. 1937వ సం॥లో హైస్కూలు చదువు పూర్తిచేసుకొని గుంటూరు శ్రీ రామమోహన ఆయుర్వేద కళాశాలలో నాలుగువత్సరములు చదివి ఆయుర్వేద ప్రవీణ పట్టమును పొంది ప్రత్యేకముగ కృషిసల్పి అఖిల భారత ఆయుర్వేద విద్యాపీఠము తరపున భిషక్ యును, ఆంధ్రాయుర్వేద విద్యాపీఠము తరపున వైద్యవిద్వాన్ అను పట్టములబొంది, పారంపర్యముగా వచ్చుచున్న ఆయుర్వేద వైద్యమును, ఔషధములను వృద్ధిచేసుకొని 1942 సం॥లో శ్రీహయగ్రీవ ఆయుర్వేద నికేతనమను పేర ఫార్మశీ స్థాపించిరి. సదరు ఫార్మశీ ఔషధములలో పేటెంట్ ఔషధములగు 1. పరంజ్యోతిరసం, 2 సువర్ణరాజేశ్వరమనువానిని 1944లో విజయవాడలో జరిగిన అఖిలభారత ఆయుర్వేద మహాసమ్మేళనములో ప్రదర్శించి యోగ్యతాపత్రముల పొంది యుండిరి. 1947 నుండి 50 వరకు తాలూక వైద్యమండలి సెక్రటరిగను, రాష్ట్ర స్థాయిసమితి సభ్యులుగను, తదుపరి 1952 నుండి తాలూక వైద్యమండలి అధ్యక్షులుగను వుండుచు 1956లో జరిగిన స్థానిక మునిసిపల్ ఎన్నికలలో పోటీచేసి కౌన్సిలరయి, అందు హెల్తుకమిటీ మెంబరుగ ఎన్నుకొనబడిరి. లోగడ 1949 సం॥లో ఒకపర్యాయము శ్రీ రామమోహన ఆయుర్వేద కళాశాల పట్టభద్ర సంఘమునకు అధ్యక్షులుగను మరల ది 2-12-56న ఆయుర్వేద ప్రవీణ పట్టభద్ర సంఘమునకు అధ్యక్షులుగను ఎన్నుకొనబడిరి. ★



వైద్యశ్రీ అబ్దుల్ రహమాన్ గారు,
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
పేరాల (వయా) చీరాల, గుంటూరు జిల్లా.

శ్రీ రహమాన్ సాహెబ్ గారు యూనానీ, ఆయుర్వేద శాస్త్రపద్ధతులలో చికిత్సలు జరుపుతున్నారు. వీరు వైద్యశ్రీ గోలి శేషయ్యగారివద్ద, హకీం యం. షాదేవాబేగ్ సాహెబ్ గారివద్ద కర్మపదాభ్యాసమును గావించిరి. 1941లో చీరాలలో జరుపబడిన గ్రీష్మఋతు దేశీయవైద్య పాఠశాలయందు జరిగిన క్లాసెస్‌లో పాల్గొని శ్రీ ప్రాణాచార్య డి రంగాచార్యులు, వైద్యశ్రీ టి జియ్యరుదాసు, శ్రీ యం. దొడ్డయాచార్యులు, శ్రీ కె. శ్రీనివాసాచార్యులు, డా॥ యం. ద్వారకానాద్ L M. P, డా॥ సాంసన్, డా॥ క్లారాసాంసన్ L. M. P. మొదలైనవారి ఉపన్యాసములు చికిత్సాపద్ధతులు రోగ విజ్ఞానములను వివరించిన సంస్థలోపాల్గొని యోగ్యతాపత్రములు పొందినారు. వీరి వయస్సు 50 సంవత్సరములు. అనుభవముతో ప్రజాగౌరవమునొందుతూ బాపట్ల తాలూకా పేరాలగ్రామములో నివసించుచున్నారు.



రాజవైద్య వై. రాఘవేంద్రవర్మగారు,
ఆయుర్వేద, మెడికల్ ప్రాక్టీషనరు.
ముద్రపల్లె గ్రామం, కడపజిల్లా.

వీరు ఆనువంశిక ఆయుర్వేద వైద్యులు. ప్రస్తుతం రాజంపేటలో ఆయుర్వేద వైద్యశాల నెలకొల్పి రాజంపేటలో యున్నారు. వీరికుటుంబం పూర్వము మట్లిరాజావారిఆస్థాన పండితులుగ యుండి అనేక ప్రశంసలు అందుకొనియున్నారు. ప్రస్తుతం కడప జిల్లా ఆయుర్వేద మండలి ఉపాధ్యక్షులుగా యున్నారు.



వైద్యశ్రీ వరదా రామారావుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
జట్లపాలెం, తాడేపల్లిగూడెం తాలూకా.

వంశపరంపరగా ఆయుర్వేద విద్యములో నైపుణ్యము గణించిన వైద్యశ్రీ వరదా భుజంగరాయుడు గారి కుమారులు శ్రీ రామారావుగారు. వీరు ఆరోగ్య రక్షణలేని దేశంలో ఆయుర్వేదం నిరాడంబరముగా ఎట్టి ప్రయోజనము కల్గించ గలదో నిరూపించుటే ఆశయంగా రోగులలో అహర్నిశలు మునిగి తేలుతుంటారు. ఇట్టి ఉన్నతాశయముగల రామారావుగారికి శ్రీ భగవాన్ ధన్వంత్రి సర్వదా రక్షణ లిచ్చుగాక.



వైద్యశ్రీ నందనవనం రామారావుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
పోకూరు, కందుకూరు తాలూకా, నెల్లూరుజిల్లా.

వీరు మాధ్యమిక (S. S. L. C.) విద్యను పూర్తిగావించిరి. సంస్కృతాంధ్ర భాషలయందు వీరికి మంచి ప్రవేశముగలదు. హిందీ, తమిళ భాషలనుకూడ ధారాళముగ మాట్లాడగలరు. సరళ స్వభావులు. కొంతకాలము విజయవాడ, శ్రీ వెంకటేశ్వర ఆయుర్వేద కళాశాలయందు వైద్యవిద్య నభ్యసించిరి. తమ అభిమాన విద్యయగు దీనిని స్వీయకృషిచే కొనసాగించి మంచి జ్ఞానానుభవమును గడించిరి.

కొంతవఱకు కృషిసలిపియు, దేశీయ విధానమునకును, ఇతర పద్ధతులకునుగల మూల సిద్ధాంత పద్ధతులను సమన్వయ పఱచుకొనుచు, ఆయుర్వేద విధానము ననుసరించుచున్నారు.

శిశుచికిత్సయందుగల ప్రత్యేకత వీరికి మంచికీర్తి ప్రతిష్టలను చేకూర్చినది. స్వయంకృషిజేసి శిశువ్యాధులకు ప్రత్యేకౌషధములను కనుగొని యున్నారు. తమ స్వంత యౌషధములనే శిశుచికిత్సా విధానమున యెక్కువగా నుపయోగింతురు. శిశుచికిత్సను వీరుచితముగ చేయుదురు. ఈ వృత్తియందు వీరికీ ప్రాంతమున మంచి పేరుగలదు.



ఆయుర్వేద వైద్యవిద్వాన్
ఆలపాటి వరదయ్యా చౌదరిగారు
పొన్నూరు, గుంటూరుజిల్లా.

వీరు The Chronic Disease Research Institute. (దీర్ఘరోగ పరిశోధనా సంస్థ) యందు ప్రధాన వైద్యులు. వీరు సుమారు 30 సంవత్సరములనుండి శాస్త్రానుభవముతో ఆయుర్వేద వైద్యమును చేయుచున్నారు అఖిల భారతానువంశీకాయుర్వేద వైద్యసంఘమున కార్యవర్గ సభ్యుడుగను, కొంతకాలము సహాయ కార్యదర్శిగను పనిచేసిరి.

పరిణామశూల, అన్నద్రవశూల (Gastric ulcers Etc.) ఉబ్బసము, మూల, భగంధరము, రక్తప్రదరము మొదలగు అసాధ్య కష్టసాధ్యములైన దీర్ఘవ్యాధుల నివారణకు కొన్ని సంవత్సరములనుండి ఆయుర్వేద వైద్యమున తీవ్రపరిశోధనలు చేయుచున్నారు. ముఖ్యముగా పరిణామాది శూలకు అద్భుతముగా పనిచేయు దివ్యౌషధమును కనిపెట్టి యున్నారు. కొన్నిరకములైన ఉబ్బసముల మీదకూడ గట్టిగ పనిచేయుగల యౌషధమును సాధింపగలిగిరి. శాహ్ దవాయియా యను వైద్యగ్రంథమును తెనిగించిరి రోగనిర్ణయములో సమర్థులని పేరుగాంచిరి.



వైద్యశ్రీ
పాశేపల్లి లక్ష్మయ్యగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
అత్తోట, తెనాలి తాలూక.

శ్రీ లక్ష్మయ్యగారు వీరయ్యగారి పుత్రులు. ఆయుర్వేద పండితులైన శ్రీ ములుగు రామలింగయ్యగారివద్ద, ఏలూరులో శ్రీ కందుకూరి వెంకటసుబ్బారావుగారివద్ద ఆయుర్వేదమును చదువుకొన్నారు. చికిత్సా పద్ధతుల నైపుణ్యము సంపాదించారు. శ్రీ టి. లక్ష్మీనారాయణ, బి. ఎ. యం. బి. బి. యస్. గారివద్దను కొంతకాలం శుశ్రూష చేసినవారు. వీరికి వైద్యములో 25 యేండ్ల అనుభవముగలదు.

---

## చిగుళ్లవాపు

రోగం చిన్నదే – అసాధ్యమైన బాధ!! చిగుళ్ళవాపు, రక్తము పడుట, దుర్వాసన – ఆశ్చర్యకరముగా "క్రియాకల్పం" నివారించగలదు. క్రియాకల్పంతో దంతములు తోముకొనుట – లోపలికి సేవించుట – అన్నివిధాల క్రియాకల్పము అమృతతుల్యమే—



ఆయుర్వేదభిషక్, కవిరాజ
వడుగూరు వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
రాచర్ల, డోన్ తాలూకా, కర్నూలుజిల్లా.

స్వర్గీయ కె. సుబ్రహ్మణ్యశర్మగారి శిష్యులు. నాలుగు వత్సరములు లక్ష్యలక్షణసమన్వితముగా ఆయుర్వేదము నభ్యసించి భిషక్ పరీక్ష యందు త్తీర్ణులై 1947 వ సంవత్సరం స్వగ్రామమున వైద్యవృత్తి ప్రారంభించి అతిస్వల్ప కాలముననే మంచి చికిత్సకులుగాను, పేరుగాంచి ప్రజాదరణ చూరగొనిరి.

1951 వ సంవత్సరం గవర్నమెంటు వారిచే నడుపబడు గ్రామ వైద్యశిక్షణ యందు త్తీర్ణులై ప్రభుత్వ రిజిష్టరు బడసినారు.

ప్రస్తుతం కోయిలకుంట్ల తాలూకా పెట్నికోట గ్రామములో ఆర్. యం పి. గా పనిచేయుచూ, కేవల హీనస్థితిలోని వైద్యశాల నభివృద్ధి గావించి, ఆయుర్వేద చికిత్సా పద్ధతులచే చికిత్సలు చేయుచూ అచ్చట ప్రజాభిమానం చూరగొని, వైద్యశాల, నూతన భవననిర్మాణము గావించి, కేవలం ప్రజల అభిమానముతోపాటు ప్రభుత్వాభిమానము పొందినారు.

ఆంధ్రప్రదేశ ఆయుర్వేదమహామండలి సభ్యులై, పెక్కు సభలకు హాజరై ఆయుర్వేద ప్రచారములు సల్పుచూ, ఆయుర్వేదాభ్యున్నతినే సర్వదా గోరువారు.

తరములుగా వచ్చు అనువంశిక ఆయుర్వేద వంశమునకు చెందినవారు పెక్కు గ్రామాభివృద్ధి కార్యములలోను పాల్గొని గ్రామాభివృద్ధి కార్యములు గావించినారు.



వైద్యశ్రీ
చింతపల్లి వెంకట సుబ్బారావుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
యనమదల, (వయా) ప్రత్తిపాడు, గుంటూరుతాలూక.

వీరు శ్రీ చింతపల్లి హనుమయ్యగారి జ్యేష్ఠపుత్రులు. వీరికి ఆయుర్వేద వైద్యవిద్య జన్మతః సంక్రమించింది. చింతపల్లి వారి వంశం అంతా వైద్యవిద్యా పాండిత్యంలో రాటు తేలినదే! వీరి పూర్వికులు బిషగ్రత్న శిఖామణులై ప్రభువుల పాలకంలో మడిమాన్యాలుకూడా పుష్కలంగా సంపాదించారు. వీరు నిరంతరం అసంఖ్యాకమైన ప్రజాసమూహానికి అత్యంతాదరంతో వైద్యసహాయం చేస్తున్నారు. ఉదారగుణ భూషితమైన వీరి ప్రజాసేవానురక్తి సుప్రసిద్ధమైనది.

## మూత్రవిసర్జనలో శుక్లము

మూత్రవిసర్జనకు ముందో వెనుకో శుక్లము పోగొట్టుకొనువారున్నారు. ఎన్నో మందులు తిని విసిగిపోయినవారున్నారు. "క్రియాకల్పం" వాడండి. విసుగుదల ఎందుకో—



వైద్యశ్రీ

**సంపత్ మునుస్వామిగారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

పలమనేరు, చిత్తూరుజిల్లా.

శ్రీ మునుస్వామిగారు చిన్నతనములోనే ఆయుర్వేదశిక్షణ పొందినారు. చికిత్సలలో మంచి ప్రజ్ఞాగలవారు. ఉపాధ్యాయ వృత్తిలో వుంటూ ఆయుర్వేద చికిత్సలు నెరపుతున్నారు. వీరి శిష్యులలో ఆయుర్వేద పరిజ్ఞానమెంతో సంపాదించు కొనగలిగినవారున్నారు. ఆయుర్వేదం ప్రతిష్ఠవంతమగుటకు, ప్రజారోగ్య మగుటకు ఉపాధ్యాయులు ఎంతో ఉపకరించుచున్నారనుటకు శ్రీ మునుస్వామిగారు ఎంతో తార్కాణము.



వైద్యశ్రీ

**పి. వెంకటరంగస్వామిగారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

రామరాజపల్లె, గుత్తిపోస్టు, అనంతపురంజిల్లా.

వీరు స్వతంత్రంగా ఆయుర్వేద విద్యను అభ్యసించి అభివృద్ధిపొందినవారు. బహుముఖంగా ప్రజాసేవ చేయగల్గినవారు. పేదవారంటే శిరసావహించి ఆదరణతో వైద్యమొనరించు ప్రజ్ఞాశాలురు. వీరు పండిత టి. తిరువెంగళయ్యగారి ప్రియశిష్యులు.



వైద్యశ్రీ

**జి. యం. సుభహాన్ ఖాన్**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

గుత్తి, అనంతపురంజిల్లా.

హకీం సుభహాన్ ఖాన్ చిన్నవయస్సులోనే, తండ్రిగారి ప్రోత్సాహం, గురువు హకీం సయ్యద్ సుల్తాన్ మోద్దీన్ హుసేన్ గారి తరిఫీయ్యాదు మంచి వైద్యుడుగా తయారుచేసినది. యూనాని, ఆయుర్వేదములోకూడా శిక్షణ పొందగలిగారు. ఉబ్బస దగ్గులు, గుల్మరోగములు నివారించుట వీరి ప్రత్యేకత.



☆

వైద్య శ్రీ రాజవైద్య యం. ప్రభుదాస్ వారిసతీమణితో కవిరాజపత్రికా కార్యాలయము సందర్శించినప్పుడు సంపాదకులు శ్రీ మోహన్ గారితో ఇష్టాగోష్ఠి జరుపుతున్న సందర్భములోని ఛాయాచిత్రము.





డా॥ యం. సూర్యనారాయణగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
గుత్తి, ఆర్. యస్.

వీరు గుత్తితాలూకా ఆయుర్వేద వైద్యమండలి అధ్యక్షులు. నిపుణులైన వైద్యులు. యల్. ఐ. యం. పరీక్షలో కృతార్థులైనవారు అనేకమంది వైద్యశిష్యులను సృష్టించుకొన్నారు.



ఆయుర్వేద విశారద
వి. పెద్దమునిరాజుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
గుత్తి, అనంతపురంజిల్లా.

వీరు చిన్ననాడే ఆయుర్వేదవిద్య నభ్యసించినవారు ...వ్యముతో ఆయుర్వేద చికిత్సలు జరుపుతున్నారు. ...మంది వైద్యులను తయారుచేసినవారు గుత్తితాలూకా ఆయు- ర్వేద వైద్యమండలి ప్రధాన కార్యదర్శి.



వైద్యశ్రీ
సి. వి. యస్. నాయుడుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
బళ్ళారి

ఆయుర్వేద చికిత్సలద్వారా దీర్ఘమైనవ్యాధులు నివారించు చున్నారు. వీరికి అనేక వైద్యవిధానములలో పరిచయము గలదు. జనరంజకమైన వైద్యము ఆయుర్వేదమేనని విశ్వసించిన ఆయుర్వేద వైద్యులు.



వైద్యశ్రీ
దీవి అనంతరామాచార్యులుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
కొచ్చర్ల, వినుకొండ తాలూక.

వీరు శ్రీమాన్ దీవి రామాచార్యులుగారి ద్వితీయపుత్రులు వీరి వైద్యశాస్త్ర పరిశీలన బహుముఖమైనది. రోగము నివారించుటకు «వుపకరించే దేఔషధమని» రోగి తక్షణ నివారణమే గోరుచుండునని - ఔషధ నిర్ణయములో బహు కృషి చేయుదురు. ఆయుర్వేద శాస్త్రము గురుముఖముగా అభ్యసించినవారు. వినుకొండ తాలూకా ఆయుర్వేదమండలి ప్రధమ ఉపాధ్యక్షులు.



కవిరాజ, ఆయుర్వేదకేసరి
రాజోలు సుబ్రహ్మణ్యశర్మగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

వీరు శ్రీ యస్. యస్. వి. శ్రీనివాస ఆయుర్వేద ఫార్మసీ స్థాపకులును, ఆయుర్వేద వైద్యమునందు పేరు ప్రఖ్యాతిలు గణించి, పలువుర ప్రముఖులచే యోగ్యతా పత్రములును, మన్ననలను పొందిన సుప్రసిద్ధ వైద్యులు. వీరు ఆయుర్వేదమునందు క్రమశిక్షణతో విద్యాభివృద్ధిని పొందించు చున్నవారు.

వీరు వైద్యభూషణ రాజోలు సుబ్రహ్మయ్యగారి మనుమలు ప్రాచీన ఆయుర్వేదశాస్త్ర వైద్యులగు శ్రీ వెంకటేశ్వర్లుగారి కుమార్లు. తాత తిరములనుండి గిడుతూరు పురనివాసులు. సర్వశిద్ధి తాలూకా తెర్వపల్లి గ్రామ కాపురస్థులును, ఇండియన్ గవర్నమెంటులో ఆయుర్వేద వైద్యశాస్త్రమందు రిజిస్ట్రీషను పత్రము పొందిన వెలచలపల్లి సుబ్బారావుగారి మేనల్లుళ్ళు.



వైద్య శ్రీ
పుత్తూరు వెంకటరమణప్పగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

వీరు సుప్రసిద్ధ ఆయుర్వేద కటుంబములో పుట్టిపెరిగినవారు. సులభప్రాయంగా చికిత్సాపద్ధతులు నిర్వహించు సమర్థులు. పేదసాదలంటే ఆదరాభిమానములు వెల్లడిస్తారు. రోగనివారణలో శీఘ్రగతిని సహకరించు ఔషధములను ప్రేమిస్తారు. ఆయుర్వేదసంఘాల కత్యంత సహాయ సంపత్తి లభింపచేయుచుందురు



వైద్యశ్రీ పి. యల్ మోజస్‌గారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
పరిపల్లి, రావపురం, పశ్చిమగోదావరి జిల్లా.

శ్రీ మోజెస్ రాజవైద్యుడు, పశువైద్యాచార్యుడు. పశువైద్యములో ఘనతపొంది ఔషధములు నిర్మించి గ్రామ ప్రజానీకానికి అందచేయుచున్నారు. శ్రీ మోజెస్ ఆంధ్ర ప్రదేశ ఆయుర్వేద మహామండలి స్థాయిసమితి సభ్యులు. ఆయుర్వేద ప్రచారములో గణ్యత చూపుతున్న వారు ఉత్తమ ఆయుర్వేద వైద్యులు.



డా॥ ఆర్. జాన్ గారు
హోమియో మెడికల్ ప్రాక్టీషనరు

వీరు అయిదేండ్ల బాలుడైయుండ జననీ జనకులు పరలోక యాత్ర సాగించిరి. ఇటాలియన్ ఆర్. సి. మిషనరీలు పెంచి పెద్దవానినిజేసి విద్యాబుద్ధులుగరపి చక్కని వైద్యశిక్షణ మొసంగిరి తదుపరి వీరు "ఆంధ్ర హోమియో మెడికల్ కాలేజీ" సంస్థాపకులున్నూ, కాలేజీ ప్రిన్సిపాలు గారునైన శ్రీ బి. యల్. నారాయణరావు (ఎ. యం. బి. యస్ అండ్ హెచ్. యం. బి.) గారి శిష్యుడై "హెచ్. యం. బి." పరీక్షలో ప్రథమశ్రేణియందు ఉత్తీర్ణులై, "హోమియో మెడికల్ ప్రాక్టీషనరు" అని దివ్యమైన యోగ్యతా పత్రమును గడించి పల్లెలలో చక్కని వైద్యమును జేయుచున్నారు.

---

## వీర్యవృద్ధికి

ఎన్నో మందులు వాడుతారు. [illegible] 40 రోజులు సేవించండి. ప్రభావం ఎంత [illegible] అర్థమవుతుందో ?

---



వైద్యశ్రీ కవిరాజ
గడ్డము హనుమంతరావుగారు
(ప్రసిద్ధ మూలవ్యాధి చికిత్సా నిపుణులు)
గాంధీనగరం : విజయవాడ.

వీరు సౌభాగ్యాయుర్వేద నిలయమును స్థాపించి మూల వ్యాధులు, ఆసన లూటీలు, మేహరణములు, సుఖసంకట ములు, స్త్రీలకు కలిగే రక్తకుసుమములు, తెల్లకుసుమములు, ఒహిష్టులో వచ్చే బుతుశూలలు, స్త్రీల గర్భజరోగములు, రెండు మూడు నెలలకు బయటచేరే సంధిబంధములు, రక్త గుల్మములు, నీటిగుల్మములు ఆపరేషన్ లేకుండా మూలికా యోగముచేతనే గ్యారంటీగా కుదుర్చుచున్నారు.

నలభైఅయిదు సంవత్సరముల నుండియు విశాలాంధ్రలో ఎంతోమందికి బాగుచేసి యెన్నియో యోగ్యతా పత్రములు పొందియున్నారు.

స్త్రీలకు స్త్రీలే వైద్యము చేయుదురు.



రాజవైద్యాచార్య, హరికథాసుధార్ణవ వైద్యశ్రీ
ఉరిటి బలరామదాసుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
ఏలూరు, ప. గో. జిల్లా.

విద్వద్వైద్యులైన శ్రీ దాసుగారు కవి, పండితుడు, రాజ వైద్యాచార్యుడు. ఆధ్యాత్మిక తత్వవేత్త. ఔషధ నిర్మా ణములో చాకచక్యము గలవారు. చికిత్సా పద్ధతిలో ప్రసి ద్ధులు. వారి నిరంతర హరికథా కాలక్షేపములలో ఆయు ర్వేదం అభ్యున్నతికై వాస్తవిక ప్రచారము చేయు ఆయు ర్వేద భక్తులు. వీరు రామాయణ, భారత, భాగవతాదులను హరికథలుగా వ్రాసినవారు. అనేకములైన తాళపత్ర గ్రంధ ములనుండి చికిత్సాపద్ధతులను సేకరించి అనుభవమునకు తెచ్చు కొని సాటి వైద్యలోకమున కందించుచున్నారు.



సి. హెచ్. కె. ఆ[illegible]రు

ఆయుర్వేద మెడికల్ [illegible]నరు

పెరికెశింగవరం, ఖమ్మ[illegible].

శ్రీ ఆచార్యగారు ఆయుర్వేద [illegible]లలో సూక్ష్మ దృష్టితో రోగ నివారణోపాయముల [illegible] కృషిచేయుచున్న వారు. అధికప్రజల ఆదరాభిమానము [illegible]ంపాదించుకొన్న వారు. వారి గ్రామపంచాయతీ బోర్డు [illegible]సిడెంటుగా వీరు ఎన్నికయైనవారు. వారి పంచాయతీ [illegible] పాలనలో సుస్థిర మైన ఆయుర్వేద చికిత్సలకు చక్కని [illegible] దము యేర్పరచు టకై కృషిచేయుదురని సాటి వైద్య[illegible] ఆశింపుచున్నది.



వైద్యశ్రీ

పట్నాయకుని ప్రసాదరావుగారు

ఆయుర్వేద మెడికల్ [illegible] వనరు

కనుపూరు, [illegible]డి.

శ్రీ ప్రసాద[illegible] [illegible]లైన స్వర్గీయ శ్రీ పట్నాయకుని [illegible] [illegible]త్రులు. తల్లి నరస మాంబ. వీరు [illegible] ప్రజాగౌరవము చికిత్సా సౌలభ్యము [illegible]రు. బాల్యమైనను అనువంశిక వైద్య[illegible] బయుల [illegible] పద్ధతులు జీర్ణించు కొనియుండును గనుక [illegible] [illegible]వించుచున్నారు.



వైద్యశ్రీ

కంఠిమహంతి రంగారావుగారు

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

కణలపూరు, రాజమండ్రితాలూకా.

శ్రీ రంగారావుగారు ప్రముఖ ఆయుర్వేద వైద్యులైన శ్రీ రాజ వైద్యాచార్య కంఠిమహంతి అప్పలస్వామిగా పుత్రులు. వంశపరంపరా వచ్చుచున్న ఆయుర్వేద వై[illegible] మును వీరు ప్రధానవృత్తిగా నేకరించి తమ పూర్వుల పదచ్ఛా యలలో గ్రామీణప్రజల ఆరోగ్య సౌభాగ్యములకై కృషి చేయుచున్నారు.



వైద్యశ్రీ యస్. యస్. యస్. మూర్తిగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
మాలాంచారోడ్, ఖర్గపురం

వీరు ఆయుర్వేద వైద్యపద్ధతులు అమూల్యముగా రోగులకు మేలు కల్గించుచున్నవి. ఆధ్యాత్మిక చింతనా తత్పరులై ప్రజలయందాదరణ పెంపొందింపుచు, స్వయం శక్తితో ఔషధ నిర్మాణము చేయుచు గణ్యాతి పొందుచున్నారు.

రాష్ట్రాంతరములో నుండినను ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలికి సభ్యులై, కవిగాజపత్రికా పోషకులై ఆయుర్వేదాభివృద్ధికి ఇతోధికముగా సేవలొనరించు చున్నారు.



వైద్యరాజ యం. ...సుదేవశింగ్‌గారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
అగ్రహారం. గుంటూరు

శ్రీ శింగ్‌జీ శిద్ధవైద్యంలో మంచి ప్రవేశం గలవారు మూలికా పరిశోధన చేయుచున్నవారు. రస ప్రయోజనములను గుర్తించు చున్నవారు. ప్రజలలో మంచి పలుకుబడి గల వైద్యులు. నిరంతరం విద్వద్వైద్యుల గోష్ఠితో, అనుభవ వైద్యుల ఆదరాభిమానములతో అనేక కఠిన వ్యాధులను కుదర్చగల్గినవారు. వీరు గుంటూరు తాలూకా ఆయుర్వేద మండలికి ఉపాధ్యక్షులు.



మగు ...డ పాపయ్య శాస్త్రిగారు
ఆ... ర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
...పల్లి, తూర్పుగోదావరిజిల్లా

శ్రీ శాస్త్రి ... యుర్వేదము గురుముఖంగా శిక్షణపొంది పరిశోధనా ...ష్ట... ఆదర్శ ప్రాయకంగా చికిత్సలు జరుపుచుందురు. ... నిరాడంబరులో అంతటి ప్రజ్ఞానిధులు. వీరికి భగవా... ధన్వంతరి ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగుగాక





వైద్యశ్రీ నేరెళ్ల వెంకటాచార్యులుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
శిరిశిల్ల, కరీంనగరంజిల్లా.

వీరు శ్రీమాన్ నేరెళ్ల రాఘవాచార్య, గోపమ్మ పుణ్య దంపతుల అనుంగు పుత్రులు. వీరు కళామయి ప్రపంచములో మునిగి తేలుతూ అనేక సుఖ్య శాస్త్రీయ విషయములలో గణ్యత పొందారు శుద్ధాయుర్వేదమే దేశానికి శరణ్యమని నమ్మికగల ఆయుర్వేద వైద్యులు. తమ ఆశయములను వెదజల్లుటకు శిరిశిల్ల తాలూకా ఆయుర్వేద మండలిని చేబట్టి కార్యదర్శిగా నున్నారు. చికిత్సా పద్ధతులలో మంచి నైపుణ్యము గలవారు.



కవిరాజ రాపర్తి అప్పారావుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు, రాజమండ్రి.

వీరు పిఠాపుర వైద్యులు. రాజవైద్యాచార్య శ్రీ రాపర్తి గంగారావుగారి జ్యేష్ఠపుత్రులు. తండ్రిగారివద్ద శిక్షణ పొంది అసాధ్య రోగములను సాధ్యపరచి ప్రజారంజకముగా జీవించుచున్నారు. శ్రీ గోపాలకృష్ణ ఆయుర్వేద నిలయం స్వంతదారులు. విద్వద్వైద్యులు.



వైద్యరాజ
బూదాటి వెంకటేశ్వర్లుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
గణపవరం, బాపట్ల తాలూక.

వీరు వారితాత తండ్రులనుండి వంశపరంపరా ఆయుర్వేద వైద్యులు. గ్రహచికిత్సలయందు నిపుణులు. వంశీయుల కీర్తి ప్రతిష్టలకు వన్నెకల్గించుటకు శ్రీ వెంకటేశ్వర్లుగారు ఎంతో కృషిచేయు చున్నారు. గొప్ప ప్రజాభిమానము చూరగొన్నవారు. రాజౌషధము లన్నియు శాస్త్రరీత్యా వారు స్వంతముగా నిర్మించగలరు. శ్రీ గౌరీశంకర ఆయుర్వేద నిలయమునకు స్వంతదారులు. విద్వద్వైద్యులు.



వైద్యశ్రీ
ముక్కపాటి ఫణిశాస్త్రిగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
కణుపూరు, రాజమండ్రితాలూకా.

శ్రీ శాస్త్రిగారు భిషగాచార్యుడు శ్రీ ముక్కపాటి సీతారామయ్యశర్మగారి పుత్రులు. తండ్రిగారి వద్దనే శిక్షణ పొందినవారు. చికిత్సా పద్ధతులలో సత్వర రోగనివారణకు అవసరమైన విధానములు సేకరించుటకు కృషిచేయుచు, వంశములోని వైద్యప[illegible] నిలుపుచున్నారు.



వైద్య[illegible] [illegible]టి సీతారామయ్యగారు
[illegible] మెడికల్ ప్రాక్టీషనరు
[illegible], పతెనాపు తాలూకా.

వీరు శ్రీ ధన్వంతరి పానుగంటి బాపయ్య వైద్యమహాశయుని పుత్రులు. వీరి ఆనువంశిక వైద్యములో శరీరవ్యాధులైన క్షయ, యకృత్-ప్లీహ, మొదలైన వ్యాధులలో ప్రత్యేక చికిత్సలు జరుపు కీర్తిగలదు. పెద్దల పదచ్ఛాయలలో శ్రీ సీతారామయ్యగారు ప్రజాగౌరవముతో చికిత్సా నైపుణ్యము గలిగి జీవించుచున్నారు.



వైద్యశ్రీ
భోగాపురపు సింహాచలముగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
లక్ష్మీపేట, కొప్పర P. O. శ్రీకాకుళంజిల్లా.

వీరు వైద్యవిద్వాన్ చదువుకొన్నారు. తండ్రి శ్రీనివాసంగారు. చక్కని ఆయుర్వేద చికిత్సలు జరుపుతూ ప్రజాగౌరవము, మరెన్నో సువర్ణ కంకణములు పొందినవారు. ప్రాణాచార్యుల బాధ్యతలను గుర్తించి మెలగుచున్నవారు.

---

## కడుపుబ్బరం - శూల

వైద్యులు "శ్రీ నారాయణరావు గణపవరం నుండి అయిదేండ్లుగా బాధపడుతున్న కడుపుబ్బరం నొప్పి గల రోగికి క్రియాకల్పం సేవింప చేయించి పొందిన ప్రయోజనం చరిత్రాత్మకమైనదని వ్రాయుచున్నారు."

# మంత్రవైద్యప్రవీణ ఇలిపిళ్లె అప్పారావు పాత్రుడుగారు

నాగేంద్రదేవాలయము,

## కొత్తపేట :: విజయవాడ-1.

శ్రీ అప్పారావు పాత్రుడుగారు తమ మంత్రవైద్య తీర్థప్రసాదములచే గ్రహ, ఉన్మాద, దీర్ఘరోగములు నివారించు చుందురు. అరువదియేండ్లు దాటినను విశ్రాంతి యనునది కోరక రాత్రి పగలును రోగార్తుల రక్షణకై శ్రద్ధ వహించెదరు. వారి చికిత్సలో కృతార్థులైనవారిలో కొన్ని దృశ్యములు యీ క్రింద ముద్రించినవి









అన్నివివరములకు పై విలాసమునకు వ్రాసి తెలిసికొన వచ్చును.



**వైద్యశ్రీ పి. వి. చెన్నప్పగారు**
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
పత్తికొండ, కర్నూలుజిల్లా.

వీరు విద్వద్వైద్యులు ఆర్. జంబులయ్యగారి శిష్యులు. చక్రపాణి తరిఫీదుపొంది ఆయుర్వేద వైద్యము చేయుచున్నారు. మూలికా వైద్యములో మంచి నిపుణులు



**వైద్యశ్రీ తామరపల్లి గంగాధరంగారు**
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
బొల్లెద్దుపాలెం, రాజమండ్రి తాలూకా.

వీరు శ్రద్ధతో రోగములు నివారించుటకు, ఆయుర్వేద గ్రంథములు, నిరంతర పరిశీలన చేయుచుందురు. మంచి చికిత్సకులు.



**వైద్యశ్రీ దగ్గుప[illegible]రావుగారు**
ఆయుర్వేద మెడికల్ [illegible]షనరు
బొల్లెద్దుపాలెం. రా[illegible] తాలూకా.

వీరు ఆయుర్వేద శిక్షణపొం[illegible] మం[illegible] చికిత్సలు చేయుచు ప్రజాభిమానము చూరగొనుచున్నా[illegible]



**వైద్యశ్రీ కొమ్మోజు సత్యనారాయణగారు**
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
బొల్లెద్దుపాలెం, రాజమండ్రి తాలూకా.

సూక్ష్మగ్రాహి - చికిత్సా నైపుణి. ప్రజాభిమానం రోగ నివారణలో నిరూ[illegible] కొను చున్నారు.

వైద్యశ్రీ
కె. శ్రీనివాసపిళ్లగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
ఎర్రపల్లె, చిత్తూరుజిల్లా.

వైద్యానుభవము దాదాపు ముప్పదియేండ్లు గలదు. చికిత్సలు తక్షణ నివారణకు తోడ్పడును దీర్ఘవ్యాధుల నిర్మూలన ప్రశంసనీయము వీరిది వంశపరంపరా వచ్చుచున్న వైద్యము. వీరు బసవరాజీయము, చరకము, భైషజ్య రత్నావళి యను గ్రంథముల నాశ్రయించి విజ్ఞానాభివృద్ధి పొందించుకొన్నట్లు వ్రాయుచున్నారు. మంచి అనుభవజ్ఞులు.

వైద్యశ్రీ కూరపాటి రామరాజుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు, కుంకలగుంట.

శ్రీ రాజుగారు బాల్యమైనను ఇంటి వైద్యములో నైపుణ్యము ప్రదర్శించి ప్రతిభావంతముగా చికిత్సలు చేయు చున్నారు. పేదప్రజానీకపు కష్టసుఖములు గుర్తించి ప్రజా వైద్యమైన ఆయుర్వేదములో ఆదర్శవంతమైన రోగనివారణోపాయములు ప్రదర్శించు చున్నారు. అనువంశిక కుటుంబములలో వయస్సు ప్రధానము కాదని - చికిత్సలలోనే గొప్పతనముకలదని రూఢపర్చదగినవారని రాజుగారు ప్రశంసనీయులు.

వైద్యశ్రీ మామిళ్లపల్లి వెంకటసుబ్బారావుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
చుండూరు, తెనాలితాలూకా.

వీరు సుప్రసిద్ధ వైద్యకుటుంబములోనివారు. శ్రద్ధతో ఆయుర్వేద చికిత్సలు జరుపుచున్నారు. సూత్మగ్రాహి. సాటి వైద్యుల మన్నన గలవారు. ప్రజారంజకమైన జీవితము గడుపుచున్నారు. ప్రజారోగ్యమే తమభాగ్యమని నిరంతర దీక్షతో మెలగుచున్నారు.

---

## నిద్రాభంగం

మిత్రుడు పరమేశ్వరరావు వ్రాసిన "క్రియాకల్పం" ప్రయోజనములలో ఎంతోకాలంగా నిద్ర లోపించిన రోగిపై ప్రయోగించగా - ఆశ్చర్యమైన ప్రయోజనం కల్గిందని వ్రాస్తున్నారు.

---



**వైద్యశ్రీ**

**కవిరాజ కేశవజాల కృష్ణమూర్తిగారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

వెలగలేరు, (వయా) విజయవాడ.

శ్రీ మూర్తిగారు వైద్యవిద్యలో నైపుణ్యము కల్గియు; సాధారణ గ్రామములో నివసించుచున్నారు. ఆశయము కుగ్రామములలో ఆరోగ్యరక్షణలో శ్రద్ధవహించుటకే. శ్రీ కృష్ణమూర్తిగారు ఔషధ కల్పం విజ్ఞానవంతమైనది. ప్రతిభగల వైద్యులు.



**వైద్యశ్రీ లేపాక శేషయ్యఆచారిగారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

కొండపేట, కడపజిల్లా.

వీరు వంశపరంపరా ఆయుర్వేద వర్ణమునకుచెంది మంచి నైపుణ్యముతో చికిత్సలు జరిపి గౌరవజీవనం చేయుచున్నారు.



**వైద్యశ్రీ ఇబ్బిల తిప్పయ్యగారు**

నల్లమేకలపల్లె, డోన్ తాలూకా.

వీరు ప్రముఖ ఆయుర్వేద వైద్యులైన ఇబ్బల బసవయ్యగారి అన్నకుమారులు. ఆయుర్వేదవిద్య శ్రీ బసవయ్యగారి వద్దనె అభ్యసించారు. కళోపాసకులు. మంచి చికిత్సా పద్ధతులు అలవర్చుకొని కీర్తిగణించుకొంటున్నారు.

## ★ బరువైన శరీరము ★

తమ శరీరం తమకే భారంగావున్నట్లు బాధపడుతున్నవారు క్రియాకల్పం సేవించి ఆరోగ్యం పొందవచ్చు.



వైద్యశ్రీ అవనిగడ్డ నాగభూషణంగారు
గోపాలరెడ్డిరోడ్డు : : విజయవాడ-2.

శ్రీ నాగభూషణంగారు ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి కార్యవర్గ సభ్యులు, కృష్ణాజిల్లా మండలి ప్రధాన కార్యదర్శి. వీరు విఖ్యాత ఆయుర్వేద వైద్యులైన స్వర్గీయ శ్రీపోతరాజు వర్మగారి శిష్యులు. విజయవాడలోని మహాత్మ గాంధి ఆయుర్వేదాశ్రమములో ఔషధనిర్మాణం, చికిత్సా పద్ధతులు అలవర్చుకొన్నారు. ఆయుర్వేద చికిత్సాపద్ధతులతో మంచి నైపుణ్యము గలవారు. వీరు విజయవాడ ఆయుర్వేద ఫార్మశీ నడుపుచున్నారు.

## కొరింత దగ్గులు

బిడ్డల కోరింతదగ్గులకు విడువక కొంతకాలం తేనె, వెన్నలలోచేర్చి క్రియాకల్పం వాడించిన మంచి ఆరోగ్యమును కలిగించును.



రాజవైద్యాచార్య
వైద్యశ్రీ పేరేపు సన్యాసిరావుగారు
ప్రొప్రయిటర్
శ్రీ రాజరాజేశ్వరి ఆయుర్వేద నిలయం
కలివరం, దూసి R. S. శ్రీకాకుళంజిల్లా.

వీరు ఆయుర్వేద వైద్యశాస్త్ర నైపుణులైన విద్వద్వైద్యులు. వీరు చికిత్సాభాగంలో ఎంత నిపుణులో ఔషధ నిర్మాణములో అంతటి ఘటికులు. అనేక అసాధ్యరోగములను నివారించిన ప్రముఖ ఆయుర్వేద వైద్యులు.

## మానని పుండ్లు

'క్రియాకల్పం' గ్లాసు నీళ్ళలో 2 గ్రైనులుకలిపి ఆ నీటితో పరిశుభ్రపరచుతూ పుండుపై తిరిగి క్రియాకల్ప భస్మం చల్లినచో ఎంతటి మాననివ్రణాలయినా మానగలవు.



బ్రహ్మశ్రీ ధరణికోట జాలయ్యగారు
రామకృష్ణాపురం - చీరాల.

వీరు అనువంశిక విద్వద్వైద్యులు, ఆయుర్వేద వైద్యులు. తాతతండ్రులు ఒంగోలుతాలూకా నాగులుప్పలపాడుగ్రామం. తాతగారు బ్రహ్మశ్రీ ధరణికోట కోటయ్యగారు. వీరు దేవ శిల్పనిర్మాతలును, ఆధ్యాత్మికయోగవిజ్ఞానులును, ఆయుర్వేద విజ్ఞానులును. వీరి తృతీయ కుమారులు బ్రహ్మశ్రీ ధరణికోట బ్రహ్మయ్యగారు ప్రజోపయోగ ఉచిత ఆయుర్వేద వైద్యులు. వీరి కుమారులే జాలయ్యగారు. వీరు 16 సం॥ వయస్సులో గుంటూరు జిల్లా బాపట్లతాలూకా చీరాలగ్రామం నివాసంగా యేర్పడివుంటూ చిన్నతనమునుండి తండ్రిగారివద్ద సంధ్యావందన ప్రాణాయామాది యోగాభ్యాస యోగాసనములు అభ్యసించుచూ ఆయుర్వేదముకూడా అభ్యసించుచూ 1927 సంవత్సరములో హఠయోగ ప్రదీపిక పాతంజలియోగ శాస్త్రము ఘటశోధిని జీవబ్రహ్మైక్య రాజయోగ సారామృతము మున్నగు ప్రాణాయామ అభ్యాసమునకు ముఖ్యమైనట్టి గ్రంథాదులను చూచి రేచక, పూరక, కుంభక, అభ్యాసములయందు వచ్చే శరీర ఆరోగ్య వ్యత్యాసములను దిద్దుకొనుటకు అనగా ప్రాణశుద్ధికి పాత్రశుద్ధి [illegible] అవశ్యకతయో, యోగసిద్ధికి కాయసిద్ధి [illegible] అట్టి కాయసిద్ధికిగాను సిద్ధౌషధము ప్రధానము [illegible] సిద్ధౌషధ నిర్మాణమును గురించి 1932లో పరిశోధన ప్రారంభించిరి. 1946 నాటికి పంచభూతాత్మకముగా గుర్తెరింగి అండ, పిండ, బ్రహ్మాండ ప్రపంచమూ, అండ, పిండ, బ్రహ్మాండ శరీరము ఒకటేయని ప్రపంచ నిర్మాణమెంతో, శరీర నిర్మాణము అంతియేననియూ వీటకు రసాయనిక పదార్థ సమ్మేళనమే మూలకారణముగా నెంచి తత్సాంప్రద సంబంధమైనట్టి రసోపరస మహారస సాధారణ రసములు లోహాదులు పాషాణాదులు లవణములు ఔషధులు వీటసమ్మేళనముతో సిద్ధౌషధ పరిశోధనలు అనేక శ్రమలకోర్చి గొప్పకృషి చేయుచున్నారు.



వైద్యశ్రీ షేక్ బాబూసాహెబ్ గారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు
గంపలగూడెం, (కృష్ణా)

వీరు తిరువూరు తాలూకా ఆయుర్వేద వైద్యమండలి ప్రధానకార్యదర్శి, వీరు ఆయుర్వేద శిక్షణ పొందినవారు. తాలూకామండలి కార్యదర్శిగా వచ్చినపిమ్మట ప్రాంతీయముగా చేసిన ఆయుర్వేదాభివృద్ధి ప్రశంసనీయమైనది.

## అరచేతులకు చెమట

ఎప్పుడు అరచేతులు, అరకాళ్ళు చెమటపట్టుట గలవారికి క్రియాకల్పం సేవింపజేసిన తగ్గిపోవును.



వైద్యభూషణ, రాజవైద్య, శ్రీమాన్

పరాంకుశం రాఘవాచార్యులుగారు

పొందూరు, ఒంగోలు తాలూకా, గుంటూరుజిల్లా,

ఆంధ్రప్రదేశ్.

వీరిది వంశపారంపర్యపు వైద్యకుటుంబము. వీరు పండిత డి. గోపాలాచార్యులుగారివద్ద మద్రాస్ ఆయుర్వేద కళాశాలలో వైద్యవిద్య నభ్యసించి పట్టమును బడసిరి. ఆల్ ఇండియా విద్వత్ సమ్మేళన విద్యాపీఠము అలిఘరువారి వైద్యభూషణ పరీక్షయందుగూడ ఉత్తీర్ణులైరి. సెంట్రల్ బోర్డు ఆఫ్ ఇండిజినస్ మెడిసన్ వారిచే రిజిష్టరు చేయబడి గుంటూరు మొదలు మద్రాస్‌వరకు అనేకమంది రోగులకు ఆయుర్వేద చికిత్సనొసఁగి బుజలనుబాపుచు యోగ్యతాపత్రములు, స్వర్ణపతకములు భూదానాదికములనుబొంది వైద్యసేవ చేయుచున్న విద్వద్వైద్యులలో నొకరు. వీరు క్రీ. శ. 1920 ప్రాంతములో వీరరాఘవ ఆయుర్వేద ఫార్మశీని స్థాపించి చక్కగా ఆయుర్వేదౌషధములను తయారుచేయుచున్నారు. ఇందు బీదరోగులకు ఉచిత చికిత్సచేయు పద్ధతి కలదు. ధర్మపత్ని శ్రీ వేంకటరమణమ్మగారు.



వైద్యశ్రీ గట్టినేని కోటేశ్వరరావుగారు

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

పల్లపాడు, గుంటూరుతాలూకా.

వీరు ఆయుర్వేద వైద్యమును అనుభవపూర్వకముగా ప్రజారంజకముగా చేయుచున్నారు. ఆయుర్వేదాభివృద్ధికి నిరంతర సహాయములను చేయుచు ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహా మండలికి సభ్యులై కవిరాజ పత్రికా పోషకులుగా నున్నారు.

## శ్లేష్మదోషం

5, 6, ఏండ్లుగా ముక్కు—వెంటకారు శ్లేష్మం ఎన్నో చికిత్సలుపొందియు ప్రయోజనంలేకపోయింది మీసలహానను సరించి క్రియాకల్పం సేవింప చేయించాను. మూడుమాసములుదాటింది. మళ్ళీ కన్పించ లేదు. క్రియాకల్పం శ్లేష్మదోషాలకు ఎంతో నివారణోపాయమైనదని గుంటూరునుండి కవిరాజ యం. ఎ. సుభాన్ వ్రాయుచున్నారు.



సిద్ధరసవైద్యశాకర్

ద యా లా ల్ కృ పా శం క ర్ గా రు

సిద్ధలవణామృత ఔషధాలయం, విజవావాడ-1.

వీరు గుజరాతీయులు. వీరు వైద్యరాజ కృపాశంకర్‌గారి ధర్మపత్నియగు కశిభాయిగారి గర్భకోశమునజనించిన ద్వితీయ పుత్రులు. వీరి తండ్రిగారివద్దను, ఢిల్లీలోని హకీం ఆజ్మల్ ఖాన్ గారి శిష్యులగు ముల్తానీలేఖరాజ్ గారలవద్ద ఆయుర్వేద, యూనానీ వైద్యము నభ్యసించిరి. పది సంవత్సరములనుండి విజయవాడయందున్నారు. సిద్ధ శివానంద పరమహంసగారిశిష్యులై, ప్రాణచికిత్సయను ప్రాణాయామ, తత్స్వదేశములు పొందిరి. "వద్రసానాంలవణం ప్రదానం" అను ఆయుర్వేద సూత్రమను "ఉప్పుకట్టువాడు, లోకములను కట్టు, రసముకట్టువాడు రాజ్యమేలు" అను వేమనయోగి చెప్పిన వైద్యవాక్యముల రహస్యార్థములను కనుగొనుటకు బహు కృషిచేసి లవణప్రభావములను తెలిసికొనిరి.

భారతీయులు లవణప్రభావములను గురించి ప్రతియింట ఉప్పునుండునట్లు చేసిరి, ఆహారపదార్థములలో ఉప్పుకూడ ఒక పదార్థముగానుంచి, నిత్యము సేవించునట్లు చేసిరి. వ్యాధులను, విషములను నివారించుటకు ఉప్పులను ఒక ఔషధముగా తయారుచేసిరి జరా, దారిద్రవ్యములు, మృత్యువు అను నివారింపచేయుటకు లవణమును అమృతముగా తయారుచేసిరి. ఆయుర్వేదములో చెప్పబడిన ఒక లవణముయొక్క ప్రభావమే యిన్నిరీతులుగా నుండగా, మిగతా ఆయుర్వేద విషయములందెంత ప్రభావము లున్నవో చదువరు లూహించగలరు. స్వతంత్ర భారతీయులందరుకూడ అనంత శక్తివంతమైన ఆయుర్వేద ప్రభావమును భారతీయ ప్రభుత్వము గుర్తించకుండుట శోచనీయమని చెప్పుచు, లవణ ప్రభావములను, ప్రజలు, ప్రభుత్వము గుర్తించుటకు వీరు కృషిచేయుచున్నారు. లవణ విషయములను గూర్చి కవిరాజ పత్రికలో వీరు వ్యాసములు వ్రాయుచుందురుగాన తద్వార తెలుసుకొనగోరుచున్నారు.



మూలికా వైజ్ఞానికులు

శ్రీ డాకర్ దయాలాల్ కృపాశంకర్

శ్రీ మరుపిళ్ళ శ్రీరాములుపాత్రుడు గార్ల గోష్ఠి

# స్వర్గీయ శ్రీ ఏకా దండయ్య పంతులుగారు



ధర్మదాత శ్రీ పంతులుగారు.

శ్రీ ఏకా దండయ్యపంతులుగారు ప్రత్తిపాడు గ్రామ కాపురస్థులు. వీరు ఆంగ్లవిద్య నభ్యసించి మునసబుకోర్టులో ఉద్యోగము చేయుచు, పై ఉద్యోగుల సలహా ప్రోత్సాహముల వలన శెలవుతీసుకొని ప్లీడరు పరీక్షలో ఉత్తీర్ణులై సుమారు 20 సంవత్సరములు న్యాయవాది వృత్తిని నవలంభించి మంచి కీర్తి గడించిరి.

1921వ సంవత్సరములో స్వరాజ్య సంపాదనకు అమలులో పెట్టబడిన సహాయ నిరాకరణ ఉద్యమములో న్యాయవాది వృత్తిని విసర్జించి ఆ ఉద్యమము ఆపివేయబడినను, తిరిగి వారివృత్తిని స్వీకరించని త్యాగమూర్తి, న్యాయవాది వృత్తి చేయుచున్న కాలములో అనేకవందలమంది బీద విద్యార్థులకు భోజనము పెట్టియు, జీతముల నొసగియు, విద్యాభివృద్ధికి సహాయము చేయుచు వచ్చిరి. వారు స్వయంకృషివలన సంపాదించిన ధనములో అనేక ధర్మకార్యములు చేసిరి. విద్యా సంస్థలయందు 30 సంవత్సరములు మెంబరుగా పనిచేయుచు విద్యాభివృద్ధికొరకు అనేక మార్గములు చూపించెను.

గుంటూరు సిటీకొరతకు గవర్నమెంటువారితో ఉత్తర ప్రత్యుత్తరములుజరిపి సలహాలు నొసంగుచు వచ్చిరి. ప్రత్తిపాడులో ఒక ధర్మసత్రమున్నూ, బ్రాడీపేటలో ఒక [illegible] సత్రమున్ను హిందూకాలేజి హైస్కూలునందు "దండయ్య పంతులు హాల్" అను పేరుతో ఒక పెద్ద భవనమును కట్టించిరి ఇంకా శాశ్వతమైన ధర్మములు చేయవలయునని ఉద్దేశ్యముతో గ్రుడ్డి, కుంటి, బిక్షగాండ్రు వీరలకు అనారోగ్యములు కలిగినప్పుడు ఆరోగ్యము చేకూర్చుటకు తమ స్వార్జిత సొమ్మును వినియోగించవలయునని ఉద్దేశ్యముతో ఒక ఆయుర్వేద బీద చికిత్సాలయమును భవనము కట్టుటకు [illegible]భించి దాని పోషణకు 13 ఎకరములుగల యిండ్లను, [illegible] భూమి వప్పజెప్పి 19-4-1944 తేదీన ఒకవీలునామా వ్రాసి రిజిష్టరుచేసి ఈ ధర్మముల పరిపాలన నిమిత్తమునకు ఐదుగురితో ఒక ట్రస్టుబోర్డు నిర్మాణముచేసి 3-7-1944 తేదీన, [illegible] సిద్ధిపొందిరి.

ఆ ట్రస్టుబోర్డువారు ఈ ఆసుపత్రి నిర్మాణమును పూర్తి చేసి "శ్రీ ఏకా దండయ్యపంతులుగారి అన్నపూర్ణ ఆయుర్వేద బీదల చికిత్సాలయము" అను పేరుపెట్టి 4-2-1945 తేదీన పూజ్యశ్రీ భిషగ్రత్న ఆచంట లక్ష్మీపతి బి. ఏ. యం. బి. అండ్ సి. యం. గారివలన తెరువబడి డాక్టర్ నా[illegible] రావు గారిని ప్రధాన చికిత్సకులుగా వేసిరి. దండయ్య పంతులుగారు ఏయే ఆశయములతో తన కష్టార్జిత సొమ్మును ట్రస్టుబోర్డువారికి వప్పచెప్పిరో ఆయా ధర్మములను ట్రస్టు బోర్డువారు ఇంతవరకు జరుపుచుండుట చాలా సంతో[illegible]కముగా నున్నదని, ఇకముందుకూడా ఈ ధర్మపరిపా[illegible] చెదరని నమ్ముచున్నాము.

వ్యాసకర్త:

శ్రీ సిరిపురపు శేషుమాధవ[illegible]

## నీళ్ళవిరేచనాలు

మిర్యాల చూర్ణంతో సమభాగం క్రియా[illegible] చేర్చి తేనెతో మూడుపూటలు సేవించితే [illegible]రించుతుంది.

# శ్రీ సిరిపురపు సేతుమాధవరావుగారు

రచన: యడవల్లి సీతారామయ్య, ప్రవీణ, ప్రచారక్.



శ్రీ నాగార్జున మూలికా ప్రదర్శకులు

వైద్యశ్రీ సిరిపురపు సేతుమాధవరావుగారు.

శ్రీ మాధవరావుగారు గుంటూరుజిల్లా, సత్తెనపల్లితాలూకా పాలడుగు గ్రామములో జన్మించినారు. వీరు బ్రాహ్మణ వంశీకులు. జనక తండ్రి పరమ పూజ్యులు శ్రీ కుటుంబరావుగారు. తల్లి వెంకట రమణమ్మ. కుటుంబరావుగారు సుప్రసిద్ధ వైద్యులు. చుట్టుపట్ల గ్రామాలలో ప్రజలకు వారంటే అపార భక్తి. మా గ్రామములో అనేకమంది – కుటుంబయ్యగారా! అబ్బో, గొప్ప వైద్యుడు. ఆయనకు ఈ ప్రాంతములో ఎదురేమిటి? అని యంటుండగ నేను ఎన్నియో పర్యాయములు విన్నాను. అయితే నేనుమాత్రం ప్రజలమాటకేమి లేయని అనుకుంటుండేవాడిని. కాని యిటీవలనె వృద్ధాప్యములోనున్న ఆ కుటుంబయ్య తాతగార్ని కలుసుకొనే భాగ్యం నాకు లభించింది. చిన్నవాళ్ళంటే వారికున్న మక్కువ, సంస్కారముతో గూడిన ఆయన తేనెలొలుకు పలుకుల సొంపు నన్ను అమాంతముగా నాకర్షించాయి ఇటువంటి సర్వజన రంజకుని చతుర్థపుత్రుడే మన మాధవుడు.

మాధవరావుగారు 12వ యేటనే ఆయుర్వేదవిద్య నారంభించిరి. తండ్రిగారివద్దనే ఆయుర్వేద విద్య నేర్చుకొనే భాగ్యము కల్గినందున అందలి రహస్యములు చాలవరకు నేర్చుకోగల్గిరి. క్రమశిక్షణతో నేర్చిన ఆయుర్వేదవిద్య కొనియాడదగిందే !

ఆంగ్లవిద్యకూడ కొంతవరకు చదివి మానివేసిరి. ఆంగ్ల, ఆయుర్వేద, హోమ్యో వైద్యములను నేర్చుకొని, ఆయుర్వేదమే ప్రధానంగా వైద్యము చేయుచుండిరి. ఏదో నలుగురి నాడిజూచి నాలుగు రూకలు సంపాదించవలసిన యీ వైద్యుడు భారతదేశ మంతట గాంధీగారి సహాయ నిరాకరణ – ఉద్యమము విజృంభించినపుడు ధైర్యసాహసములతో ఆ యుద్యమమునందు ప్రవేశించి తెల్లవారి లాఠీదెబ్బల రుచి చూడకలేక పోలేదు. 1942లో క్విట్ ఇండియా తీర్మానము చేయబడి ప్రభుత్వ వ్యతిరేక చర్యలు గావించిన దేశభక్తుల్లో ఈయ నొకరు. 41వ అఖిలభారత ఆయుర్వేద కాంగ్రెస్ మహాసభ నేర్పాటు చేయుటలో ఈయన గావించిన కృషి ప్రశంస



శ్రీ సిద్ధనాగార్జునుడు

నీయము. అదియుంగాక ఆ సభయందే అనేక మూలికలు ప్రదర్శించి స్వర్ణపతకము సంపాదించినారు. కార్యదీక్షగల ఈ వ్యక్తి 1936 నుండి 1942 వరకు రసవాదముపైనను, కుష్ఠు



శ్రీ ప్రాణాచార్య
శిరిపురపు కుటుంబరాయుడుగారు, వారిసతీమణీ.
( శ్రీ మాధవరావుగారి జననీ జనకులు )

క్షయ, ఆస్తమ మొదలగు మొండివ్యాధుల నిర్మూలనకు నూతన మూలికలు సంపాదించవలెనని, నల్లమల, యర్రమల మొదలగు భయంకర అడవుల్లో సంచారముగావించి కొంత విజయాన్ని సాధించిన ధీశాలి. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారితోను, ఆచార్య రంగాగారితోను అమితోత్సాహముతో కాంగ్రెసులో పనిజేయుచున్న వీరికి 20-3-1946న భార్యావియోగము సంభవించింది. సహధర్మచారిణి, అనుంగు పత్ని గతించినందుకు ఆయన హృదయం క్షోభించింది. అప్పటికీ రాజకీయవ్యవహారాలు, మూలికాన్వేషణలో సతమతమవుతూ వున్న ఈయనమీద భగవంతుడు చిన్నచూపు చూశాడు. కాని విధి విలాసం! ఎవరేమి చేయగలరు? ఈయన బంధువులు మరల వివాహానికి ప్రోత్సహించినారు. లాభంలేకపోయింది. తన బిడ్డలకొరకైనా సరే తాను వివాహమాడనన్నారు. ఎంత ఆశ్చర్యము! శరీర పటుత్వము గల్గియూ, మానవోచిత అభిలాష లణిగే వయస్సు రాకపోయినను, స్థిరసంకల్పుడై జీవితాన్ని ప్రజాసేవకు వినియోగించిన మహాత్యాగి! 1949లో గుంటూరునందుగల ఏకా దండయ్యగారి ధర్మవైద్యశాలలో - డా|| దేశిరాజు నారాయణరావుగారు సెలవుమీదనున్న సందర్భముగ వీరిని డాక్టరుగ నియమించడమైనది. అక్కడ వారు 4 మాసములు మాత్రమే పనిచేసినారు. అయినను వీరి వినయ సంపన్నత, పరసేవా తత్పరత, కులమత వివక్షత లేక ఆయన గావించిన సేవ, అప్రయత్నముగ ప్రజల ఆదరాభిమానాలు సంపాదించగలిగాయి. ఈ విధముగ ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారు, బులుసు సాంబమూర్తిగారు, స్వామి సీతారాంగారు, రైతులోక బాంధవుడు శ్రీ ఆచార్య రంగా మొదలగు పరమపూజ్యనాయకుల పవిత్రసాంగత్యములో జీవితము గడుపుచుండిరి. ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి స్వామి సీతారాంగారు గావించిన మహోద్యమానికి ఎంతయో



బెంగుళూరులోజరిగిన 42వ అఖిలభారత ఆయుర్వేదకాంగ్రెస్ సందర్భములో లోక్‌సభాధ్యక్షులు శ్రీ అనంతశయనం అయ్యంగారు మొదలైనవారితో శ్రీ సేతు మాధవరావు.



వైద్యశ్రీ యం నబీసాహెబ్ గారు,
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్
కామినహాళు, అర్ధగేరిపోస్టు, కర్నూలు జిల్లా.

"పాతొక రోత, క్రొత్తొక వింత" అన్నట్లు నేటి వైద్య సాధనాలకు వింతరూపములు, వింత ప్రభావములు కలిగినవే గాని, వేరేమియు గాదని నా అనుభవమే చెప్పుచున్నది. దీనికి అనేక నిదర్శనములు చూపగలనని నేను ఘంటాపథముగ చెప్పగలను. తల, కాలు, కడుపు, కన్నులకు నొప్పికలిగిన దంటే నేడు ఇంజెక్షనులు ప్రత్యక్షము కావలసినదే. శీత, వాత, పిత్త జ్వరములు ప్రజ్వరిల్లినవంటే 'సిరంజి' చేతపట్ట వలసినదే. మేహ, కారక గడ్డలు ప్రబలినవంటే ఇంజెక్షను చేయవలసినదే. అంతెందుకు కాలుకదిపితే ఇంజెక్షను ప్రత్యక్షము. ఈ ఇంజెక్షనవల్ల తాత్కాలికోపశమనము కావలసినదేకాని శాశ్వత రోగనివారణమాత్రము కాజాలదు. సూదులు వేయడమువల్ల శరీరము కాయలు కాయవలసినదేకాని రోగోస్మృక్తి కాజాలదు ఔను! కొన్ని వెలగల ఇంజెక్షన్లు తీవ్ర రోగ నివారణ చేయునప్పటికిని దాని ప్రయోజనము ప్రజ కంతటికి లభించజాలదు. అట్టి ప్రయోజనాన్ని ఒక్క ఆయుర్వేదమే లభింపజేయగలదని నా ప్రబల విశ్వాసము.

విషమునుగూడ అమృతముగ మార్చుశక్తి యొక్క యాయుర్వేదమునకే గలదు. తీవ్ర విషజ్వర పీడితులు, మరణాసన్న రోగుల నెందరినో ఈ యాయుర్వేద వైద్యమొక్కటియే బ్రతికించినది. వివిధ రోగములకు, వివిధ రసాయనిక యౌషధములు ఆయుర్వేదమునందు గలవు

"అభ్యాసము కూసువిద్య" అన్నట్లు అభ్యాసము చేతనే ఆయుర్వేదము సులభతరము కాగలదు. అనుభవజ్ఞులకుతప్ప ఆయుర్వేద వైద్యము అన్యులకు నసాధ్యము. నాటినుంచి నేటివరకు అనేకమంది ఆయుర్వేద వైద్యులు అనుభవముద్వారా రకరకాల మందులను సృష్టించారు. వాని ప్రభావము అనుభవజ్ఞులకే విదితము. కేవలం పుస్తకాలు చదివి డిప్లమా, డిగ్రీలు సంపాదించినంత మాత్రమున వైద్యపండితులు కాజాలరు. సాధన ముఖ్యం. అందులో అనుభవం అన్నిటి కంటే ప్రధానం.

నాకు నేను మాత్రము పెద్దచదువులు చదివి డిగ్రీలు, డిప్లమాలు పొందలేదు. నా పితామహుల సంపత్తియే నా యీ ఆయుర్వేద వైద్యసంపత్తి. మూలికలచేతనే నేను నేను కొన్నిమందులను తయారుచేసి రోగనివారణ చేయుచున్నాను. నా యనుభవమువలన నాకు ఒక్కొక్క రోగమును పరీక్ష చేయునప్పుడు నొక్కొకభావముత్పన్న మగును. దాని ప్రకారము నేను మూలికలచేత, అవుసరమైన రసాలచేత మందును తయారుచేయుదును. ఆయుర్వేదమునందు అన్నిటికంటె నమ్మకము ప్రధానము. కాన నేను ఆయా రోగములకు ఆయా మందులనుగట్టి విశ్వాసముతో వాడుదును. అందుకే పులిని జూచి లేళ్ళు పరుగెత్తునట్లు నామందులకు రోగములు పలాయనము చిత్తగించును కాబట్టి ప్రజలకుగూడ నామీద గట్టి నమ్మకం. అందుచేతనే నా వైద్యము సఫలత నొందుచున్నది.

భారతదేశమందలి గ్రామగ్రామాన ఆయుర్వేద వైద్యులు నిలవాలంటే ప్రజాదరణ, ముఖ్యంగా గవర్నమెంటు సహాయ సంపత్తు ఉండవలయును. ప్రస్తుతము ఆయుర్వేద వైద్యమును ప్రభుత్వము గుర్తించుచున్నందులకు ధన్యవాదాలు. కాన ఆయుర్వేద నిపుణులుకూడ ప్రచారమును విరమించక అవిరళ కృషిచేయుదురని మిక్కిలి విశ్వసించుచున్నాను.

---

# రక్తప్రదరం

రెండుసార్లు మైనరు ఆపరేషన్లు జరిగినవి. తాత్కాలిక శాంతియే. రక్తప్రదరం వదలుట లేదు. మీ నిర్ణయము ననుసరించి మూడు మాసాలు "క్రియాకల్పం" సేవించాను. నేటికి సంవత్సరమైంది. ఎంతో ఆరోగ్యం కల్గింది. ఋతుక్రమము వచ్చింది. నా శరీరమెంతో బలవర్ధక మగుచున్నదని రాజమండ్రినుండి పి. అమ్మాయమ్మ వ్రాయుచున్నారు.



42వ అఖిలభారత ఆయుర్వేద కాంగ్రెస్ (బెంగుళూరు) మహాసభలలోని ఛాయాచిత్రములు

తోడ్పడినారు. అప్పుడు స్వామివారికి ఆరోగ్యవిషయంలో అమూల్యసలహాల నొసంగిరి. తరువాత 1953లో మరలవీరే ఏకాదండయ్యపంతులుగారి బీదలధర్మ వైద్యశాలలో ప్రధాన చికిత్సకులుగా నియమితులైరి. అప్పటినుండి ఇప్పటివరకు ఒడు సమర్థతతో ఆస్పత్రి నిర్వహిస్తూ అధిపతులచే, భేష్! మాధవరాయా, అనిపించుకొన్న సద్గుణరాశి! ఆంధ్రజ్యోతి శ్రీ పొట్టి శ్రీరాములుగారి 53వ ఉపవాస దినమున ఆంధ్ర రాష్ట్రము ఇచ్చెదనని నెహ్రూగారి తంతి వచ్చినను వీరు జీవించరని నొక్కి వక్కాణించి చెప్పిన నిపుణ వైద్యులు!!

ఇటీవలనే బెంగుళూరులో జరిగిన 42వ అఖిలభారత ఆయుర్వేద కాంగ్రెసు మహాసభలయందు 600 మూలికలు ప్రదర్శించి, ఆయుర్వేదప్రకాండ పండితులచేతను ఉన్నతాధికారుల చేతను ఆశీర్వాదములు పొందినారు. ఈయన కేవలము ఒక వైద్యవిద్య ప్రయోగశాలేమో ననిపిస్తుంది. ఎంత మొండివ్యాధులనైన బాగుచేయాలని పట్టుబట్టి చాలవరకు ఆ విషయాల్లో సఫలీకృతులయ్యారు. బీదలకుమాత్రం చిల్లిగవ్వముట్టక తన స్వంత మందులేవాడి చికిత్సజేసే త్యాగి! ధనాపేక్షపరులు రోజురోజుకు పెరిగిపోయే ఈరోజుల్లో ధనాన్ని తుచ్ఛముగా భావించి, ఉచితముగా చికిత్సజేసే వైద్యులెందుకుంటారు? కొందరు ఈయన్ని పిచ్చివాడంటారు. ఎందుకు? ఈయన అతి మంచిదనాన్ని జూచి! ఇది లోకంలోపరిపాటి-మంచివారిని జూచి మేమో అనుకోటం. ఏది ఎట్లున్నను, ఎవరేమనుకొన్నను రత్నాలకాంతి కొఱవడునా? వైద్యమువీరి ప్రధానలక్ష్యమే కావచ్చు అయినను రాజకీయాలతో ఆయనకు ఎంతసంబంధం. ఇప్పుడు కాకపోవచ్చు ప్రస్తుతము వీరు ఆంధ్రప్రదేశ మండలి కార్యవర్గ సభ్యులుగాను, గుంటూరు తాలూకా ఆయుర్వేద మండలి అధ్యక్షులుగాను పనిచేయుచున్నారు.

ఉదారహృదయులు, సంఘసేవా తత్పరులు, నేర్పుగల వైద్యులు, సాహిత్యాభిమానులు, నిరాడంబరజీవులు, నిగర్వమూర్తులు యగు వీరికి నాయుకళిత హస్తాలతో నమోవాకము లర్పిస్తూ - ఆయురారోగ్యములు ప్రసాదించవలెనని సర్వేశ్వరుని వేడుకొనుచున్నాను.

శా॥ నీతిప్రౌఢ విహారులైన నిపుణుల్, నిందింపనీ, మెచ్చనీ,
ఖ్యాతింజెందిన సంపదల్ నిలువనీ, గాఢంబుగాపోగనీ
ఘాతింబప్పుడు పొందనీ నియతిమై కానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపదంబు దప్పరుగదా, నిత్యంబు ధీరోత్తముల్.

(భర్తృహరి సుభాషితము)



42వ అఖిలభారత ఆయుర్వేద కాంగ్రెస్ సభలలో శ్రీ శేతు మాధవరావు.



**వైద్యశ్రీ వి వి రాఘవయ్యగారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్

దబ్బాకుపల్లి (వయా. జగ్గయ్యపేట

శ్రీ రాఘవయ్యగారు నేర్పరితనముతో వైద్యము చేయగలవారు. వంశపరంపరా వచ్చు వైద్యవిశిష్టతను సంరక్షించుచున్నవారు. ఆయుర్వేద ప్రచారకులు, ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి సభ్యులు కవిరాజ పత్రికాపోషకులు.



**వైద్యశ్రీ ఖరీదు [illegible] గయ్యగారు**

[illegible] : సిద్దిక్ గూడెం పోస్టు

మధిర తాలూకా

ఆయుర్వేద వైద్యశాస్త్ర [illegible] అభిమానదృష్టితో ప్రజారోగ్యమునకై [illegible] యుచున్నారు.



**వైద్యశ్రీ షేక్ హుసేన్ సాహెబ్ గారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్

శివాడి గ్రామం : పుంగనూరు తాలూకా (చిత్తూరుజిల్లా)

వీరు వైద్యశ్రీ సంపత్తు మునుస్వామిగారి శిష్యులు ప్రారంభదశలోని చర్మవ్యాధులు చక్కగా నివారించగలవారు. పుట్టినది వైద్యకుటుంబములో. గణించినకీర్తి ప్రజారంజకమైనది మంచి సౌమ్యులు.



**వైద్యశ్రీ కవిరాజ షేక్ మస్తాన్ సాహెబ్ గారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్

కనపర్తి పోస్టు : వయా అమ్మనబ్రోలు

వీరు ఆయుర్వేదం, యూనాని వైద్యవిధానంలో మంచి అనుభవముగల్గి ప్రజాగౌరవముతో వైద్యవృత్తిని నిర్వహించుచున్నవారు.



**వైద్యశ్రీ పి. సత్యనారాయణమూర్తి గారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనరు

జె. మోహన్‌రావుబాడి : నింపుర P. O.

ఖర్గపూర్

శ్రీ సత్యనారాయణమూర్తిగారు శాంతస్వభావులు, ఆయుర్వేద విద్య నెరింగి చక్కని చికిత్సలు చేయుచున్నారు. గౌరవనీయులు.



**వైద్యశ్రీ కవిరాజ కోకా వెంకటసుబ్బారావుగారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్

జంపని : (గుంటూరు జిల్లా)



**వైద్యశ్రీ సి. యం. విశ్వేశ్వరశర్మగారు**

అంబడిపల్లి పోస్టు : వయా లింగాల

(మహబూబునగరం జిల్లా)

వీరు ఆనువంశిక వైద్యకుటుంబమునకు చెందినవారు, పరిశీలనాదృష్టితో రోగంనివారించునదే ఔషధమను వివేక దృష్టితో, చికిత్సాపద్ధతులతో, మంచి నైపుణ్యముతో నడుచుచున్నారు. హోమియో (H M. B.) లో కూడా చక్కని పరిచయమున్నవారు, సహృదయులు

---

వీరు మంచిప్రజ్ఞావంతులు వైద్యవిద్యాభ్యాసమునకై బహు కృషిచేసి అనుభవము సంపాదించినవారు. 1933 లో చదువు చాలించి ఆయుర్వేద వైద్యములో ప్రవేశించినవారు. వీరు మేహపాదలు, గుదభ్రంశము, దద్రువు, రక్తకాసము, ప్లీహావాపు మొదలైనరోగములకై ప్రత్యేకచికిత్సలు నిర్వహించుచు బహుకీర్తి సంపాదించిన ఉత్తమవైద్యులు.

---

## జ్వరములు

సాధారణ జ్వరములకు "క్రియాకల్పము" వాడుచున్నాను. నూటికి నూరుపాళ్ళు తృప్తికల్గించినట్లు గోరంట్లఅగ్రహారమునుండి వ్రాయుచున్నారు.



**వైద్యశ్రీ తివారి శంకర్ ప్రసాద్ గారు**
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్
నరసాపురం : (ప. గో జిల్లా)

వీరు అనానరోగ స్పెషలిస్టు. శ్రీ బాలరాజమహర్షి గారి శిష్యులు, ఆయుర్వేద కుటుంబానికి చెందినవారు మంచి ఉదారబుద్ధిగలిగినవారు.



**హకీం మహజర్ పీర్ హుసేని గారు**
గుత్తి : (అనంతపురం జిల్లా)

వీరు ఆయుర్వేదం, యూనాని, సాంప్రదాయముల ననుసరించి చికిత్సలు నిర్వహించుచుందురు. కఠినమైన రోగములు అసాధ్యములని విడచినవి సూక్ష్మముగా నివారించెదరు.



**వైద్యశ్రీ వాడపల్లి అయ్యామాచార్యులుగారు**
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్
కాండ్రేగుల : కాకినాడ తాలూకా
(తూర్పుగోదావరిజిల్లా)

శ్రీ ఆచార్యులు వారు ఆయుర్వేదవైద్యశేఖర మంచి పండితులు. భాషాప్రవీణులును. ఆయుర్వేద శాస్త్రములను [illegible]గా పఠించినవారు.



**కవిరాజ పూరిమెట్ల ఓబులాచార్యులుగారు**
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్
రెంటాల : పల్నాటి తాలూక

వీరు ప్రశిద్ధ ఆయుర్వేద కుటుంబమునకు చెందినవారు - పల్నాడుతాలూకా ఆయుర్వేద వైద్యమండలి ప్రధాన కార్యదర్శి.



**వైద్యరాజ మండవ శ్రీశైలంగారు**

శ్రీ బాలాత్రిపురసుందరీ ఔషధాలయం

విద్యాధరపురం : విజయవాడ-1.

వీరు విశ్వబ్రాహ్మణులు. జననం 1906. శ్రీ మైలవరం సంస్థానవైద్యులు, కవిసింహ, వైద్యరాజ కీ॥ శే॥ మండవ కాశీపతి, ధర్మపత్నియగు రత్నమ్మగార్లకు ద్వితీయపుత్రులు. తండ్రిగారివద్ద ఆయుర్వేద, యూనానీ వైద్య మభ్యసించిరి. విజయవాడ దేశీయ వైద్యసంఘ సహాయకార్యదర్శిగా ఆయుర్వేద ప్రచారమునకు ఉపకరించు చున్నవారు.



**కవిరాజ రాపర్తి అప్పారావుగారు**

శ్రీ గోపాలకృష్ణ ఆయుర్వేద నిలయము

రాజమండ్రి : (తూ. గోదావరిజిల్లా)



**వైద్యశ్రీ పసుపులేటి పురుషోత్తముగారు**

గంగదేవిపాడు : గంపలగూడెం పోష్టు

(కృష్ణాజిల్లా)

వీరు ఆయుర్వేద విద్వత్తుఎరిగియు, అభిమానవిద్యగా ప్రజారోగ్యమును సంరక్షించుచున్న ఆయుర్వేద సేవకులు, తిరువూరు తాలూకా ఆయుర్వేద వైద్యమండలి సహాయకార్యదర్శి.

---

వీరు ప్రసిద్ధ ఆయుర్వేద కుటుంబమునకు చెందినవారు. పిఠాపుర వైద్యులని ప్రఖ్యాతిగన్న వైద్యరాజ రాపర్తి గంగారాయుడుగారి ప్రథమపుత్రులు, చికిత్సలలో మంచి నేర్పరితనముగలవారు.

---

## బహుమూత్రము

శుక్లనష్టమునకు అతిమూత్రమునకు అనేకమందికి క్రియాకల్పము వాడియున్నాను. రెండింట మంచి ప్రయోజనము కల్గించు చున్నదని విజయవాడ శివాలయంవీధినుండి టి. సూర్యనారాయణగారు చెప్పుచున్నారు.

---



**వైద్యశ్రీ అధ్వర్యుశిరోమణి**
**బండికట కోటేశ్వరశాస్త్రిగారు**
పాతగుంటూరు, గుంటూరు.

వీరు ఆయుర్వేదవిద్వాన్ బండికట్లనాగేశ్వరసిద్ధాంతిగారి జ్యేష్ఠ పుత్రులు. శ్రీ రాజరాజేశ్వరీ మంత్రోపాసకులు. గుంటూరు తాలూకా వైద్యమండలి కార్యవర్గ సభ్యులు. ప్రముఖ ఆయుర్వేద ప్రచారకులు



**వైద్యశ్రీ విశారద కె. మాధవానందస్వామిగారు,**
పాకాల, చంద్రగిరి తాలూక, చిత్తూరుజిల్లా.

వీరు దేశపర్యటనగావించి ప్రజారోగ్యమున కవసరమైన చికిత్సాపద్ధతులు సంగ్రహించి ప్రజాక్షేమమునకై తమశక్తిని వినియోగించుచున్నారు. వీరు ఆధ్యాత్మికతత్వ వేత్తలు అసంఖ్యాక శిష్యకోటి గలవారు.



**పండిత జి. గోపాలశర్మగారు**
కోట, కర్నూలు

శ్రీ శర్మగారు సంస్కృత పండితులు. ఆయుర్వేదం సంపూర్ణముగా తెలిసిన విద్వద్వైద్యులు. గొప్ప చికిత్సా నైపుణ్యముగలవారు. ఔషధ నిర్మాణములో నిర్దుష్టమైన పద్ధతులు అనుసరించుచున్నవారు. ప్రజ్ఞావంతులు.



**వైద్యరాజ పి. కె. పుట్టచ్చయ్య దీక్షాచార్**
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్
కవనదల, మధుగిరితాలూకా, తుంకూర్ జిల్లా.

వీరు ఆయుర్వేద విద్వద్వైద్యులు. రూరల్ డిస్పెన్సరీలో పనిచేసి ప్రజావిశ్వాసము చూరగొన్నవారు. గొప్ప అనుభవము గలవారు.



వైద్యశ్రీ తియ్యగూర శేషిరెడ్డిగారు

అంకిరెడ్డిపాలెం, గుంటూరు తాలూకా.

వంశపరంపరా ఆయుర్వేద వైద్యము గలవారు. గ్రామములో మంచి వైద్యనిపుణులని పేరుగన్నవారు.



వైద్యశ్రీ వి. వి. యస్. బాలకృష్ణారావుగారు

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్.

ఇంకొల్లు, బాపట్లతాలూకా.

వంశపరంపరా గల ఆయుర్వేద వైద్య కుటుంబములో తయారైన వైద్యులుగా పరిశీలనాదృష్టిగలవారు.



వైద్యశ్రీ పెదపాటి కృష్ణమూర్తిగారు,

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్

ఏలూరు, పశ్చిమ గోదావరిజిల్లా.

వీరు అనువంశిక వైద్యకుటుంబమునకు చెందిన స్వర్గీయ శ్రీ పెదపాటి సత్తియ్యగారి కుమారులు. 1953లో విశేష వైద్యాట్రయినింగు పొందినవారు ఆయుర్వేద చికిత్సలలో నిపుణత గలవారు.

---

## రక్తప్రదరములు

రక్తప్రదరములకు ప్రత్యేకముగా క్రియాకల్పము ఉపయోగించి ప్రయోజనములు పొందుచున్నామని కడప తాలూకా చెన్నూరునుండి శ్రీ కవిరాజ గన్నామంతిన వెంకటజమాలుసెట్టిగారు వ్రాయుచున్నారు.

## నేత్రదోషములు

'క్రియాకల్పము' శిరోరోగములకు నేత్రదోషములకు మహోపకారమే చేయుచున్నదని కడప జిల్లానుండి ప్రొద్దుటూరునుండి శ్రీ యం. ఓబులపతిగారు వ్రాయుచున్నారు.

---



వైద్యశ్రీ వైద్యరాజ

**దాశ్యం వెంకటరామానుజసూరిగారు**

విజయవాడ.

వీరు ఆంధ్ర ప్రదేశ ఆయుర్వేద మహామండలి ఔషధ నిర్మాణ శాఖా కార్యదర్శి. ఔషధ నిర్మాణమే వీరి ప్రధాన కార్యక్రమం



శ్రీమాన్ రాజవైద్య

**వేదాంతం శ్రీనివాసాచార్యులుగారు**

దుగ్గిరాల.

వీరు ఆంధ్ర ప్రదేశ ఆయుర్వేదమహామండలి కార్యవర్గ సభ్యులు.



వైద్యశ్రీ రసవైద్య కేసరి

**బాయన అప్పలనరశింహం పాత్రుడుగారు**

విజయవాడ.

వీరు ఆంధ్ర ప్రదేశ ఆయుర్వేద మహామండలి కార్యవర్గ సభ్యులు. దీర్ఘవ్యాధుల నివారణలో నిపుణులు.



వైద్యశ్రీ చికిత్సా విశారద

**పిళ్లా అప్పలనర్సయ్య పాత్రుడుగారు**

విజయవాడ.

వీరు ఆంధ్ర ప్రదేశ ఆయుర్వేద మహామండలి కోశాధ్యక్షులు. బాలవ్యాధుల నివారణలో ప్రధానులు.



కవిరాజ సత్యాల నరశిబాబు పాత్రుడు
పూలబావి రోడ్, విజయవాడ-1.

వీరు స్వర్ణకంకణ ఆయుర్వేద ఫార్మశీ స్వంతదారు. విజయవాడ దేశీయ వైద్యసంఘ అధ్యక్షులు.

వీరు ఆయుర్వేద ఔషధ నిర్మాణములో ప్రసిద్ధులు. వీరి నిరంతర కృషి ఆయుర్వేద ఔషధములు నిర్దుష్టముగా తయారు చేయుటకై వినియోగ పరచెదరు.



వైద్యశ్రీ డా. కోట నిత్యానందశాస్త్రిగారు
గాంధీనగరం, విజయవాడ-2. ఎ. వి. ఎ. సి



వైద్యశ్రీ డా. గడ్డం ప్రసాదరావుగారు
గాంధీనగరం, విజయవాడ.

శ్రీ వెంకటేశ్వర ఆయుర్వేద కళాశాలలో విద్యాభ్యాసము చేయుచున్నారు తృతీయశ్రేణిలోనున్నారు ఆంధ్రదేశములో మూలవ్యాధులు నివారించుటలో ప్రఖ్యాతి గన్న స్వర్గీయ కవిరాజ గడ్డం సౌభాగ్యమ్మ గారి కనిష్టపుత్రుడు, వీరును తల్లి గారు నిర్మించిన సౌభాగ్య ఆయుర్వేద నిలయములో తండ్రి శ్రీ కవిరాజ గడ్డం హనుమంతరావు గారితో కలసి, మూల వ్యాధి చికిత్సలలో పాల్గొంటున్నారు.

---

వీరు శ్రీ వెంకటేశ్వర ఆయుర్వేద కళాశాల పట్టభద్రులు శ్రీ ఆనందా మూలికా పరిశోధనా కేంద్ర నిర్మాతలు. శ్రీ బాలరాజ మహర్షిగారి అడుగు జాడల్లో చికిత్సా పద్ధతులు అనుసరించు చున్నారు.

---

## కుసుమరోగాలు

క్రియాకల్పం ప్రదరవ్యాధు లన్నిటికి మంచి సుహోపకారము చేయుచున్నదని శ్రీ యం. జె. లాభాస్ విజయవాడనుండి వ్రాయుచున్నారు.

---



వైద్యశ్రీ
కాటేపల్లి రాజమల్లుగారు
రాజవరం, పెనుగొలను పోస్టు తిరువూరు తాలూక. (కృష్ణా)

అను వంశిక ఆయుర్వేద వైద్యులు. నంజువ్యాధులు నివారించుటలో ప్రఖ్యాతి గలవారు. ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి సభ్యులు.



వైద్యశ్రీ నారాయణస్వామిగారు
గుడిబండ, మడకసిరా పోస్టు
హిందూపురం, అనంతపురం జిల్లా.

వీరు అనువంశిక వైద్యకుటుంబానికి చెందిన ఆయుర్వేద వైద్యులు.



వైద్యశ్రీ జి. కృష్ణమోహన్‌గారు
తిమ్మాపురం, యలమంచిలి తాలూకా (విశాఖ)

వీరు ఆయుర్వేద వైద్యశిక్షణ గలిగి ఆదర్శప్రాయమైన చికిత్సలు నిర్వహించుచున్నారు, పరిశోధనాదృష్టి గలవారు. కవిరాజ పత్రికా పోషకులు.

# ఔషధపాక పరిజ్ఞానము

( 64వ పేజీ తరువాయి )

అమోఘముగ పని చేయును. దానికి సువర్ణసూర్యావర్తి, సువర్ణగురు సూర్యావర్తి, గురుసూర్యావర్తి, మహాసూర్యావర్తి అనెడి పేరులుకలవు.

వంటసూర్యావర్తి:- రాగిపాత్రయని చెప్పబడియున్నను కాచకుప్పెల యందుకూడ వండెదరు. ఇందుబంగారు భస్మము తులముచొప్పున గ్రహించినయెడల కస్తూరిని అరతులము గాని పావుతులముగాని చేసికొనవలయును. పచ్చకర్పూరమును ఒకతులముచేసి కొనవలయును. పైత్యవ్యాధులమీద చక్కగ పనిచేయును.



రాజవైద్య
శ్రీ అచ్చుత వెంకటసుబ్బారావు

వీరు వంశపారంపర్యా ఆయుర్వేద వైద్యములో గణ్యతకలవారు వంధ్యారోగములకున్నూ, వాజీకరణము వగయిరాలకున్నూ మధుమేహ, అతిమూత్ర వ్యాధులకున్నూ ప్రత్యేక చికిత్స చేయుదురు. వీరు వసంత కుసుమాకరము, ఆయుర్వేదౌషధ రత్నాకరములోని మూడవ యోగము ననుసరించి చేయుచున్నారు.

# వసంత కుసుమాకరము

వంటయోగము - రాజౌషధము

తయారుచేయు కాలము : అయిదు సంవత్సరముల పదిరోజులు.

ఇందు చేరిన భస్మములు :- సువర్ణము, రజితము, పగడము, ముత్యము, హేమమాక్షికము కాంతము, అభ్రకము, వైక్రాంతిము, సంస్కారితరసము, సీసము, వంగము.

## -: మర్ధన ద్రవ్యములు :-

నిమ్మపండ్లు, దానిమ్మపండ్లు, ఖర్జూరపండ్లు, గంజాయి, పల్లేరు, అల్లము, ఆవుపాలు, కస్తూరి, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, జాజికాయలు, చెరుకురసము, చందనము, అరటి, నేలగుమ్మడి, నేలతాడి, శతావరి, బూరుగపువ్వములు, మందారపుష్పములు, కురువేరు, మాలతీ పువ్వములు, నల్లకలువ, పన్నీరు.

## ఈ ఔషధ సేవనతో నివర్తించు వ్యాధులు

పాండువు, వాంతి, క్షయ, శ్వాస, కాస, మూత్రకృచ్ఛము, అశ్మరి, గిసేరియాజీర్ణించుటచే గలిగెడు మూత్రవ్యాధులు, స్త్రీల ప్రదరవ్యాధులు, శరీరతాపము, లింగతాపము, మధుమేహము, (మూత్రములో చక్కెరపోవుట) బహుమూత్రము, శుక్లనష్టము, మున్నగు ఇరువది మేహములు, ఇరువదినాలుగు పైత్యములు, వాతవ్యాధులు, నపుంసకత్వము, వంధ్యారోగము, ఇవి పోగొట్టును.

మోతాదు :- రోజు 1కి ఉదయమున ఒక్కమాత్రమింగి అనుపానముగా పాలుగాని, నీరుగాని త్రాగవలెను పైత్యరోగులు అనుపానముగా నీరు త్రాగవలెను

ఖరీదు :- తులము 1కి రూ 60-0-0, 80 మాత్రలు, 80 రోజులు, 80 మోతాదులు - 16 మాత్రల ఖరీదు 12 రూపాయలు, పోస్టుఖర్చులు ప్రత్యేకము. ఆర్డరుతోసహా నాలుగవవంతు ఖరీదు అడ్వాన్సుగా పంపవలెను. (ఈ ఔషధము మాత్రలు చేయకుండాకూడా కావలసినవారికి పంపబడును.

స్వల్పకాలము మాత్రమే లభింపగలదు.

అడ్రసు :- రాజవైద్య అచ్చుత వెంకటసుబ్బారావు
వహాబ్ రోడ్డు - తెనాలి.

# ఆయుర్వేద చరిత్ర

( 18వ పేజీ తరువాయి )

౩. కక్షపుట తంత్రము :- ఇదియు నాగార్జున విరచితమే,

౪ ఆరోగ్యమంజరి :- ఇదియు నాగార్జున విరచిత గ్రంథమే. విజయరక్షితుడు తన నిదాన వ్యాఖ్యానములో దీని నుదాహరించి యున్నాడు.

౫ వ్యాడి తంత్రము,

౬. వశిష్ఠ తంత్రము,

౭. మాండవ్య తంత్రము,

ఈ పై మూడు తంత్రములును ప్రధానముగా రసశాస్త్రమును బోధించు అతిప్రాచీన గ్రంథములు. రసరత్న సముచ్చయమునందు రస శాస్త్రజ్ఞుల నామము లుదాహరింపబడి యున్నది అందు వ్యాడి మొదలయినవారి నామములు కలవు.

## 8. వాజీకరణ సంహితలు

వాత్స్యాయన కామ సూత్రములనుండి ఇందును గురించిన గ్రంథము లనేకములున్నటుల తెలియగలదు. కాని వ్యాఖ్యాన కారులచే నేయొక గ్రంథముకాని ఉదాహరింపబడి యుండ నందున అప్పటికే ప్రాచీనగ్రంథము లన్నియు నశించి యుండ వచ్చునని భావింపవలసి వచ్చుచున్నది.

౧ కుచుమార తంత్రము :- ఈ చికిత్సను గురించి స్వతంత్రముగ ఏడుగురుఋషులు గ్రంథములను వ్రాసిరనియు యందు కుచుమారు డొకడనియు నీతని తంత్రము చాల ప్రధానమయిన దనియు వాత్స్యాయనుడు తన కామసూత్రములలో తెలిపి యున్నాడు.

౨ నంది తంత్రము :- నంది అను వానిచే ప్రథమమున వేయి అధ్యాయములలో నీ సంహిత రచింపబడెనని తెలియుచున్నది.

౩. శ్వేతకేతు తంత్రము :- ఉద్దాలకుని పుత్రుడయిన శ్వేతకేతు వానిచే నందిసంహిత సంస్కరింపబడి 500 అధ్యాయము లోనికి సంక్షిప్తము గావింపబడి శ్వేతకేతు తంత్రమని వ్యవహరింపబడి యుండిన గ్రంథమిది.

౪. పాంచాల తంత్రము :- బభ్రు కుమారుడయిన పాంచాలునిచే శ్వేతకేతునిచే సంస్కృతి చెందిన నంది సంహిత ప్రతి సంస్కృతి గావింపబడి మరికొంత సంక్షిప్తము చేయబడి ఏడు భాగములలో రచింపబడెను.

౫ వాత్స్యాయన కామసూత్రములు :- అనంతర కాలములో కేవలము వాజీకరణ చికిత్స సంబంధించక పోయినను, రతిశాస్త్రసంబంధములగు గ్రంథము లనేకములు రచింపబడెను. అట్టివాటిలో కామశాస్త్రము, అనంగరంగము, రతిశాస్త్రము మొదలయినవి అనేకములు కలవు ఇట్టి గ్రంథములలో వాత్స్యాయన కామసూత్రములు ప్రధానతమమయిన గ్రంథము వాత్స్యాయనుని గురించి అనేక భిన్నాభిప్రాయములు కలవు కొందరు ఇతను ఒకఋషి అనియు, మరికొందరు ఇతను చంద్రగుప్తుని జగద్విఖ్యాత మంత్రియగు చాణక్యుడే యనియు ఇటుల తలచుచున్నారు అటు లనుకొనినను ఇప్పటికి 2500 సంవత్సరములకు పూర్వపువాడగుటచే, శ్వేతకేతుకు, పాంచాలుకు ఇంతకు పూర్వులై యుండుట నిర్వివాదాంశము.

## పశు చికిత్సా సంహితలు

ప్రాచీనకాలమునందు ఆర్యావర్తమున గజ తురగాది చతుష్పాదులు చతురంగబలములలో నొక అంగమై మిక్కిలి ప్రధానములై యుండెను. పశువులే ప్రాచీనార్యుల యొక్క సిరి అట్టి పశువులను రక్షించవలసినదిగాగల ప్రార్థనలు వేదములందనేకములు గలవు ఈ కారణములచేత నీ చికిత్సా భాగమును మిక్కిలి యభివృద్ధి చెందియుండుటలో నాశ్చర్యమేమియు లేదు. ఇందును గురించిన ఈ కాలపువాటి గ్రంథము లనేకములున్నను అట్టివాటిలో నీక్రింద పేర్కొనబడియున్నవి ముఖ్యమయినవి.

౧. పాలకాప్య సంహిత :- ఇయ్యది హస్తి ఆయుర్వేదము లేక గజాయుర్వేదము అని కూడ వ్యవహరింపబడుచుండును. అంగదేశపు రాజయిన రోమపాదునకు పాలకాప్యుడను ఋషి పుంగవునిచే గజములయొక్క రోగ, నిదాన, లక్షణ, చికిత్సలను గురించి ఉపదేశము గావింపబడినటుల ఈగ్రంథమునుండి తెలియగలదు. ఇయ్యది అంతయు సంవాదరూపమున నుండి చరక సుశ్రుతాది గ్రంథముల లోవలెనే స్థాన, అధ్యాయ విభజన గావింపబడి యున్నది. ఈ గ్రంథము పునహాపట్టణము నందలి ఆనందాశ్రమము వారిచే ప్రచురింపబడి యున్నది.

౨. గోతమ సంహిత :- ఇది అలభ్యము. ఇందు గో చికిత్సలు తెలుపబడి యున్నది

౩. శాలిహోత్ర సంహిత :- ఇది ప్రధానముగా తురగముల యొక్క రోగ, నిదాన, లక్షణ, చికిత్సలను వర్ణించుచున్నది. నకుల, జయదత్తులయొక్క అశ్వవైద్యమునకు ఇది మూలగ్రంథము. ఇయ్యది "సాలతోర్" అనెడి పేరుతో అరబీయులచే వారి మాతృభాషలోనికి పరివర్తన గావింపడియున్నది. అరబీ దేశము తురగములకు ప్రాచీనకాలము నుండియు సుప్రసిద్ధత వహించి యుండుట జగద్విదితము.

ఈపైనుదాహరింపబడిన గ్రంథముల జాబితా సంపూర్ణము కాదని తెలియవలెను ఇంకను పెక్కు పరిశోధనలు జరిపి లుప్తముగనున్న వాటిని కనుగొన వలసి యున్నది

ఈగ్రంథములలో లభ్యమగు వాటినుండి యీకాలపువైద్య శాస్త్ర పరిస్థితులను కొంతవరకు తెలిసికొనుటకు వీలగుచున్నది. వీటిలో ప్రధానముగ లభ్యమగునవి చరక (అగ్నివేశ) సంహిత, సుశ్రుత సంహిత, భేళ (భేద) సంహిత (కొంతభాగమును), కాశ్యప సంహిత (కొంతభాగము), వాత్స్యాయన కామసూత్రములు, పాలకాప్య సంహిత మొదలయినవి.

### ఆయుర్వేదము దేవలోకమునుండి భూలోకమునకు గొనిరా బడుట.

ఆయుర్వేదమునకు ఆదికర్త సృష్టికర్త యగు బ్రహ్మయనిగదా హైందవుల నమ్మకము! ఆయుర్వేదము అట్టి బ్రహ్మనుండి మానవలోకమున కెటుల గొనిరాబడినదియు పైసంహితలలో తెలుపబడిన క్రమమును గొంత విచారింతము.

### ప్రాపంచిక ప్రథమ వైద్యక మహాసభ.

ఆర్యుల కభి మతమయిన ధర్మార్థ కామ మోక్షము లనెడి చతుర్విధ పురుషార్థముల సాధించుటకు జప తప హోమాది కర్మల నాచరించుటయందు జ్వరాది వ్యాధు లాటంకముగ నుండుటగని "ధర్మార్థ కామ మోక్షాణాం ఆరోగ్యం మూల ముత్తమం" (చరక. సూ అ 1) అని గ్రహించి తదారోగ్య పరిపాలన నిమిత్తము విధానముల తెలిసికొన నభిలషిస్తులై అంగిరస, జమదగ్ని, వసిష్ఠ, కాశ్యప, భృగు, అత్రేయ, గౌతమ, సాంఖ్య, పులస్త్య, నారద, అసిత, అగస్త్య, వామదేవ, మార్కండేయ, ఆశ్వలాయన, ఆత్రేయ భిక్షు, భరద్వాజ, కపింజల, విశ్వామిత్ర, అశ్వరథ్య, భార్గవ, చ్యవన, అభిజిత్, గార్గ్య, శాండిల్య, కౌండిన్య, వార్క్షిదేవల, గాలవ, సాంకృత్య, బైజవాపి, కుశిక, బాదరాయణ, బడిశ, శరలోమ, కాప్య, కాత్యాయన, కాంకాయన, కైకశేయ, ధౌమ్య, మారీచి, కశ్యప, శర్కరాక్ష, హిరణ్యాక్ష, లౌగాక్ష్య, పైంగి, శౌనక, శాకునేయ, మైత్రేయ, మయమతాయ, వైఖానస, వాలఖిల్యాది ఋషులు కొందరు ఒకానొక శుభముహూర్తమున హిమవత్పర్వత పార్శ్వమునందు సభగాకూడి, ధ్యానించి తమ ధ్యాన దృష్టి వలన రోగ శమోపాయములను ఇంద్రుడు తమకు తెలుపగలడని తెలిసికొనినవారలై, తద్గ్రహణ నిమిత్తము ఇంద్రునివద్ద కెవరేతెంచగలరని యాలోచన పడుచుండగ భరద్వాజుడు అందులకు అతనిని నియోగింపవలసినదని ప్రథమమున పలుకగా అందరు నందుల కంగీకరించి భరద్వాజుని నియోగించుటలును, అంత భరద్వాజుడు ఇంద్రుని యొద్ద కేతెంచి ఆశీర్వదించి, "వ్యాధరోహి సముత్పన్నాః సర్వప్రాణి భయంకరాః। తద్బ్రూహి మే శమోపాయం యథావద మరప్రభో". "సర్వప్రాణి భయంకరములగు వ్యాధులుత్పన్న మయినవి వాటి శమోపాయములను యథావిధి తెలుపుము అమరప్రభూ" అని పలుకగా నా యమర ప్రభువగు నింద్రుడు కొద్దిమాటలలో అనంతము అపారము శాశ్వతము పుణ్యప్రదరము అయిహేతు, లింగ, ఔషధములనెడి త్రిసూత్ర (స్కంధ)ములను కలిగి, స్వస్థులకును ఆతురులకును ఆశ్రయమై ప్రథమమున ప్రాపంచిక పితామహుడగు బ్రహ్మచే తెలిసికొనబడినట్టి ఆయుర్వేదమును బుద్ధి విపులుండయిన భరద్వాజునకు చెప్పగా భరద్వాజుడు యథావతు సర్వమును శీఘ్రకాలములో తదేక ధ్యానము కలవాడై గ్రహించి అమితమయిన సుఖాయువును పొందినటులును, తాను ఇంద్రునివద్దనుండి గ్రహించిన ఆయుర్వేద సూత్రములను సంపూర్ణముగ నాత్రేయాది ఋషులకు తెలుపగా వారలుకూడ ప్రజాహితమయినట్టియు ఆయుర్వర్ధక మయినట్టియు నయిన ఈ ఆయుర్వేద సూత్రములను; సామాన్యము, విశేషము, గుణములు, ద్రవ్యములు, కర్మలు, సమవాయములను తగు విధమున తమ జ్ఞానచక్షువుచే తెలిసికొని పరమ సుఖమును అక్షరమయిన జీవితమును పొందినటుల

"తస్మై ప్రోవాచ భగవా నాయుర్వేదం శతక్రతుః॥ పదైరల్పైర్మతిం బుద్ధ్వా విపులాం పరమర్షయే ॥ హేతు లింగౌషధ జ్ఞానం స్వస్థాతుర పరాయణం । త్రిసూత్రం శాశ్వతం పుణ్యం బుబుధేయం పితామహః॥ సో౽నన్తపారం త్రిస్కన్ధమాయుర్వేదం మహామతిః । యథావదచిరాత్సర్వం బుబుధే తన్మనామునిః॥ తేనాయురమితం లేభే భరద్వాజః సుఖాన్వితః । ఋషిభ్యో౽నధికం తచ్చ శశంసానవశేషయన్ । ఋషయశ్చ భరద్వాజాజ్జగృహుస్తం ప్రజాహితం । దీర్ఘమాయుశ్చికీర్షన్తో వేదం వర్ధనమాయుషః । మహర్షయస్తే దదృశుర్యథావత్ జ్ఞానచక్షుసా సామాన్యంచ విశేషంచ గుణాన్ ద్రవ్యాణి కర్మచ । సమవాయంచ, తద్ జ్ఞాత్వాతన్త్రోక్తం విధిమాస్థితాః । లేభిరే పరమం శర్మజీవితం చ అప్యనశ్వరమ్" మొదలు గాగల చరక (సూత్ర. అ. 1) వచనముల నుండి తెలియు చున్నది.

పుణ్యప్రదమయిన ఈ యాయుర్వేదమును సర్వభూతము లందు దయకలవాడయి ఆత్రేయుడు అగ్నివేశ, భేడ, జాతూకర్ణ, పరాశర, హారీత, క్షారపాణి అనెడి తన ఆరుగురు శిష్యులకు బోధించగా వారు దానింగ్రహించి ఒకొక రొకొక స్వతంత్ర గ్రంథమును రచియించి నటులను, వారలలోని కెల్ల అగ్ని వేశుడు బుద్ధివిశేషుడయి యుండుటచే నితడు ప్రథమమున

( తరువాయి 192వ పేజీలో )



స్వర్గీయ, కవిసింహ, వైద్యరాజ

**మండవ కాశీపతిగారు**

వీరు విశ్వబ్రాహ్మణులు. కృష్ణాజిల్లా మైలవరం నివాసులు. శ్రీ మైలవరం సంస్థాన వైద్యులు. ఆంధ్ర గీర్వాణ పండితులు, కవులు 70సం॥లు ఆయుర్వేద, యూనానీ వైద్య మందఖండ ప్రఖ్యాతి పొందిరి. «శ్రీమంతిని పరిణయము» పద్య కావ్యమును, “హరిశ్చంద్ర యక్షగానము”ను, ఆంధ్రమున «యూనాని వైద్యగ్రంథముల»ను వ్రాసిరి. వీరు శ్రీ బాలా త్రిపుర సుందరీ పీఠాధిపతులు. స్వకుల పురోహితులుగ, షోడశ కర్మలను వేదోక్తముగ చేయించెడివారు. 96సం॥ జీవించిరి 1938 ఆషాడ శుద్ధ పాడ్యమి శనివారమున స్వర్గస్థులైరి. వీరికి ఇద్దరు పుత్రులు ముగ్గురు కుమార్తెలు గలరు. వీరు ఆయుర్వేద పురోభివృద్ధికై కృషి చేయుచున్నారు





వైద్యశ్రీ, కవిరాజ

**చిలకపాటి రంగస్వామిగారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్

(గూడూరు, నెల్లూరుజిల్లా)

వీరు అనువంశిక వైద్యకుటుంబములోనివారు. వీరి జన్మస్థానము ఒంగోలు తాలూకా చిలకపాడు అను గ్రామం. చిలకపాడు అయుర్వేద వైద్యమునకు ప్రశస్తి చెందినది. వీరిపూర్వులు గొప్ప ఆయుర్వేద వైద్యులు వీరు ప్రస్తుతం నెల్లూరు జిల్లా గూడూరులో మెడికల్ ప్రాక్టీసు చేయుచున్నారు. వీరు పక్షవాతము, కుష్ఠు మొదలగు దీర్ఘ వ్యాధులను నివారణ చేయుటయందు కడుసమర్థులు. వీరికి ఆయుర్వేద వైద్యమునందు 25 సంవత్సరముల అనుభవము కలదు.

---

వైద్యశ్రీ

**మఠం ఈశ్వరయ్యగారు**

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్

అప్పిచర్ల పోస్టు, అనంతపురం జిల్లా.

వీరు గుత్తి తాలూకా ఆయుర్వేద వైద్యమండలి ఉపాధ్యక్షులు. ఆయుర్వేద ప్రచారము అత్యంత శ్రద్ధ భక్తులతో చేయుచుందురు. కవిరాజ పత్రికా పోషకులు.

---



కవిరాజ

శిష్ట్లా రాధాకృష్ణయ్యగారు

బాపట్ల (గుంటూరు జిల్లా)

జననం 5-9-1904. వీరు 32 సం॥ముల నుండి, గుంటూరు జిల్లా యందు ఉపాధ్యాయులుగను, ఆయుర్వేద వైద్యులుగను పనిచేయు చున్నారు.

వీరు 1948 సం॥ము నుండి కొద్దిపెట్టుబడితో “ఆంధ్రరత్న మోడల్ ఫార్మశీ” అను ఒక చిన్నసంస్థను నెలకొల్పి ఆయుర్వేదౌషధములు, పేటెంటు మందులు చేయుచు, బీదలకుచిత వైద్యసలహాలనిచ్చు చున్నారు.

వీరు విద్యార్థుల కుపయుక్తమగు 1) రఘువంశ కథలు 2) పల్నాటి వీరులు 3) కాశ్మీర కథావళి 4) సతీరత్నములు మున్నగు గ్రంథములరచించి ఆంధ్రభాషసేవ చేయుచున్నారు. వీరి ఆయుర్వేద వైద్యసేవ, విద్యాదానము, ఆంధ్రభాషా సేవ యెంతయు కొనియాడదగినది.



వైద్యశ్రీ

ఎద్దుల వెంకటయ్యగారు

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్

ముసలరెడ్డి పల్లి, కలసపాడు P. O.

బద్వేలుతాలూకా, కడపజిల్లా.

వీరు ఆయుర్వేదము శ్రద్ధ భక్తులతో అలవర్చు కొనుచున్న వారు. వైద్యశాస్త్రి శ్రీ అవధానం వెంకటసుబ్బయ్యగారి శిష్యులు.

---

# ఆయుర్వేద చరిత్ర

( 190వ పేజీ తరువాయి )

రచియింపగా అనంతరము భేడాదులు రచియించినటులను, వీరు తమ తంత్రములను ఋషిసంఘముతో కూడియున్న తమ గురువగు నాత్రేయునికి వినిపించగా ఋషులు సంతోషించి వాటిని అంగీకరించి “మీ యొక్క సర్వభూతహితము శ్రేష్ట మయినవని ఉచ్చైస్వరముతో పలుక” “అహా మీతంత్రములు అతిసాధువులు (చాలమంచివి)” అని ఆకాశాది భూతములు గంభీరముగ పలుక, నాశబ్దము మూడులోకములందును ప్రతి ధ్వనించగా మంగళప్రదమయిన వాయువు వీచి సమస్త దిక్కులు ప్రకాశించి జలయుక్తమయిన కుసుమవృష్టి కలిగ ననియు, తదాది ఆ తన్త్రములు భూలోకమున ప్రతిష్టనుపొంది ప్రచారము చెందిననియు చరకసూత్ర 1 వ అధ్యాయమునుండి తెలియుచున్నది. (తరువాయి ద్వితీయసంపుటములో)

# చరిత్రహీనుల దుశ్చర్యలవల్లనే ఆయుర్వేదం అభివృద్ధి నిలచిపోతూవుంది!!

సమీక్ష:— కవిరాజ మోహన్

దేశంలో ఆయుర్వేద సంఘాల, వ్యక్తుల స్వభావాలు, పొడతెగని తగవులు ఇత్యాది విషయములను గురించి ఈ ప్రత్యేక సంచికలో 20వ పేజీనుండి దాదాపు 60వ పేజీ వరకు వ్రాశాను. అంత దీర్ఘంగా పరిశీలించి సమీక్షించి వ్రాసినా – వ్రాయవలసిన విషయాలు మిగిలిపోయినవని తెల్పుతూ, అవసరంగా మరికొన్ని విషయములు గౌరవ సభ్యుల దృష్టికి తేవడం నాధర్మమైయున్నది ఇందులో ప్రకటించిన నా సమీక్ష ముగింపు మే 1 (1958) అని వ్రాసి యున్నాను. తదనంతరం కూడా యీ సంచిక మీ కందించులోపుగా జరిగిన ఘట్టములు సూచనగా వ్రాయుచున్నాను.

## ఆయుర్వేదాభివృద్ధి చేతల్లోగాక మాటల్లోనే ఎందుకుండి పోతూవుంది.

41 సం॥ లావచ్చింది మన సంఘం పుట్టి అని ఇదివరకే వ్రాశాను తదాది ఎన్ని సంఘాలు పుట్టినది ఎన్ని అంతరించినది సంఘాలతో సంబంధముగల వారందరికి తెలిసియున్న విషయమే ఇన్ని సంఘాలు యేర్పడి తలకొక దారిలో కార్యక్రమం నడుపుకొంటూ ఆయుర్వేదోద్యమమునకు దారితెన్నూ లేకుండా పోతూవుంటె కొందరు పెద్దలు ఈ అనైక్యత పరిదిద్ద వలెనని కృషి ప్రారంభమైనది. రెండేండ్ల అనంతరం ఒక నిర్ణయమునకు వచ్చాం. ఫలితమే నర్సాపురం సభలు అసభలకు వచ్చిన వైద్య ప్రముఖులంతా సభ్యులు గావుండి ఒక కార్యవర్గమును యేర్పరచుకొన్నారు. నాటి వరకుగల దేశంలో సంఘాలన్ని విలీనమై యేకైకమండలిగా "ఆంధ్ర ఆయుర్వేద వైద్య మండలి"ని యేర్పాటుచుకొన్నాం. నాటి సంఘాల ఐక్యసంఘటనకు దోహదమిచ్చిన సంఘాలన్నీ నిజాయితీతో కట్టుబడి వున్నవి. నాటికి ఆంధ్రప్రదేశ రిజిష్టర్డు కవిరాజ వైద్య మండలి అధిక సంఖ్యాక సభ్యత్వము గల సంఘము దానికి నేను ప్రధానకార్యదర్శి నగుటచేత – నూతన ఐక్యమండలికి నేనే ప్రధానకార్యదర్శి నగుటచే యావన్మంది సభ్యులతో నూతన ఐక్యమండలియైన ఆంధ్ర ఆయుర్వేద వైద్యమండలిలో విలీనమై పనిచేశాము. తదాది రాష్ట్రమంతటా పర్యటించి చేయబడిన కార్యక్రమం అందరూ ఎరిగిందే. ఈ కార్యక్రమాలు సమీక్షలో వివరించినవే మరొక పర్యాయము మీ దృష్టికి తెచ్చుచున్నాను.

- ది 26-12-53 తేదీని శ్రీ సంజీవిరెడ్డిగారి కొరకు విజ్ఞప్తి.
- ది 30-12-53 నాటి ఆరోగ్యమంత్రి శ్రీ సంజీవయ్యగారికి మెమోరాండము.
- ది 17-1-54 తేదీన ఆంధ్ర గవర్నరు శ్రీ చందూలాల్ త్రివేది గారివద్దకు రాయబారం.
- ది 17-1-54 న ఆంధ్రదేశములోని ఆయుర్వేద నాయకుల నాహ్వానించి సభజరిపి, నాటి ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశం పంతులుగారివద్దకు రాయబారము వెడలుటకు రాయబార కమిటిని నిర్ణయించుట.
- ది 4-2-54న కర్నూలు రాజధానిలో ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశం పంతులుగారివద్దకు రాయబారం వెడలుట.
- ది 28-2-54న ఆయుర్వేద సమగ్రస్థితికి 12 మందితో ఒక కమిటి ప్రభుత్వం వేసినట్లు ప్రకటించుట.

కమిటి రిపోర్టు ప్రభుత్వమునకు సమర్పించిన తరువాత ఆంధ్రప్రభుత్వ ఆరోగ్యశాఖామాత్యులుగా శ్రీ కళా వెంకటరావుగారు పదవీస్వీకారం చేయడం అతి దీక్షతో 41వ అఖిలభారత ఆయుర్వేద కాంగ్రెస్ మహాసభలు కర్నూలులో శ్రీ డాక్టరు అచంట లక్ష్మీపతి గారి నాయకత్వంలో 1955 డిశంబరు 29, 30, 31లలో జరిగినప్పుడు పూజ్య శ్రీ కళా వెంకటరావు పంతులుగారి ఉపన్యాసములో ఆయుర్వేదమును గురించు విషయములలో వారు సదభిప్రాయములు వెల్లడించుట – శ్రీ వారిచే ఆయుర్వేద వైద్యుల రిజిస్ట్రేషను చట్టము 16-8-57న జరుగుట ఇత్యాది ఆయుర్వేదాభివృద్ధి కార్యక్రమాలు అనంతరంగా జరిగినవి, వంటలాది సభలు, సమావేశాలు జరిగినవి. ఇన్ని కార్యక్రమాలలో కనిపించని వారు, నేడు ఆయుర్వేదాన్నుద్ధరిస్తామంటూ – చేయదగిన కార్యక్రమాలు చేయక – పదవుల భ్రమతో మండలికి ప్రతి

మండలులు, సంఘాలు రోజుకొకటి స్థాపించుతున్నామని ప్రకటనలు చేయడం కరపత్రాలు పంపకము చేయడం ప్రారంభించారు. ఈ కార్యకర్తల చరిత్ర పరిశీలించుటకు ఈ అయిదేండ్ల కార్యక్రమాలకు చక్కని సాక్ష్యాధారములుగల చరిత్ర చిత్రపటములతో సహా ప్రకటించాం. చూడండి వీరెక్కడైనా కన్పించుతారేమో. వీరెక్కడైనా ఒకటా రెంటా కన్పించితే అనామకంగానే గాని ఉన్నతస్థాయిలో కన్పించనే కన్పించరు. పని చేయగల సమయములో పని చేయవలెను గాని తమకు తామె గొప్పవాంమని ప్రచారము చేసికోవడం చరిత్ర హీనుల లక్షణమని చెప్పక తప్పదుగదా?

## ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి భారత దేశంలో యేరాష్ట్రమండలి సాటిరాదు.

భారతదేశంలో ఎన్నో రాష్ట్రసంఘాలున్నాయి. ఏ వొక్క సంస్థకైనా ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలికి గల కార్యక్రమం, వైద్యులసభ్యత్వంగలదా - పోనీ ఈ సంస్థ మాది, ఆ సంస్థ మాది అంటూ దుష్ప్రచారాలు చేస్తున్న ఈ సంఘ వ్యాపారస్తులకు యేనాడైనా ఇంతటి సభ్యత్వం ఈ సంఘంలో చూడగలిగారా? ఈ సంఘంలోగాదు - వారు నిర్మించుకొన్న గాలిమేడల సంఘాల్లో యేనాడైనా చూచారా? అసలు వారు జరిపేసభలు సభలేనా? పుట్టకెగరలేనివారు స్వర్గానికెగిరినట్లు పెద్దపెద్ద నివేదికలు, అనర్థపు అరపులు, అనైక్యతకు అనేక మార్గాన్వేషణలు జేసేవీరు ఎన్నో అవినీతి పనులకు దిగుతున్నారు. ఇదంతా ఎందుకు చేస్తున్నారో కారణం వారైనా చెప్పగలరా? పదవులు కావలెననే భ్రమలువుంటె వున్నసంఘములోనేవుండి ఆయా స్థాయిల నలంకరించవలెగాని ఆయుర్వేదాభివృద్ధి - చేతలకందకుండా మాటల్లోనే ఎందుకుండిపోతూంది. వారికది తోచదా, ఇచ్చిన పదవులకు విశిష్టత కల్గించుకొనలేకపోగా, ఇంకా వున్నత పదవులు కావాలని కోరుట దేనికి. నేడు గౌరవ మర్యాదలతో ప్రవర్ధమానమగుచున్న మహామండలిని కళంకపరచుటకొరకు "మహామండలి" స్థాపించామని కరపత్రాలు పట్టుకొని నిజ కార్యక్రమముగల మండలి ప్రధానత్వములోనివారిని నిందించటము అభాండాలు వేయడం ఎంత అబద్ధమాడుటకైనా వెనుకంజవేయక పోవడం, కులతత్వాలు లేవదీయడం, కాంగ్రెసు వారివద్దకువెళ్ళితే గౌరవ మర్యాదలతో జీవించుచున్న కార్యకర్తలు కమ్యూనిష్టులనడం, కమ్యూనిష్టు అధినేతలవద్దకు వెళ్ళినప్పుడు కాంగ్రెసువారిని నిందించడం - అదీయిదీ సాధ్యంగాక పోతే వర్గభేదాలు విజ్ఞాన వైషమ్యాలు రేకెత్తించడం - తమకు అవసరమైనదానికై, ఎటువంటి ఎంతమహోన్నత కార్యక్రమమైనా నిందలపాల్జేయుడమే దృక్పథంగల స్వభావులుయిట్టిపనికి పూనుకొని స్వలాభములకై పెనుగులాడుట దేశంలో వైద్యులంతా గుర్తించాలని వ్రాయక తప్పదుగదా?

ఇట్టి అనైక్య కార్యక్రమాలు జరుగుతున్నవని, జరుగుతాయని - అనేక పర్యాయములు కవిరాజపత్రికలో వ్రాసియున్నాము. మా పాఠకులకిది కొత్తగాదు.

## మనలో సంఘీభావం

అయిదేండ్లుగా మనము జరిపిన అపూర్వ కార్యక్రమాలన్ని యే ఆశయముతో చేయబడినవో ఆ ఆశయమును బలపరచి ఆచరణకు తెచ్చుటకే ప్రభుత్వం చట్టం చేసింది. చట్టం ఆచరణకు తెచ్చి దేశంలోని వైద్యులనందరిని రిజిస్ట్రేషను జరుపు కాలములో, ఈ అనైక్యరులు యీ సంఘాలు స్థాపించుచున్నారు దుర్వ్యామోహములకు తోడ్పాటుగా కొందరు వ్యక్తులు సహకరించుట ఎందుకంటె - వారి పాత అలవాట్లకు అవాంతరము వచ్చినందువల్ల. పాత అవాంతరములు అంటె సర్టిఫికెట్లు అమ్ముకోడం- రిజిస్ట్రేషను చేయించుతామని వందయేభై గుంజుకోవడం అలవాటుగలవారే యీ సొసైటిలో వున్నారు. వీరందరు కలసి వారిలాభాలు పోయినవని 'కవిరాజ మోహన్' దీనికి కారణమని కవిరాజ మోహన్, లంచగొండి, దొంగ, అంటూ ప్రచారం చేయడమొక పనిగాపెట్టుకొన్నారు అనవసర ప్రకటనలు చేయుట అలవర్చుకొన్నారు గాని సమర్థతతో కవిరాజమోహన్‌పై అట్టి నింద రుజువుచేయగలిగారా అదిసాధ్యంగాదు, నిశ్చయంగాగాదు గాని ఈ చరిత్ర హీనులు చేసిన అఘాయిత్యములు రుజువు చేయాలంటే ఎంతో సులభము.

ఇదంతా ముఖ్యంగా వ్రాయడ మెందుకంటె సంఘీభావంగల మనలో మనకు చీలికలు కల్పించి భిన్నరూపాలు కల్పించు నిష్ప్రయోజకుల ప్రకటనలకు, విజ్ఞప్తులకు ప్రచారములకు సోదర వైద్యులు చెవులొగ్గక - ఇప్పుడే స్థానములో నున్నారో ఆ స్థానములోనుండియే తమ రక్షణలకు ప్రయత్నించవలెను.

కార్యదర్శులు ఎవరుమారినా, అధ్యక్షులు ఎవరు మారినా సంస్థ మారదు. యే ఆశయము గల్గియున్నామో ఆ ఆశయముల సాధనకు మండలి పనిచేస్తుంది.

# సంఘాలు స్థాపించుకొన్నవారి పోకడలు...!

ఎవరికీ ఆహ్వానములు పంపకుండా ముచ్చటగా నల్గురే గూర్చొని పెద్దల సాక్ష్యముంచి యేవో కొన్ని సందేశాలు సంపాదించడం అదొక మహాసభయని ఉన్నత స్థాయిలోని మహాసంస్థల పేరు పెట్టుకొని పత్రికలో ప్రకటించి మేము ముందుకు వెళుతున్నామనడం సంఘ విజయరూపమునకు కళంకము లాపాదించడం ఒక ఘనకార్యంగా భావించడం-దేశంలో కొందరిపేర్లు జాబితాలో చేర్చి అదే నూతన మార్పులతో సంఘస్థాపన జరిగిందని ప్రచారం చేయడం - పనికిరాని పోకడలనిపించు కొంటాయిగాని మరెందుకు ఉపకరించవు. వీరు నిజంగా పలుకుబడిగలవారైతే సంఘసభ్యులున్న ప్రాంతములో సభలు జరిపి, పదుగురి ఆమోదముతో ఆ పదవులు సంపాదించుకొని మన్ననముగల వారమని చెప్పుకోవాలి. అదేమి లేకుండా గుస గుస వర్గాలతో ఉన్నత రూపంగల సంస్థలను మలిన పరచాలనుకుంటే యేనాటికీ మారని మనస్తత్వాలతో చీలికలు కల్పించడమే తమ జీవితమనుకొంటే - అసంఖ్యాక వైద్యబృందం తగురీతి బుద్ధిగరపుతుంది. మండలికి విరుద్ధంగా హైదరాబాదులో సభలుజరిపి ఇదే స్థాయి త్రొక్కుతున్న వారికి క్రొత్త మందలింపు అక్కరలేదు. ఆ విధంగానే జరుగుతుంది. అయితే తాత్కాలికంగా మహామండలికి చీలికలు కల్పించగలరేమోగాని అది స్థిరత్వం పొందలేదు.

గౌరవసభ్యులు ముఖ్యముగా గమనించవలసింది యేమిటంటే, "ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి" ఇటీవల మనము సంపాదించుకొన్న ఉన్నత స్థాయి మీరందరు ఎరుగుదురు. అది ఎన్నో శ్రమలు పడితేగాని లభించలేదు. ఆ ప్రతిభ చూచి సహించలేని వారు - ఆ ప్రతిభ గల సంస్థలో ప్రధాన స్థానాలు కావలను కొనేవారు ఆ సంస్థపేరునే దుర్వినియోగం చేస్తూ తలకొక రీతిలో అధ్యక్షులమని, కార్యదర్శులమని ప్రకటనలు చేసికొంటున్నారు ఆ తెగలోనిదే హైదరాబాదులో ఇటీవల యేర్పడిన కార్యవర్గం అది మహామండలికి చెందినది కాదు, అనుమతి బడసినది కాదు.

వ్యతిరేకముగా చేయబడినది మాత్రమే. ఇవన్ని స్పష్టం చేయుటకు విజయవాడలో మహాసభలు యీ సంవత్సరం జూలైలోనే ఆంధ్రప్రదేశ ఆయుర్వేదమహాసమ్మేళనము జరుప బడుతుంది. అందరికి ఆహ్వానములు పంపబడతవి అందులో ఒక కార్యక్రమం నిర్ణయం చేయబడుతుంది. సరియైన కార్యవర్గం యేర్పరుప బడుతుంది అంతవరకు నేనే ప్రధానకార్యదర్శిని. నేడు తాత్కాలికంగా ది 4-5-58వ తేదీని ఎన్నుకో బడిన ఆయుర్వేదాచార్య శిష్ట్లా సుబ్రహ్మణ్యశాస్త్రి గారి అధ్యక్షులు; నా ప్రధానకార్యదర్శిత్వమును తొలగించామని ప్రచారము చేయునది నిజముకాదు. నా ప్రధానత్వం తొలగించుటకు యీ అనామధేయులకు సాధ్యము గాదు. మండలికి గల ఆరువేలమంది ఆయుర్వేద సభ్యులకు గల అధికారానికి చెంది యున్నది. గాన ఎవ్వరు ఎలాంటి సందిగ్ధమును పడక - తమ 1957, 1958 సంవత్సరముల ప్రాథమిక సభ్యత్వము సరాసరి రాష్ట్రమండలి కార్యాలయమునకే పంపండి.

సరియైన విలాసము:

కవిరాజ మోహన్,

ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి.
గాంధీనగరం - విజయవాడ-2, అనిగుర్తించి వ్యవహరించండి.

మనసంస్థ శాఖాసంఘములలో కూడా కొంత అనైక్యత కు పదవీ వ్యామోహా పీడితులు తెచ్చిపెట్టారు. గనుక ఆ సంస్థల కట్టుబాటు పరిశీలించి, నిర్మాణాత్మకముగా నీతి నియతిలతో పనిచేయుచున్నవారలలో ఒక జాబితా పత్రికల్లో ప్రచురించెదము. అప్పుడు ఆయా ప్రాంతీయులు వారిననుసరించవచ్చును. ఇట్టి ప్రముఖవిషయములు తెల్సుకొనుటకై ది 15-6-58వ తేదిని ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి శాఖాసంస్థలైన జిల్లా, తాలూకా, మండలముల అధ్యక్ష, కార్యదర్శి, కార్యకర్తల సభ విజయవాడలో జరుగుతుంది. ఆ తీర్మానములు మీకు పంపబడును. అవి గమనించి వ్యవహరించండి.

## రిజిష్ట్రేషను

వైద్యుల రిజిస్ట్రేషను సందర్భములో యేవో కొన్ని అనైక్య ప్రచారములు జరుగుచున్నవి. అవేవి నిజముకాదు. యే మాటలకు చెవియొగ్గి సందిగ్ధావస్థలో పడవద్దు. తెలంగాణాలో రిజిస్ట్రేషను కావలసిన వారికి మనకు ఎలాంటి సంబంధము నేటివరకు లేదు. ఆబోర్డువేరు. ఆ బోర్డు మనబోర్డు విలీనము యింతవరకు జరగలేదు. మన 11 జిల్లాలకు యిదివరకు చెప్పుచున్న ప్రకారమే రిజిస్ట్రేషను జరుగుతుంది. త్వరితంగానే కార్యక్రమం ప్రారంభం అవుతుంది. మనసంఘాల చీలికలకు - ప్రభుత్వమునకుగాని, ఆయుర్వేద బోర్డుకుగాని ఎట్టి సంబంధము లేదు. దానికి మన నిరంతర తగవులకు ముడి

( తరువాయి 196వ పేజీలో )



వైద్యశ్రీ
గుండేపల్లి వెంకటకృష్ణారావుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్
గుంటూరు.

వీరు జాతీయ భావములు గలవారు. ఆయుర్వేద వైద్యము ప్రజారంజకముగా చేయువారు. ప్రత్యేక పరిస్థితులలో ప్రజారోగ్యమునకై సాహసముతో అహర్నిశలు పనిచేయుచుందురు. దేశములో గల మంచిని ప్రజానీకపు దృష్టికి తేవడం ఒక ఆశయంగా ఆంధ్రప్రదేశ సాకేర్ ప్రచురించారు. నేడు 'ఆంధ్రప్రదేశ సమాచార సర్వస్వము' అను ప్రత్యేకసంచిక ప్రచురించు చున్నారు.

## ప్రజాగౌరవము

ఇంత సులభమైన ఖరీదునకు 'క్రియాకల్ప' మంద చేయుట దేశానికి మహోపకారమని అభినందిం చుతూ జె. సి. హెచ్. పౌల్స్ వ్రాయుచున్నారు.



వైద్యశ్రీ
మునగపాటి రఘునాయకులుగారు
ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్
చెన్నూరు (పోస్టు) కడపజిల్లా.

వీరు ఆయుర్వేదము చక్కగా అభ్యసించిన అనువంశిక వైద్యులు, చికిత్సలలో నిపుణులు. సారస్వత ప్రియులు కవితా ధోరణి గలవారు. మంచి ఉత్సాహవంతులు. ఆయుర్వేద ప్రచారకులు.

## సంఘాలు స్థాపించుచున్న వారి పోకడలు...!

( 195వ పేజీ తరువాయి )

పెట్టి చేయుచున్న ప్రచారమంతా శుద్ధ అబద్ధము. ఎవ్వరు ఎట్టి పొరపాట్లు ప్రచారము చేసినా నమ్మకండి అతివాస్తవ వార్తలు, మీ నిరంతర క్షేమానికై కృషిచేయుచున్న "కవిరాజ పత్రిక" "ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్" అనే పత్రికలు చదివి తెలుసుకోండి. మీ క్షేమానికై పనిచేయు ప్రధానపత్రికలివి. కవిరాజపత్రిక ప్రతినెల 20వ తేదీని ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్ పత్రిక ప్రతినెల 5వ తేదీన ప్రకటింపబడుచుండును. అంతకు మించిన ప్రతివిషయము నాకువ్రాసి తెలిసికొన గోరుచున్నాను.

# సవరణలు

## వైద్యమహాశయుల చిత్రపటములు ప్రచురించుటలో గల లోపాలు

169వ పేజీలో వైద్య శ్రీ వరదా రామారావుగారు అని యున్న పేరును వెంకటరావుగారని చదువుకొన గోరుచున్నాము.

115వ పేజీలో డా॥ ఆర్. జాన్‌గారి చిరునామా రామాటాకీసువద్ద, కొత్తగూడెం శింగరేణి కాలరీస్ అని గమనించవలెను.

119వ పేజీలో నిలచియున్న చిత్రము శ్రీ రావర్తి అప్పారావుగారిది కాదు. శ్రీ అప్పారావుగారి ఫొటో 131 వ పేజీలో ముద్రించాము. ఇక నిలచియున్న చిత్రముగలవారి పేరు తెలియ లేదు. తెలుసుకొని ద్వితీయ సంపుటములో ప్రకటించెదము.

120వ పేజీలో వైద్యశ్రీ కొమ్మూజు సత్యనారాయణగారి చిత్రపటము ముందు వైద్యశ్రీ పానుగంటి శీతారామయ్యగారు అనివడింది. అందుకు సంబంధంగా ప్రకటించిన జీవిత సంగ్రహ మున్నూ శ్రీ శీతారామయ్యగారిదే.

122వ పేజీలో మొదటికాలంలోని మొదటిఫొటో వైద్యశ్రీ పానుగంటి శీతారామయ్యగారిది. పి. వి. చెన్నప్పగారిపేరు జీవిత సంగ్రహము పడింది.

122వ పేజీలో రెండోకాలంలోని రెండోఫొటో ముందు కొమ్మూజు సత్యనారాయణగారిపేరు జీవిత సంగ్రహం వుంది. వారు వైద్యశ్రీ పి. వి. చెన్నప్పగారు.

137వ పేజీలో మొదటికాలంలో మొదటిఫొటో ముందు పి సత్యనారాయణమూర్తి గారని వున్నది. వారిపేరది కాదు. వారిపేరు ప్రత్యేకముగా ద్వితీయ సంపుటములో ప్రచురింపగలం.

143వ పేజీలో శ్రీ యస్. వెంకారెడ్డిగారు అనుటకు బదులు వెంకటరెడ్డిగారు అని చదువుకొన గోరుచున్నాము.

168వ పేజీలో మొదటికాలంలో రెండోఫొటో ముందుగల పేరులో 'కొడిగి' అనుటకు బదులు కొడికంటి అని చదువుకొన గోరుచున్నాము.

ముఖ్యముగా 119వ పేజీ మొదటి కాలము లోని 2వ ఫొటో, 120లోని శ్రీ కొమ్మూజు సత్యనారాయణగారి ఫొటో, శ్రీ పానుగంటి శీతారామయ్యగారి ఫొటో, శ్రీ పి. వి. చెన్నప్పగారి ఫొటో, తిరిగి ద్వితీయ సంచికయందు ప్రకటించి సరిదిద్దగలము ఇట్టి యేలోపములు వుండినా సరిదిద్దెదము.

మరియు మాకు పంపబడిన ఫొటోలు అన్నియు బ్లాకులు చేయించితిము గాని వారిపేర్లు కుర్తింప సాధ్యముగాకున్నది. ప్రత్యేక సంచిక గమనించిన ఆయా మిత్రులు వారివారి విషయములు తెలిపిన ద్వితీయ సంపుటములో ప్రచురించెదము. ఈ పొరపాట్లకు మన్నించగోరుచున్నాము. (సం.)

## ఆంధ్రప్రదేశ ఆయుర్వేద మహామండలి ప్రధాన కార్యదర్శి
## శ్రీ కవిరాజ మోహన్ గారికి
## దేశవ్యాప్తంగా ప్రముఖ పండితులు, సంఘాలు సమర్పించిన
## సన్మాన పద్యరత్నములు

శ్రీకరాయురారోగ్య భాగ్యైకశోభ
లోకమందగాఁజేసి సుశ్లోకుడైన
యట్టి ధన్వంతరి మహాత్ము డహరహంబు
కరుణ కవిరాజ మోహనుఁ గాచుగాత.

ఆయుర్వేద మహాంధ్ర సంస్థను
ప్రధానామాత్యుడై వైద్య వి
ద్యా యోగంబులు దేశమంతటఁ బంవ్యాప్తం
బులై గ్రాల ని
చ్ఛాయుక్తిన్ కవిరాజ పత్రికను
సంచారాంశఁ గైశేసి సు
శ్రేయఃకాములగైన మీకు, విజయశ్రీ
లబ్బు మోహన్ సుధీ!

ఆయుర్వేద విశిష్ట
ధ్యేయాశయముల్ ప్రభుత్వ దృష్టికిగూడన్
ధీయుతులై దెల్పిన మీ
శ్రేయస్కర భావమునకు జేజేలు సుధీ!

ఆపద్బాంధవుడన్న వైద్యుడని నా
రార్యుల్ తదాలాపమే
లోపంబందిన నేటి తద్గతి సమాలోకించి
దేశీయ వై
ద్యోపాస్యామలశక్తి లోకముల
నెంతో వెల్గగాఁజేయు మీ
నైపుణ్యంబు ప్రశంసనీయమగు నెన్నన్
వైద్యవిద్వన్మణీ!

ఆంగ్లవైద్య ప్రభావాన నడుమ బడిన
తెలుగు వైద్యప్రశస్తిని తేటపరచి
యుద్ధరింపంగబూనిన యుక్తములగు
మీకుఁ గవిరాజ! నా నమోవాకములివి.

ఇట్లు
**గుంటూరు తాలూకా ఆయుర్వేద వైద్యమండలి.**

## కడపజిల్లా ఆయుర్వేద వైద్యమండలి

శ్రీమద్దివ్య మహౌషధోపవన మార్గజ్ఞో జలూకాచయం
రాజీవం విలస ద్ధిరణ్మయ సుధా కుంభంచ హస్తైర్వహన్
విద్యుద్భాను సహస్రదీప్తి విలసద్ధన్వంతరి స్థాపనుల్
పాయాత్త్వా మరవింద సుందర పదద్వంద్వోధకానందదః॥

బద్ధ్వోద్ధేహాళి మండలాంతర భిషక్సంసత్సద స్యోత్తమః
విద్వద్వైద్య విచారమేదుర మనీషా నవ్యభావాంచితః
ఆశాప్రాంత విలీన వైద్యక సముద్ధారే ప్రభూతాదరః
ఉట్టివంశపయోధి నిర్మల శశిశ్శ్రీ సూర్యనారాయణః॥

ఆయుర్వేద చికిత్సకోత్తమ రిజిష్ట్రేషన్ విధానోద్యమే
ధృత్వాభార మనన్యధార్య మవనీ సంభూత రామానుజః
ఆరోగ్యార్థిక మద్యపాన ముఖశాఖామాత్యవర్యా శ్శుభాః
సంస్తవ్యాస్సువిశాల రాష్ట్రికమిటీ సభ్యాశ్చ వైజ్ఞానికాః॥

శాస్త్రాభ్యాస రతాశ్చ కేచన వచోధారాళధారాంచితా,
కర్మాభ్యాస చణానువంశిక భిషగ్వార్యాన శాస్త్రాదరాః
శాస్త్రె కర్మపథానుభావ విషయే సమ్యక్సమానాశయా
స్సానందాః పరిశోధయంతు భిషజశ్శ్రీ "గృప్తికా"
ద్యౌషధీః॥

భిషజాం శాంత చిత్తానా మాయుషాగమ వేదినామ్
జ్ఞాతౌషధీ స్వరూపాణాం భద్రం లోకోపకారిణాం॥

ఇట్లు
**అయిలాపర్తుల రామకృష్ణశాస్త్రి,**
శ్రీ గౌతమపాదాయుర్వేదాశ్రమం,

# బద్వేలు తాలూకా ఆయుర్వేద వైద్యమండలి

శా॥ ఆయుర్వేద మహాంబుధిన్ దరచి లోకాహ్లాదకంబుల్ సుధా
ప్రాయంబుల్ వివిధౌషధంబులను సంపాదించిలోకాళికిన్
శ్రేయంబుల్ సమకూర్చు వైద్యవిబుధశ్రేణిన్ రమావల్లభుం
డాయుశ్శ్రీ విభవంబులిచ్చి దయతో నానందమున్
గూర్చుతన్.

శా॥ పాయక వైద్యశాస్త్రమును భావనసేయుచు నిత్యమున్ జగ
చ్ఛ్రేయము సల్పునట్టి సుభశీల సమంచితుడైన సూర్యనా
రాయణ నామధేయ కవిరాజ బిడౌజున కెల్లవేళలన్
శ్రేయములిచ్చు గాకమర సేవితుడౌ రఘురాము
డాదృతిన్.

కం॥ తనతోడి వైద్యలోకము
ననిశము సేవించునట్టి యఘ దూరసకున్
ఘనుడైన సూర్యనారా
యణ కవిరాజునకు శుభములమరుంగాతన్.

కం॥ అగదంకారాగ్రణికిని
విగత మహాఘోషనసను విద్వన్మణికిన్
నిగమాంతవేద్యుడగు నా
జగదీశుం డిచ్చుగాత సకలార్థములన్.

రచన

పండిత జంగా నరశింహశాస్త్రి



## పోతుగంటి చెన్నమల్లయ్యగారు,

ఆయుర్వేద మెడికల్ ప్రాక్టీషనర్

తుమ్మకోట, పల్నాడుతాలూకా, గుంటూరుజిల్లా.

### జీవిత సంగ్రహము

గుంటూరుజిల్లా గురజాలతాలూకా తుమ్మకోటలో రజక వర్గములో జన్మించిరి. ఇప్పటికి షుమారు 60 సంవత్సరములనుండి వీరికుటుంబములో ఆయుర్వేదవైద్యము వంశపారంపర్యా వచ్చుచున్నది. వీరి తాతగారు గురవయ్య, తండ్రి వీరయ్య, కోటయ్యగార్లు, తదనంతరము వీరును యింటి అనుభవ వైద్యవృత్తినే చేయుచుండిరి. హరిజనులకు బీదవారికి ఉచితముగా వైద్యము చేయుచు ప్రజామన్నన బడసిరి. వీరి హస్తము అమృతహస్తమని పేరుబడసినది. శ్రీ నందిగామ శేషకవిగారు వీరి ధన్వంతరీచరితము బుర్రకథా రూపమున ప్రసంగించిరి. గ్రహచికిత్సలు, వ్రణవైద్యము కూడ అనుభవములో చేయుచున్నారు.